శ్రీమతే రామానుజాయ నమః



తిరుప్పాణ్ ఆళ్వార్ అనుగ్రహించిన

# అమలనాదిపిరాన్

( పెరియవాచ్చాన్‌పిళ్ళై మణిప్రవాళ వ్యాఖ్యానం,
దానికి ఆంధ్రానువాదంతో )

అనువక్త

"పండితరత్న", వేదాంతవాచస్పతి
**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**

సమర్పణము

**త్రైవర్ణిక వైష్ణవ రామానుజ కూటం నిత్యకాలక్షేప గోష్ఠి**
**విజయనగరం**
**2015**

# అమలనాది పిరాన్ - తిరుప్పాణ్ ఆழ்ழ்వార్

(పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదంతో)

అనువక్త - "పండితరత్న", వేదాంతవాచస్పతి

**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**

ప్రతులు : **600**

అన్నిహక్కులు : అనువక్తవే.

ఆవిష్కరణము : తిరుప్పాణ్ ఆழ்ழ்వార్ తిరునక్షత్రం **26-11-2015**

ముఖచిత్రం : శ్రీరంగనాయకీ సమేత శ్రీరంగనాథుడు, శ్రీరంగం.

వేదిక : త్రైవర్ణిక వైష్ణవరామానుజకూటం,విజయనగరం

త్రైవర్ణిక వైష్ణవ రామానుజ కూటం నిత్యకాలక్షేపగోష్ఠి సభ్యులు
భక్తిశ్రద్ధలతో సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో
ఈ గ్రంథం ముద్రణ చేయబడింది.

ప్రతులకు : శ్రీమతి కె.జానకి గారు
18-3-38(ఏ)
గుండాల వారి వీధి, విజయనగరం
☎ 08922 - 225070, సెల్ : 9989893954

అక్షరయోజనము: శ్రీమతి జయలక్ష్మి మరియు
శ్రీచంద్రశేఖర్

ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి





న్యాయవేదాంత విద్వాన్, ఉభయవేదాంత భాస్కర
**ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు**
భారద్వాజభవనం, కోవెల వీధి, నరసాపురం.

# మంగళా శాసనమ్

భగవానుని నిర్హేతుకకృపవల్ల భక్తిరూపాపన్నజ్ఞానాన్ని పొందిన ఆழ்ழ்వార్లు అనుగ్రహించిన దివ్యప్రబంధాలు ద్రావిడవేదంగా ప్రసిద్ధి చెందాయి. ఈ ప్రబంధాలలో వేదసారం ఉపదేశింపబడినందున వీటికి ఈపేరు వచ్చిందని పెద్దల అభిప్రాయం. నాలాయిరదివ్యప్రబంధమనే పేరుకూడా వీటికి ప్రసిద్ధంగా వ్యవహరింపబడుతున్నది.

ఆழ்ழ்వార్ల ప్రబంధాలు ముదలాయిరమ్, పెరియతిరుమొழ்ழி, ఇయఱ్పా, తిరువాయ్‌మొழ்ழி - అనే నాలుగు విభాగాలుగా వర్గీకరింపబడ్డాయి. ఈ నాలుగు, శ్రీవైష్ణవ సంప్రదాయంలో రహస్యత్రయంగా చెప్పబడే అష్టాక్షరి, ద్వయం, శ్రీకృష్ణ చరమశ్లోకం అనే మూడిటిలోని తాత్పర్యాన్ని బోధిస్తున్నవని పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ క్రమంలో, ముదలాయిరంలోని ప్రబంధాలలో మొదటిదైన తిరుప్పల్లాండు నుండి అమలనాదిపిరాన్‌వరకు గల ప్రబంధాలన్నీ అష్టాక్షరిలో మొదటగల ప్రణవం యొక్క అర్థాన్ని తెలుపుతున్నవి. తిరుప్పల్లాండు ప్రబంధం **"వేదత్తుక్కు ఓమెన్ను మదుపోల్"** అనే శ్రీమణవాళమహామునుల సూక్తిక్రమంలో ప్రణవార్థాన్ని విశదీకరిస్తున్నది. ఈ ప్రణవంలోని అకార, ఉకార, మకారాల అర్థం పెరియాழ்ழ்వార్ తిరుమొழ்ழி మొదలు తిరుప్పళ్ళి యెழ்ழுచ్చివరకు గల ప్రబంధాలు వివరిస్తున్నాయి. చివరిగా అమలనాదిపిరాన్ ప్రబంధం ప్రణవాన్ని శబ్దతః, అర్థతః అనుసంధిస్తున్నది - అని అభిజ్ఞులైన పూర్వాచార్యుల వ్యాఖ్యాన ప్రక్రియ. ఈ విధంగా తిరుప్పల్లాండు ప్రబంధంతో ఆరంభమైన ప్రణవార్థ వివరణం అమలనాదిపిరాన్ ప్రబంధంతో పూర్తి అవుతున్నది. దీనికి పిమ్మట గల కణ్ణినుణ్‌శిఱుత్తాంబు ప్రబంధం నమఃశబ్దార్థ వివరణమై ఉండడం గమనించదగినది.

**"వాయ్‌త్త పుగழ்ழ்"** అని వరవరమునులచే కీర్తింపబడిన తిరుప్పాణ్ ఆழ்ழ்వార్లు అనుగ్రహించిన అమలనాది పిరాన్ ప్రబంధంలో పలు రహస్యార్థాలు ఇమిడి ఉన్నాయి. ముఖ్యంగా, ఈ ప్రబంధంలో భగవానుని దివ్యమంగళవిగ్రహానుభవం ప్రపన్నునకు

ఉపాదేయమనే విషయం సూచింపబడింది. ఈ ప్రబంధంలోని మహార్థాలను పలువురు పూర్వాచార్యులు తమ వ్యాఖ్యలలో అందించారు. పెరియవాచ్చాన్‌పిళ్ళై, అఝగియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్, శ్రీవేదాంతదేశికులు అనుగ్రహించిన వ్యాఖ్యానాలలోని రసఘనాలైన అర్థాలు సదాచార్య సన్నిధిలో కాలక్షేపక్రమంలో అధికరించదగినవి.

విజయనగరంలోని త్రైవర్ణిక వైష్ణవ గోష్ఠివారు కీర్తిమూర్తులు ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్య స్వామివారి అనుగ్రహంవల్ల చక్కని, దృఢమైన సంప్రదాయనిష్ఠను పొందారు. ఈ స్వామివారి తరువాత, వీరి పుత్రికామణి, విదుషీమణి శ్రీమతి జానకమ్మగారి వద్ద నాలాయిరదివ్య ప్రబంధాలను కాలక్షేపక్రమంలో పూర్వాచార్య వ్యాఖ్యానాలతోపాటుగా సేవించడం గోష్ఠివారి అదృష్టం. ఈ క్రమంలో, ప్రస్తుతం తాము కాలక్షేప చేయబోయే అమలనాదిపిరాన్ ప్రబంధాన్ని పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానంతో, దానికి ఆంధ్రాను వాదంతో గోష్ఠివారు ముద్రించడం వారి సంప్రదాయ సేవానిరతికి తార్కాణం. వీరి చేసే ఈ ప్రయత్నం ప్రశంసనీయం. ఈవిధంగానే గోష్ఠివారు భగవద్రామానుజ సంప్రదాయ ప్రచారానికి పనికివచ్చే సద్గ్రంథాలను ప్రకాశింపజేసి, పెద్దల మంగళాశాసనాలకు పాత్రం కావాలని కోరుకుంటున్నాను. గోష్ఠి సభ్యులకు చక్కని మార్గదర్శనం చేస్తున్న శ్రీమతి జానకమ్మ గారిని అభినందిస్తున్నాను. పెరియ వాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదాన్ని అందించిన కుమారుడు చి॥ శింగరా చార్యులకు అనేక మంగళాశాసనములు. స్వస్తి.

ఇట్లు

భాగవత విధేయుడు

**ఈయుణ్ణి రంగాచార్యులు**

నరసాపురం

18-11-2015





శ్రీమతే రామానుజాయ నమః



**ఉభయవేదాన్త వాచస్పతి, ద్రావిడవేదాన్త విశిష్టపండిత, పండితరత్న**

Vidyapraveena & Bhashapraveena

***K. Venkatacharyulu,*** M.A.,

Retd., Head of the Dept. of Telugu,
Sri Y.N. College, Narasapur,
4-1-22/1, Kovela Street, Narsapur-534 275
W.G. Dt., Phone: 08814-275811

STHANACHARYA
Sri Adikesava & Emberumanar
Swamy Temple.

Date : 16-11-2015

స్వస్తిశ్రీర్దిశతాత్

## అమలనాదిపిరాన్ - వైశిష్ట్యము

శ్రియఃపతి నిర్హేతుకకటాక్షంతో సర్వతోభద్రజ్ఞానభక్తిపూర్ణులైన ఆఝ్వార్లలో తిరుప్పాణనార్ స్థానం విశిష్టమైనది. యాఝ్పాణరైన (వీణావాదననిపుణులు) వీరు, లోకసారంగమహామునీంద్రుల భుజములను భాగవతదాసులై అధిష్ఠించి, "శ్రీరంగనాథుని ఆపాదమస్తకమైన దివ్యావయవ సౌందర్యాన్ని సేవించిన నా నేత్రాలు బాహ్యప్రపంచాన్ని చూడలే"వని పేర్కొని, శ్రీరంగనిలో "ఆండాళ్" వలె లీనమైనారు.

ఈ ఆఝ్వార్ల అనుభవ పరీవాహరూపంగా పదిపాశురాలు గల ఈ దివ్యప్రబంధం అవతరించింది. ఈ దివ్యప్రబంధమునకు కొన్ని ప్రత్యేకతలు కలవు.

1. తిరువాయ్‌మొఝి యందువలెగాక ప్రణవాన్ని అకార ఉకార మకార క్రమములో పాశురాల్ని ప్రారంభించి వేదసారాన్ని అనుగ్రహించుట.

2. శ్రియఃపతి అర్చావిభవావతారాలను, కల్యాణగుణగణాలను అనుభవించుట.

3. ఇరామానుశనూత్తన్దాది దివ్యప్రబంధంలో అముదనార్ ముదలాఝ్వార్లకు పిమ్మట తిరుప్పాణనార్‌దివ్యప్రబంధ వైభవాన్ని, భగవద్రామానుజులకు వీరి పాదారవిందములో గల భక్తిని పేర్కొనుట.

4. శ్రీరంగంలో భగవద్రామానుజుల సన్నిధిలో ప్రాబోధికప్రబంధములతో పాటు ఈ దివ్యప్రబంధాన్ని ప్రతినిత్యం సేవించుట.

5. పూర్వాచార్యులు ఈ దివ్యప్రబంధానికి రసఘనములైన వ్యాఖ్యానాలను కూర్చుట.

6. శ్రీవేదాంతదేశికసార్వభౌములు దీనికి **"మునివాహనభోగం"** అనే తమిళ వ్యాఖ్యానాన్నే కాక **"భగవత్ ధ్యానసోపానం"** అనేపేర సంస్కృతంలో దశకాన్ని అనుగ్రహించుట.

నాలాయిర దివ్యప్రబంధాలకు వాఖ్యాతృసార్వభౌములైన శ్రీపెరియవాచ్చాన్‌పిళ్ళై గారు **"నామూలం లిఖ్యతే కించిత్ నానపేక్షిత ముచ్యతే"** అనే రీతిలో వాఖ్యలను కృప చేసినారు. తిరువాయ్‌మొழிకి (ఈడువ్యాఖ్యానము) తప్ప మిగిలిన దివ్యప్రబంధములకు పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానములు కాలక్షేప పరంపరలో ఉన్నవి.

విజయనగరం త్రైవర్ణిక వైష్ణవ రామానుజ కూటం గోష్ఠివారు తమ ఆచార్యపుత్రి, ఉభయవేదాంత విదుషీమణి యైన శ్రీమతి జానకమ్మ గారి కృపతో దివ్యప్రబంధాలను కాలక్షేప పద్ధతిలో సేవించుచున్నారు. దీనికి తగినట్లుగా ఈ వ్యాఖ్య పై గోష్ఠివారి పవిత్ర ద్రవ్యసహాయంతో ముద్రింపబడుచున్నది. ఈమహత్కార్యానికి కర్ణధారులై పండితరత్న, శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్య స్వామివారు ఉండుట మిక్కిలి ప్రశంస నీయము. ఈ గోష్ఠివారికి అస్మదారాధ్యదైవమైన ఎమ్బెరుమానార్ స్వామి సర్వ శ్రేయస్సులను ప్రసాదింతురు గాక!

ఇట్లు
భాగవత విధేయుడు
[signature]



# ముందుమాట



**శీరియ నాన్మఱై చ్చెమ్బొరుళ్, శెన్దమిழాల్ అళిత్త**
**పారియలుమ్ పుకழ் పాణ్ పెరుమాళ్, శరణామ్ పదుమ -**
**త్తారియల్ శెన్ని యిరామానుశన్‌తన్నై చ్చార్‌న్దవర్‌తమ్**
**కారియవణ్మై, ఎన్నాల్ శొల్లొణాదు ఇక్కడలిడత్తే**
**(ఇరామానుశనూఱ్ఱన్దాది-11)**

(వాస్తవమైన అర్థాలను ప్రతిపాదించే గొప్పతనాన్ని కల నాల్గు వేదాలలోని అందమైన సారార్థాలను గొప్ప ద్రావిడభాషలో అనుగ్రహించినవారు, భూలోకంలో అంతటా వ్యాపించిన కీర్తిని కలవారైన తిరుప్పాణ్ పెరుమాళ్ శ్రీపాదాలు అనే పద్మాలతో అలంకరింపబడ్డ శిరస్సును కలవారు, శ్రీరామానుజులు. వారిని ఆశ్రయించిన మహానుభావుల అనుష్ఠానవైలక్షణ్యాన్నిగూర్చి సముద్రపరివేష్ఠితమైన ఈ భూలోకంలో వర్ణించి చెప్పి ముగించడం నాకు సాధ్యం కాదు)

తిరువరఙ్గత్తముదనార్ అనే ఆచార్యవర్యులు ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధంలో తిరుప్పాణ్ పెరుమాళ్‌ను స్తుతిస్తూ అనుగ్రహించిన పై పాశురంలో, ఆ ఆழ்వార్లు వేదాలలోని ఉపాదేయతమమైన అర్థాన్ని తమ ప్రబంధంలో అందమైన ద్రావిడభాషలో కృపజేశారని అన్నారు. ఈ సూక్తిని వ్యాఖ్యానించే శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ అనే ఆచార్యులు **"సా హి శ్రీ రమృతా సతామ్"** (వేదమే కదా సత్పురుషులకు నశించని సంపద) అనే రీతిలో సత్పురుషులకు గొప్ప సంపదగా, ఋగ్యజుస్సామాధర్వణ నామాలతో నాల్గు విధాలుగా ఉండే వేదాలలో గల **"అసార మల్పసారం చ సారం సారతరం త్యజేత్, భజేత్ సారతమం శాస్త్రమ్"** అనేటట్లుగా ఉపాదేయతమమైనది అష్టాక్షరి అని, దానికి ప్రకృతి ప్రణవమని, ఆ ప్రణవంలోని అవయవాలైన అకార, ఉకార, మకారాలలోని అర్థవిశేషాలను తిరుప్పాణ్ ఆழ்వార్లు

తమ అమలనాదిపిరాన్ ప్రబంధంలోని **"అమలన్", "ఉవన్ద ఉళ్ళత్తనాయ్", "మన్ది పాయ్"** అనే ప్రథమ – ద్వితీయ – తృతీయ పాశురాలలో ఆరంభంలో వరుసగా ఆ అక్షరత్రయంలో మొదలవుతున్న పదాలను ప్రయోగించడంద్వారా ప్రకాశింప జేసి, ఆ ప్రబంధంలో ప్రణవార్థాన్ని రమ్యంగా ప్రతిపాదించారని తెలిపారు. అందువల్ల అమలనాదిపిరాన్ ప్రబంధం చతుర్వేదసారమని అష్టాక్షరీసారమని, ప్రణవ రూపమని పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ ప్రబంధం ఆకారంలో చిన్నదే అయినా **"బిందౌ సింధుః"** అనే రీతిలో మహాసముద్రం అంతటి గంభీరాలైన పలు అర్థాలను తనలో ఇముడ్చుకున్న వైలక్షణ్యాన్ని కల్గినది. ప్రపన్నులు నిత్యం అనుసంధించుకోవలసిన ప్రబంధాలలో ఇది ఒకటి. ఇందులో శ్రీరంగనాథుని దివ్యరూపం ఆపాదమస్తకం స్తుతింపబడింది. **"తేశారుమ్ శిచ్చన్ అవన్శీర్వడివై"** అని అంటూ శ్రీవరవర మునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో శిష్యుడు ఆచార్యుని దివ్యమంగళ విగ్రహాన్ని ఆదరించాలని, అది అతని కర్తవ్యమని అన్నారుకదా! ఆచార్యపరంపరలో **"ఆభగవత్తః"** అనే క్రమంలో భగవానుడు ప్రథమాచార్యుడు కదా! విధంగా కూడా భగవానుని దివ్యమంగళ విగ్రహధ్యానం ఈ ప్రబంధానుసంధానంద్వారా విధింపబడిందని చెప్పవచ్చు.

ఈ ప్రబంధాన్ని పెరియవాచ్చాన్పిళ్ళై, అ*ழ*కియ మణవాళప్పెరుమాళ్ నాయనార్, వేదాంత దేశికులు – అనే ముగ్గురు పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు. ఇటీవలి కాలంలో కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామివారు నాతిసంగ్రహమైన దివ్యార్థదీపిక వ్యాఖ్యను రచించారు.

ప్రస్తుతం పెరియవాచ్చాన్పిళ్ళై అనుగ్రహించిన నాతివిస్తృతమైన మణిప్రవాళ వ్యాఖ్య, దాని ఆంధ్రానువాదం ముద్రింపబడుతున్నవి. ఈ ఆంధ్రానువాదం మాత్రం గతంలో సికింద్రాబాద్లోని **"శ్రీరామానుజ సిద్ధాంతసభ"** ద్వారా ప్రచురింపబడినది. ప్రస్తుతం పెరియవాచ్చాన్పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానంకూడా చేర్చి ముద్రింపబడు తున్నది. ఈ గ్రంథముద్రణం విజయనగరం త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటం నిత్య కాలక్షేపగోష్ఠి సభ్యులు సమర్పించిన ద్రవ్యంతో చేయబడుతున్నది. విజయనగరం త్రైవర్ణిక గోష్ఠి వారి సంప్రదాయ సేవ పలువురి పెద్దల ప్రశంసలకు పాత్రమైనది. ఇపుడు వీరు



చేసే ఈ సత్కార్యము తప్పక అందరి మన్ననలను పొందగలదనడంలో సందేహం లేదు. ఈగోష్ఠి సభ్యులద్వారా ఇంతకుముందే పలు సంప్రదాయగ్రంథాల ముద్రణ జరిగింది. భవిష్యత్తులో కూడా వీరిద్వారా మరిన్ని సంప్రదాయ గ్రంథాల ప్రచురణ శ్రీరామానుజులవారి దివ్యానుగ్రహంతో జరుగగలదని ఆశిస్తున్నాను. అమలనాదిపిరాన్ ప్రబంధాన్ని వ్యాఖ్యానసహితంగా ముద్రించి ప్రపన్నులకు సమర్పించే గోష్ఠి సభ్యులను మనసారా అభినందిస్తున్నాను. నాకు ఈ గ్రంథ ముద్రణలో అవకాశాన్ని ఇచ్చినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతలను సోదరీమణి శ్రీమతి కె.వి. జానకమ్మ గారికి సమర్పించు కుంటున్నాను. అనువాదాన్ని అవలోకించి మంగళాశాసనాలను అందించిన ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారికి, ఉ.వే.శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్య స్వామివారికి కృతజ్ఞతాపూర్వకంగా దాసోహసమర్పణము చేస్తున్నాను. గ్రంథముద్రణలో సహకరించిన శ్రీచంద్రశేఖర్ (తిరుపతి) గారికి, శ్రీహర్షవర్ధన్ గారికి కృతజ్ఞతలు.

**శ్రీరంగాధిపదివ్యమంగళవపుస్సౌందర్యసారామృత –**
**స్రోతోమగ్నమునీంద్రవాహనగుణోదన్వన్నిమగ్నాశయమ్ ।**
**చేతః! కాంతవరం విచింతయ మునిం యచ్చింతనం సంతతం**
**కుర్వంతో హి విదంతి దైవమపరం సంతో న యస్మాత్పరమ్ ॥**

**(ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ – వరవరమునిశతకమ్–49)**

(శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహసౌందర్యసారమనేది ఒక అమృత ప్రవాహం. దానిలో మునిగినవారు తిరుప్పాణ్ ఆ*ழ*్వార్లు. వారి కల్యాణగుణాలనేవి ఒక సముద్రం. అందులో మునిగిన హృదయాన్ని కల శ్రీవరవరమునులను, ఓమనసా! ధ్యానించు. ఈ వరవరమునుల ధ్యానాన్ని చేసే సత్పురుషులు ఇక వేఱొక దైవాన్ని దేనినీ తెలియరు కదా)

ఇట్లు, విన్నవించు
భాగవత విధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

తిరుపతి
18–11–2015

# తిరుప్పాణ్ ఆళ్వార్ వైభవమ్

**వృశ్చికే రోహిణీజాతం శ్రీపాణిం నిచుళాపురే ।**
**శ్రీవత్సాంకం గాయకేంద్రం మునివాహన మాశ్రయే ॥**

(వృశ్చికమాసంలో రోహిణీ నక్షత్రంలో నిచుళాపురి అనే ఉఱైయూర్‌లో భగవానుని శ్రీవత్సమనే పుట్టుమచ్చ అంశంగా అవతరించినవారు, వీణను చేతిలో ధరించి శ్రీరంగనాథుని మనస్సును రంజింపచేసినవారు, లోకసారంగమునిని వాహనంగా కల్గినవారైన తిరుప్పాణ్ ఆళ్వార్లను ఆశ్రయిస్తున్నాను.)

**శ్రీలోకసారంగమహామునీంద్రస్కంధాధిరూఢం కలయామి నిత్యమ్ ।**
**కళంకహీనం కమనీయభక్తం కవీశ్వరం గాయకసార్వభౌమమ్ ॥**

(శ్రీలోకసారంగమహాముని భుజాలను అధిరోహించినవారు, ఏదోషం లేనివారు, పరమపురుషునిపట్ల గొప్ప భక్తిని కలవారు, కవులలో గొప్పవారు, పాడేవారిలో ప్రముఖులు అయిన తిరుప్పాణ్ ఆళ్వార్లను ఎల్లప్పుడు స్మరిస్తున్నాను)

**శ్రీవేలాబ్దవినిర్గమే కలియుగే సంవత్సరే దుర్మతౌ**
**భానౌ వృశ్చికభాజి పంచమదినే వారే బుధస్యోత్తమే ।**
**రోహిణ్యా సహితే లసద్యుదుపతౌ కృష్ణే ద్వితీయే తిథౌ**
**సంజజ్ఞే మునివాహన శ్చరణయోః యో రంగిణోఽంతర్దధే ॥**

(శ్రీరంగనాథుని శ్రీచరణాలలోనే లీనమైనవారైన తిరుప్పాణ్ ఆళ్వార్లు కలియుగంలో **"శ్రీవేలా"** అనే అక్షరాల చేత కటపయాది అక్షర సంఖ్యాక్రమంలో నిర్దేశింపబడే మూడువందల నలభై రెండు వర్షాలు గడచిన తరువాత, దుర్మతినామ సంవత్సరంలో ఉదయసూర్యుడు వృశ్చికరాశిని పొందిన కార్తికమాసంలో అయిదవనాడు గొప్పదైన బుధవారంనాడు, చంద్రుడు రోహిణీనక్షత్రంతో కలిసినవాడై ప్రకాశించగా కృష్ణపక్షద్వితీయాతిథిలో అవతరించారు)

**అథ తత్ర కులేఽంతిమే రమారమణోరఃస్థితలాంఛనాంశజః ।**
**సమజాయత పాణసంజ్ఞకః సుకవిః కార్తికమాసి వైధభే ॥**

(తరువాత ఆ పాణకులంలో శ్రీమన్నారాయణుని వక్షఃస్థలంలో వెలిగే శ్రీవత్సం యొక్క అంశగా, గొప్పకవులైన తిరుప్పాణ్ ఆళ్వార్లు కార్తికమాసం రోహిణీనక్షత్రంలో అవతరించారు.)



నీళాదేవి అవతారమైన కమలవల్లి నాచ్చియార్‌ను కుమార్తెగా పొంది, ఆమెను శ్రీరంగనాథునకు పాణిగ్రహణాన్ని చేసిన చోళరాజు రాజ్యపాలన చేసే కాలంలో **"కులమ్ తాజ్గు నాలిలుమ్ కీళ్ ఇళిన్దు"** అని చెప్పబడిన పంచమ వర్ణంలోని **"నమ్‌పాడువాన్"** (మాలదాసరి) వలె అవతరించినవారు ఈ ఆళ్వార్లు. తిరుక్కుఱుజ్గుడి అనే దివ్యదేశంలో గానకైంకర్యం చేసిన ఆ మాలదాసరివలె వీణను చేతిలో ధరించి "భూలోకవైకుంఠంగా కీర్తింబడే శ్రీరంగాన్ని అత్యంతం హీనకులంలో పుట్టిన నేను కాలితో స్పృశించరాదు" అని భావించి, కావేరీనది దక్షిణతీరంలోనే ఉండి, నిత్యసూరులు సామగానాన్ని చేసే రీతిలో, ప్రతిదినం శ్రీరంగనాథునిగూర్చి పాడి ఆనందింపజేసేవారు. **"పాణర్"** కులంలో అవతరించడంవల్ల **"తిరుప్పాణర్"** అని పిలువబడ్డారు. ఈ రీతిలో శ్రీరంగనాథుని పట్ల పరభక్తి- పరజ్ఞాన- పరమభక్తులను కలవారై, వేఱు దేనినీ తెలియనివారై, కన్నులను మూసికొని, శ్రీరంగనాథుని వీరు ఒకనాడు గానం చేస్తూ ఉండగా, శ్రీరంగనాథునకు తిరుమంజనం చేయడానికి కావలసిన తీర్థాన్ని తీసికొని రావడంకోసం ప్రాతఃకాలంలో తిరుమంజన తీర్థకలశాన్ని తీసికొని అక్కడకు వచ్చిన లోక సారంగమహాముని వీరిని చూచి "దూరంగా పో" అని అన్నారు. కాని, గానంలో మునిగి ఉన్న ఆళ్వార్లకు ఆ మాట చెవిలో పడలేదు. అపుడు లోకసారంగముని ఒక రాయిని తీసికొని వారిపై విసరగా, ఆ రాయి ఆళ్వార్ల ముఖంపై తగిలి రక్తం కారింది. అపుడు ఆళ్వార్లు కళ్ళు తెఱచి చూచి బాధపడి, "మహాభాగవతులైన లోకసారంగమునిపట్ల అపచారం చేశానుకదా!" అని తలచి దూరంగా పోయి నిలబడ్డారు. లోకసారంగముని స్నానం చేసి, నిత్యకర్మానుష్ఠానాలను ముగించుకొని, తిరుమంజనతీర్థాన్ని తీసికొని, ఛత్రచామరవాద్యఘోషాదులతో ఆలయానికి వెళ్ళారు. తిరుప్పాణ్ ఆళ్వార్ల ముఖంలో తగిలిన దెబ్బ శ్రీరంగనాథుని మనస్సులో తగిలినందువల్ల, ఆ స్వామికి మనస్సులో చాలా బాధ కల్గింది. దానిని చూచిన శ్రీరంగనాయకి "మనకు అంతరంగభక్తుడైన తిరుప్పాణ్ పెరుమాళ్‌ను బయట నిలిచేటట్లు కాకుండా, లోపలకు ఆహ్వానించండి" విన్నపించింది. శ్రీరంగనాథుడు ఆ కోవెల తలుపులను మూయించి, లోక సారంగమునితో అర్చకముఖంగా "నా కుమారునివంటి తిరుప్పాణ్‌పట్ల మీరు ఈ రీతిలో అపచారపడవచ్చునా?" అని తన కోపాన్ని అర్చకముఖంగా ప్రదర్శించి, తన ఆలయకవాటాలను తెఱవకుండా మూసి ఉండేటట్లు చేశాడు. "మహాభాగతుని

పట్ల అపచారం చేశానే! అయ్యో!" అని చాలా క్లేశపడిన లోకసారంగమునికి కలలో ఆ రాత్రి శ్రీరంగనాథుడు ప్రత్యక్షమై, భాగవతాపచారంనుండి బయటపడే ఉపాయాన్నిగూర్చి తనను అడిగిన ఆ మునితో "నాకు అంతరంగభక్తుడైన పాణ్ పెరుమాళ్‌ను మీరు తక్కువగా భావించకుండా, మీ భుజాల పైకి ఎక్కించుకొని నా దగ్గరకు తీసికొనిరండి" అని ఆజ్ఞాపించాడు.

లోకసారంగముని మఱునాటి ఉదయం లేచి స్వప్నాన్ని స్మరించి, చాలా ఆనందించారు. శ్రీరంగనాథుని ఆజ్ఞను శిరసా వహించి, కావేరీనదిలో స్నానం చేసి, నిత్యానుష్ఠానాలను పూర్తి చేసికొని తానున్న చోటుకు చాలా దూరంలో గానం చేస్తూ నిలచి ఉండే తిరుప్పాణ్ ఆళ్వార్ల దగ్గరకు పోయి, వారి శ్రీచరణాలలో శిరసా నమస్కరించి, "శ్రీరంగనాథుడు మిమ్ములను వేంచేపు చేసికొని రమ్మని నన్ను ఆజ్ఞాపించాడు" అని విన్నపించారు. ఆళ్వార్లు ఉన్నత కులంలో దేనిలోను జన్మించని తమ నైచ్యాన్ని అనుసంధించి వెనుకంజ వేయగా, లోకసారంగముని భగవదాజ్ఞనుగూర్చి తెలిపి, చాలా నిర్బంధించారు. అప్పటికీ తిరుప్పాణ్ ఒప్పుకోకుండా "శ్రీరంగనగరంలో నేను ఏవిధంగా కాలు మోపగలను?" అని సందేహించారు. లోకసారంగముని "ఆ విధంగా భావిస్తే, దాసుడనైన నా భుజాలపైకి వేంచేయండి. శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారంగా మిమ్ములను వేంచేపు చేసికొని వెళ్ళగలను" అని అనగా, తిరుప్పాణ్ భగవద్భాగవత నియమనాన్ని దాటలేక, అత్యంత పారతంత్ర్యంతో ఒప్పుకొన్నారు. లోకసారంగమునికూడా, ముక్తుని ఆతివాహికులు మోసికొని తీసికొనిపోయి, పరమపదంలోని తిరుమామణి మంటపంలోకి చేర్చే రీతిలో, ఆళ్వార్లను తమ భుజాలపైకి ఎక్కించుకొని, భూలోకవైకుంఠమైన శ్రీరంగదివ్యాలయంలో శ్రీరంగనాథుని మంటపం లోపలకు తీసికొనిపోయారు. శ్రీరంగనాథుడు, నిత్యదరిద్రునకు మహానిధిని చూపే రీతిలో, తన దివ్యమంగళవిగ్రహాన్ని దర్శింపజేయగా, ఆళ్వార్లు కణ్ణార దర్శించి, పాదాది కేశాంతంగా అనుభవించి, ఆ అనుభవం తమ లోపల ఇముడనందువల్ల, పెరియాళ్వార్లవలె పాదాదికేశాంతంగా భగవానుని దివ్యమంగళవిగ్రహాన్ని **"అమలనాదిపిరాన్"** అనే దివ్యప్రబంధంలోని పది పాశురాలతో తాము దర్శించిన ప్రకారాన్ని వ్యక్తం చేస్తూ తిరుమణత్తూణ్ (ఆమోదస్తంభాల) లోపల ఆనందంతో నిలువగా, శ్రీరంగనాథుడుకూడా **"వేర్ చ్చ్యాడుమవర్‌కళ్ మణ్ పగ్గ్రాు క్కుళ్గ్గ్రాత్పోలే"** ఆళ్వార్లను తిరుమేనితో పాటుగా స్వీకరించాడు. ఆళ్వార్లు



అందఱి సమక్షంలో శ్రీరంగనాథుని శ్రీచరణసన్నిధిలో, గోదాదేవివలె, అంతర్భూతు లయ్యారు. (పరమపదించారు).

ఇక, అమలనాదిపిరాన్ ప్రబంధంలోని సారార్థం సంగ్రహంగా నివేదింప బడుతున్నది. చంటిబిడ్డకు తల్లిస్తన్యంవలె, శేషభూతునకు ధారకపోషక భోగ్యమై ఉండే శ్రీరంగనాథుని శ్రీచరణాల అందం తమను దాసునిగా చేసికొన్న విషయాన్ని దివ్యసూరి ప్రబంధంలోని మొదటి పాశురంలో పలికారు. సముద్రంలో చిక్కుకొన్న గడ్డిపరక కెరటాలచే అటు ఇటు కొట్టుకొనిపోయి, ఒక కెరటం నుండి ఇంకొక కెరటానికి చేరేటట్లే, సముద్ర వర్ణుడైన శ్రీరంగనాథుని శ్రీచరణాలనుండి ఎఱ్ఱని వస్త్రంపై తమ మనస్సు చేరిన విషయాన్ని రెండవ పాశురంలో పలికారు. తిరుప్పీతాంబరశోభ తమను నాభీకమలంలోకి తీసికొనిపోయిన వైనాన్ని గూర్చి పలికారు– మూడవ పాశురంలో. తిరునాభీకమలంతో చేరిన ఉదరబంధాన్ని దర్శించిన రీతినిగూర్చి నాల్గవ పాశురంలో పలికారు. "నాకు పురుషకారభూతు రాలైన లక్ష్మీదేవి వేంచేసి ఉండే వక్షఃస్థలంకదా నానుండి స్వరూపాను రూపమైన కైంకర్యాన్ని గ్రహించింది" అని అన్నారు– అయిదవ పాశురంలో. "లోకాలను అన్నిటిని ఆరగించిన స్వామికంఠం యొక్క అందం నాకు సత్తను కల్గించింది" అని అనడంద్వారా వక్షస్సులోని అందం తమను కంఠశోభలోకి కొనిపోయిన క్రమాన్ని గూర్చి ఆఱవ పాశురంలో పలికారు. తెప్పకట్టును సహాయంగా చేసికొని ఈదగోరిన వాడు "అయ్యో! తెప్పను కోల్పోయాను" అనే రీతిలో, ఇంతవరకు మనస్సుతో ఒక్కొక్క దివ్యాంగాన్ని అనుభవిస్తున్న ఆళ్వార్లు స్వామి అధరసౌందర్యాన్ని దర్శించగానే "మనస్సును కోల్పోయాను" అని ఏడవ పాశురంలో అన్నారు. "తిరునేత్రాలు నా జ్ఞానాన్ని కొల్లగొట్టాయి"– అని ఎనిమిదవ పాశురంలో పలికారు. "స్వామి తిరుమేని, తనవద్ద ఉన్నదానిని అంతటినీ చూపి, నా దగ్గర ఉండే దానిని అంతటినీ దోచుకొన్నది"– అని తొమ్మిదవ పాశురంలో అన్నారు. ఈ తొమ్మిది పాశురాలను ఆళ్వార్లు గర్భగృహంలోకి ప్రవేశించడానికి ముందు శ్రీరంగనాథుడు తన రూపసౌందర్యాన్ని వారి జ్ఞాననేత్రానికి సాక్షాత్కరింపజేయగా, "మనస్సు అనే ఆంతర నేత్రంతో" దర్శించి, పల్కినవి. లోకసారంగమహామునుల భుజాలపై, వేంచేసి ఉండి, గర్భ గృహంలోకి ప్రవేశించి, శ్రీరంగనాథుని సాక్షాత్తు కణ్ణార దర్శించి, "శ్రీరంగనాథుని అందాన్ని దర్శించిన నా కన్నులు వేఱొక

వస్తువును దేనినీ చూడదు" అని అంటూ తాము పెరియపెరుమాళ్‌తో అంతర్భవించిన రీతిని పదవ పాశురంలో పలికారు.

ఈ పది పాశురాలలో రహస్యత్రయార్థం, అర్థపంచకం ఇమిడి ఉన్నాయి. ప్రమాణసారమైన ప్రణవంలో ఉండే అకార-ఉకార-మకారలతో మొదటి మూడు పాశురాలను ప్రారంభించడంద్వారా ఈ ప్రబంధం ప్రణవసారమనే విషయాన్ని ఆళ్వార్లే తెలిపారు. ప్రమేయసారం భగవానుని పాదపద్మాల పాదుకయే అనే విషయాన్ని అయిదవ, ఆఱవ, ఏడవ పాశురాలలోని మొదటి అక్షరాలద్వారా సూచించారు. ఈ రీతిలో అన్ని అర్థాలను తన లోపల ఈ దివ్యప్రబంధం ఇముడ్చుకొన్నది. దీనిలోని అరుదైన దివ్యార్థాలను పెరియవాచ్చాన్‌పిళ్ళై, అழகియ మణవాళప్పెరుమాళ్ నాయనార్, వేదాంతదేశికులు- అనే ముగ్గురు పూర్వాచార్యులు అనుగ్రహించిన వ్యాఖ్యానాలలో గ్రహించవచ్చు.

**ఉలకతియ మలిపుకழ్ క్కార్త్తికైమాతత్తిల్**
**ఉరోకిణినాళ్ ఉఱన్ద వళమ్ పదియిల్ తోన్ఱి**
**త్తలమళన్ద తెన్నరఙ్గర్‌పాల్ ఉలోక**
**శారఙ్గమామునితోడనిలే వన్దు**
**పల మఱైయిన్ పొరుళాల్ పాణ్‌పెరుమాళే! నీ**
**పాదాదికేశమదాయ్ ప్పాడి త్తన్ద**
**శొల అమలనాదిపిరాన్ పత్తు ప్పాట్టుమ్**
**శోరామల్ ఎనక్కరుళ్ శెయ్ తులఙ్గ నీయే**

**(శ్రీవేదాంత దేశికుల ప్రబంధసారం)**

(ఓ తిరుప్పాణ్ పెరుమాళ్! లోకంలోనివారంతా జ్ఞానాన్నిపొందడం కోసం నిండైన కీర్తిని కల కార్తికమాసంలో రోహిణీనక్షత్రంలో ఉఱైయూర్ అనే భూసారాన్ని మిక్కిలిగా కల దివ్యదేశంలో అవతరించి, త్రివిక్రమావతారంలో భూమిని కొలిచిన శ్రీరంగనాథుని సమీపంలో లోకసారంగమహాముని భుజాలపై అధిరోహించి, వేంచేసి, పలు వేదాంతాలలోని సారమైన, శ్రీరంగనాథుని శ్రీచరణాలనుండి కిరీటంవరకు గల తిరుమేనిని నీవు పాడి, లోకానికి అనుగ్రహించిన ప్రబంధమైన అమలనాదిపిరాన్ లోని పది పాశురాలను నేను మఱువకుండా ఉండేటట్లు నాకు కృపజేయాలి)



**కార్త్తికైయిల్ రోకిణినాళ్ కాణ్మిన్ ఇన్ఱు కాశినియీర్!,**
**వాయ్త్తపుకழ్ పాణర్ వన్దుదిప్పాల్, ఆత్తియర్‌కళ్**
**అన్బుడనే అమలనాదిపిరాన్ కఱ్ఱదఱ్పిన్,**
**నన్గుడనే కొణ్డాడుమ్ నాళ్!** **(ఉపదేశరత్తినమాలై-10)**

ఓ చేతనులారా! గొప్ప కీర్తిని కల తిరుప్పాణ్ ఆళ్వార్లు అవతరించినందువల్ల ఆస్తికులైన శ్రీవైష్ణవులు ప్రేమతో అమలనాది పిరాన్ అనే ప్రబంధాన్ని అభ్యసించి, దానికి పిమ్మట, గొప్పగా శ్లాఘించదగిన దినమైన నేడు కార్తికమాసంలో రోహిణి నక్షత్రమనే సంగతిని గమనించండి)

## తిరుప్పాణ్ ఆళ్వార్ల వాழித్తిరునామమ్

**ఉమ్బర్ తొழுమ్ మెయ్ఞాన ముఱైయురాన్ వాழியే**
**ఉరోకిణినాళ్ కార్త్తికైయిల్ ఉదిత్త వళ్ళల్ వాழியే**
**వమ్బవిழ்తార్ మునితోళిల్ వగుత్త పిరాన్ వాழியే**
**మలర్ కణ్ణిల్ వేఱొన్ఱుమ్ వైయాతాన్ వాழியే**
**అమ్బువియిల్ మదిళరఙ్గర్ అకమ్ పుకున్దాన్ వాழியే**
**అమలనాదిపిరాన్ పత్తు మరుళినాన్ వాழியే**
**శెమ్బదుమై యరుళ్ కూఱుమ్ శెల్వనార్ వాழியే**
**తిరుప్పాణర్ పొఱ్పతఙ్గళ్ శెకత్తలత్తిల్ వాழியే**

(నిత్యసూరులు నమస్కరించే యథార్థజ్ఞానాన్ని కలవారు, ఉఱైయూర్‌లో అవతరించిన వారికి మంగళం. కార్తీకమాసంలో రోహిణీ నక్షత్రంలో అవతరించిన ఉదారులకు మంగళం, సువాసనను వెదజల్లే పూమాలను కల లోకసారంగముని భుజాలపై అధిరోహించి వచ్చినవారికి మంగళం. పూలవంటి తమ నేత్రాలతో శ్రీరంగనాథుని తప్ప వేఱొకనిని దర్శించనివారికి మంగళం. అందమైన ఈ భూమిలోని, ప్రాకారాలను కల శ్రీరంగదివ్యాలయాన్ని ప్రవేశించినవారికి మంగళం. అమలనాది పిరాన్ అనే పదిపాశురాలను అనుగ్రహించినవారికి మంగళం. ఋజువైన అర్థాలను కల పదిపాశురాలను పల్కిన కైంకర్యసిరిని కల్గినవారికి మంగళం. తిరుప్పాణాళ్వార్ల యొక్క బంగారంవలె ఆశపడదగిన శ్రీచరణాలకు ఈలోకంలో మంగళం.

# అమలనాదిపిరాన్ వైభవము

**'అమలన్, ఆది, పిరాన్'** అను పదములతో మొదలగు ఈ ప్రబంధమునకు అదియే నిరూపకనామమయ్యెను. ఇట్టి నామకరణప్రక్రియ దివ్యప్రబంధ వాఙ్మయములలోని **'పల్లాణ్డు', 'కణ్ణినుణ్ శిఱుత్తామ్బు'** ఇత్యాది ప్రబంధములలో కన్పించుచున్నది. ఇందులో శ్రీరంగనాథుని అర్చామూర్తి పాదములనుండి శిరస్సుపర్యంతము క్రమముగా వర్ణింపబడుటచే **'పాదాది కేశమాలా'** ప్రబంధమని పేరు కూడా దీనికి కల్గినది. **"దేవా శ్చరణతః పునః"** అను ఆలంకారిక సమయమును బట్టి ఆరోహణక్రమమున ఈ వర్ణన చేయబడినది. శఠకోపసూరి ప్రబంధాదులలో కొన్నిచోట్ల కిరీటాదినూపురాంతముగా అవరోహణక్రమమున వర్ణింపబడుటయు కాననగును. భక్తుడు పరమాత్మయొక్క పరత్వమును అనుసంధించినపుడు, ఆ పరత్వమునకు సూచకమైన కిరీటముతో వర్ణనను ప్రారంభించుట సంగతమైనట్లే, భక్తుడు తన స్వరూపమును అనుసంధించినపుడు భగవత్పాదములే తనకు ప్రాపకములని తలపును కల్గినవాడగును. కావున పాదములనుండి వర్ణన చేయుటయు అతనికి స్వరూపానుగుణమే అగునను పెద్దల వివరణ మిచట అనుసంధేయము. ఇట్టి పాదాదికేశాంతము, కేశాది పాదాంతము – అను ప్రక్రియలను రెండిటిని పూర్వాచార్యులు ఆదరించి, అనుసరించిరి.

**ఇది ఒక గొప్పకావ్యము :**

ఈ ప్రబంధమునందు అంతట శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యసమృద్ధి ప్రతిపాదింపబడుటచే ప్రధానముగా అంతట ఉదాత్తాలంకారము కలదని చెప్పనగును. **"తిరుక్కమల పాదమ్", "నీళ్‌వరైపోల్", "అన్దిపోల్ నిఱత్తాడై"** ఇత్యాది ప్రయోగములలో రూపకము, ఉపమ, **"కోరమాతవమ్ శెయ్‌దనన్ కొల్ ?"** ఇత్యాదులలో ఉత్ప్రేక్షయు కలవు. వేదాంతశాస్త్రప్రతిపాదితములైన పలు రహస్యార్థములు ధ్వనిప్రక్రియలో, (ముద్రాలంకారరీతిలో) కూడ సూచింపబడినవి. ఇట్లు, ఈ ప్రబంధము ఉత్తమోత్తమధ్వనికావ్యము. ఇందు ప్రతిపాద్యుడైన శ్రీరంగనాథుడే నాయకుడు, దివ్యసూరి మనస్సే నాయకి, భక్తియే ప్రధానరసము. **"తిరుక్కమలపాదమ్ ఎన్‌కణ్ణినుళ్ళన", "ఆడైయిన్‌మేల్ శెన్దదామ్ ఎన్‌శిన్దనై"**



ఇత్యాదులద్వారా చక్షుః ప్రీతి, మనస్సంగం ఇత్యాది అలౌకికములైన మన్మథావస్థలు సూచితములు.

**అమలనాదిపిరాన్ – అష్టాక్షరీమంత్రప్రతిపాదకము :**

భగవానుని నిర్హేతుకకృపవలన వ్యక్తమైన ఈ ప్రబంధమునందు పలు వేదాంతార్థములు ఇమిడియుండుట ఆశ్చర్యకరము కాదు. నాయనార్ అను ఆచార్యులు అర్థపంచక వివరణమును చేసిరి. శ్రీదేశికులు ఈ ప్రబంధమునకు మునివాహనభోగమను వ్యాఖ్యను వ్రాయునపుడు, ఈ ప్రబంధములోని మొదటి పాశురము అష్టాక్షరీమహామంత్రములో, ద్వయమంత్రములో ప్రతిపాదితములైన ముముక్షుజనజ్ఞాతవ్యార్థములను పెక్కింటిని స్పష్టీకరించుచున్నదని తెలుపుచు, దాని వివరణను అనుగ్రహించిరి. ఈ ప్రబంధములోని మొదటి పాశురము అకారముతో, రెండవ పాశురము ఉకారముతో, మూడవ పాశురము మకారముతో ప్రారంభమగుటచే, వీనిని క్రమముగా ప్రణవములోని అకార–ఉకార–మకారములకు ప్రతీకలుగా గ్రహింపవీలున్నది కావున, మొదటి మూడు పాశురములలో ప్రణవార్థము అనుసంధింపబడినదని శ్రీదేశికులు తెలిపిరి. **"శదిర మామదిళ్"** అను నాల్గవ పాశురములో ఉదరబంధము వర్ణింపబడినది. అది భగవానుని దివ్యదేహములో మధ్యభాగమున నున్నది అగుటచే, స్థాన ప్రమాణమునుబట్టి అష్టాక్షరిలోని మధ్యమపదమగు నమశ్శబ్దార్థమును ఈ పాశురము వివరించుచున్నదనియు ఆ ఆచార్యులు తెలిపిరి. అట్లే, **"పారమాయ"** అను అయిదవ పాశురము అష్టాక్షరిలోని చివరి పదమగు **"నారాయణాయ"** అను పదముయొక్క భావమును వ్యక్తీకరించుచున్నదనియు ఆ ఆచార్యుల అభిప్రాయము. మిగిలిన పాశురము లన్నిటియందును భగవానుని దివ్యమంగళ విగ్రహమును దివ్యసూరి సందర్శించిన వైభవము వర్ణింపబడుటచే, ఇవి ప్రణవములోని తృతీయపదార్థశేష మనదగును. పరమపదములోని నిత్యసూరులు సైతము **"సదా పశ్యంతి సూరయః"** అని భగవానుని దివ్యరూపమును దర్శించుట అను ప్రాప్యమును ఎల్లప్పుడు అనుభవించుచుందురని వేదమే పల్కినది. కావున భగవద్దివ్యరూపదర్శనమే పరమ ప్రాప్యమని తేలినది. ఆఱవ పాశురమునుండి పదియవ పాశురమువరకు అట్టి భగవానుని దివ్యరూపసందర్శనానుభవమే

ప్రస్తుతమగుటచే ఆ పాశురములలోని ప్రమేయము ప్రణవములోని తృతీయపదార్థ శేష మనదగును. ఇట్లీ ప్రబంధము సాకల్యముగా అష్టాక్షరీమంత్రార్థ ప్రతిపాదకము అగుటచే వేదరూప ప్రమాణసారమగు ప్రణవము ప్రతిపాదితము. వేఱొక అంశముకూడ ఇచట ప్రస్తావనార్హము. ఈ ప్రబంధములోని అయిదవ, ఆఱవ, ఏడవ పాశురముల ప్రారంభములలో విన్యస్తములైన **"పా, తు, కై"** అను అక్షరములను అదే క్రమమున యోజనచేసినచో **"పాతుకై"** అను పదమేర్పడును. ఈ పదము సంస్కృతభాషలోని **"పాదుకా"** శబ్దమునకు సమానమగుటచే భక్తునకు పరమప్రాప్యమగు భగవత్పాదుకను నిర్దేశించుచున్నదని చెప్పనగును. అందుచే ఈ మూడు పాశురములలో ప్రాప్యము ప్రతిపాదితము. మధ్యలోనున్న **"శదిర మామదిళ్"** అను నాల్గవ పాశురప్రారంభములో గల **'చ'**కారము ప్రమాణ ప్రమేయములను సముచ్చీకరించుచున్నది. ఈ అంశమును సుప్రసిద్ధ విద్వద్వరేణ్యులు, తమిళ భాషలో బహుగ్రంథకర్తలు, ప్రకాశకులు, అగు ఉ.వే. శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు (శ్రీసుదర్శన పత్రికాధిపతి) సుస్పష్టముగా తెలిపిరి. ప్రబంధములోని మిగిలిన పాశురములు పూర్వోక్తదిశలో ప్రాప్యవివరణ మొనర్చు చున్నవి అనదగును. ఈరీతిలో కూడా ఈ ప్రబంధము అష్టాక్షరీ మంత్రార్థ ప్రకాశకమే.

## ద్వయ - చరమశ్లోకార్థప్రతిపాదకము కూడా

**"నీళ్‌మదిళ్ అరఙ్గత్తమ్మాన్"** అను ప్రయోగములోని **"నీళ్‌మదిళ్ అరఙ్గమ్"** అను పదములద్వారా ద్వయమంత్రములోని పూర్వార్ధమున గల నారాయణ శబ్దార్థములలో ఒకటియగు సౌలభ్యమునకు పరమావధియైన అర్చావతారము (శ్రీరంగము) తెలుపబడినది. **"అమ్మాన్"** అనుటచే ద్వయములోని ద్వితీయార్ధమునగల నారాయణపదముయొక్క ముఖ్యార్థమగు సర్వశేషిత్వము తెలుపబడినది. **"తిరుక్కమలపాదమ్"** అనుపదము ద్వయమంత్రముయొక్క పూర్వవాక్యములోని **"చరణౌ శరణమ్"** అను పదముల అర్థమును అనుసంధించుచున్నది. ఇట్లు ప్రకృతప్రబంధములోని మొదటి పాశురమున ద్వయార్థము అనుశీలింపబడినది. "నన్నే ఉపాయముగా ఆశ్రయింపుము, నేనునీ పాపముల నన్నిటిని తొలగింతును" అను శ్రీకృష్ణభగవానుని చరమశ్లోకార్థము **"పారమాయ పఴవినై పఱ్ఱఱుత్తు"** అను ప్రయోగముద్వారా అనుసంధింపబడినది. కావున ఈప్రబంధము చరమ



శ్లోకార్థప్రతిపాదకము కూడ. ఇట్లు ఈ ప్రకృతప్రబంధము రహస్యత్రయార్థ ప్రతిపాదకము.

## అమలనాదిపిరాన్ - శారీరకమీమాంసా సామ్యము :

భగవద్రామానుజుల బ్రహ్మసూత్రవివరణమగు శ్రీభాష్యమునకు **శ్రుత ప్రకాశికా** అను అత్యంత విపులమైన రమణీయ వ్యాఖ్యను వెలయించిన శ్రుత ప్రకాశికాచార్యులవారు ఆ వ్యాఖ్యానారంభములో **"ప్రపద్యే ప్రణవాకారం భాష్యం రంగ మివాపరమ్"** అనుచు శ్రీరంగవిమానమునకు ప్రణవాకారత్వము కలదనిరి. ఆ విమానములో అధివసించియున్న శ్రీరంగనాథుని మూర్తికికూడ అర్థవశమున ప్రణవాకారత ఉండుట మిక్కిలి సుసంగతము. ఇక, ఈ ప్రబంధము శారీరకమీమాంసాశాస్త్రప్రమేయముతో పోలియుండుటయు గమనార్హము. శారీరకమీమాంసాశాస్త్రము క్రమముగా **"కారణత్వ- మబాధ్యత్వ-ముపాయత్వ-ముపేయతా"** అని భగవానుని జగత్కారణత్వము, ఆ కారణత్వము అబాధితమగుట, ఆ భగవానుడే ఉపాయమగుట, ఉపేయమగుటయు అను నాల్గు అంశములను ప్రమేయముగా కల్గియున్నదని పెద్దలు పల్కిరి. ఈ ప్రబంధములో కూడ మొదటి పాశురములోని **"ఆది"** అను విశేషణము భగవానుని నిరుపాధికజగత్కారణత్వమును తెలుపుచున్నది. కావున దానిచే బ్రహ్మసూత్రములలోని మొదటి అధ్యాయ ప్రమేయమగు జగత్కారణత్వము సూచితము. మూడవపాశురములో **"అయనై పడైత్త దోరెழிల్ ఉన్ది"** అనుచు సమస్త సృష్టికర్తయగు బ్రహ్మకు సైతము ఉత్పత్తి కారణము స్వామియే అనుటచే భగవానుని సమస్త కారణత్వము అబాధితమగు చున్నది. దీనిచే కాపిలాది మతాంతరములచే ప్రసక్తములైన ప్రకృతేః కారణత్వాదులును నిరస్తములు. అందుచే బ్రహ్మమీమాంసలోని ద్వితీయాధ్యాయప్రమేయము అగు అబాధ్యత్వము దీనిచే సూచితము. **"పారమాయ", "తుణ్డవెణ్ పిఱైయన్", "కైయినార్"** అను తదనంతర పాశురములలోని మొదటి అక్షరములద్వారా సూచింపబడిన స్వామి పాదుకయే ప్రపన్ననకు ఉపాయమగుటచేత, ఆ గాథలచే ఉపాయత్వము ప్రతిపాదితము. మిగిలిన మూడు పాశురములలో పూర్వోక్త ప్రకారమున ఉపేయమగు భగవద్దివ్యమంగళ సందర్శనరూపప్రాప్యము ప్రస్తుతము. కావున ఉపేయత్వము ప్రతిపాదితము. ఇట్లు, ఈ ప్రబంధములో క్రమేణ బ్రహ్మమీమాంసాప్రమేయము స్మారితము.

బ్రహ్మమీమాంసాశాస్త్రమునకు శారీరకమీమాంసాశాస్త్రమను పేరు కలదు. చిదచిత్తులను రెండిటిని శరీరముగా కల భగవానుని గూర్చిన మీమాంస అందు చేయబడుటచే దానికట్టి పేరు కల్గెనని పెద్దలందురు. ఈ ప్రబంధముకూడ భగవానుడైన శ్రీరంగనాథుని దివ్యశరీరమును వర్ణించునది కావున శారీరక మీమాంసాసాదృశ్యము దీనికి కలదని చెప్పనగును. శ్రీపిళ్లైలోకాచార్యులవారు అష్టాక్షరిలోని నారాయణపదమునందలి నారశబ్దముచే భగవానుని దివ్యమంగళ విగ్రహము చెప్పబడుచున్నదనగా, ఆ సూక్తిని వ్యాఖ్యానించుచు శ్రీవరవరమునులు ఈ పదము పరమపదములోని భగవానుని దివ్యతేజోమయ రూపమునే కాక, స్వామి తన ఇచ్ఛతో పరిగ్రహించు రూపముల నన్నిటిని తెలుపుననిరి. కావున శ్రీరంగములోని శ్రీరంగనాథుని అర్చామూర్తికూడ నారశబ్దవాచ్యమే కదా ! ఇట్టి శ్రీరంగనాథుని దివ్యరూపవైభవమును వర్ణించు ఈ ప్రబంధము శారీరక మీమాంసయే అగును.

## అమలనాదిపిరాన్ –శ్రీభాష్యసామ్యము :

భగవద్రామానుజుల శ్రీభాష్యమునకును, ప్రస్తుతప్రబంధమునకు మధ్యకల సాదృశ్య మిచట అవశ్యము భావనీయము. ఎట్లనగా – ఉపనిషద్భాష్యకారులగు శ్రీరంగరామానుజమునులు అనుగ్రహించిన శ్రుతప్రకాశికావ్యాఖ్య అగు భావప్రకాశికాగ్రంథమునకు పీఠికను వ్రాయు ఉ.వే. శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవాచార్యస్వామివారు శ్రీభాష్య – ప్రణవములు రెండును జీవుని అనన్యార్హశేషత్వమును, భగవానుని నిరుపాధిక శేషిత్వమును ప్రకాశింపచేయునవి అగుటచే అర్థతః పరస్పరసదృశములను శ్రీరంగరామానుజ సూక్తిని విశదీకరించుచు, వానిమధ్య శబ్దతః సాదృశ్యమును కలదనిరి. శ్రీభాష్యప్రారంభము **"అఖిలభువన జన్మ"** అని అకారముతో, సమాప్తి **"ఇతి సర్వం సమంజసమ్"** అని మకారముతో చేయబడుట ప్రత్యక్షసిద్ధము. ప్రథమాధ్యాయ చతుర్థపాదముయొక్క భాష్యారంభము **"ఉక్తం హి"** అని ఉకారఘటితముగా చేయబడినది. **"శ్రీభాష్యస్య అకారేణోపక్రమః, మకారోప సంహార శ్చ స్పష్టా వేవ, ప్రథమచతుర్థారంభగతమ్ ఉకారం మధ్యమం కృత్వా ఆదిమధ్యావసానేషు ప్రణవఘటకాకారోకారమకార శాలితయా శ్రీభాష్యస్య ప్రణవాకారత్వమ్"** అను అచటి వాక్యము స్మరణీయము. ఇట్లు శ్రీభాష్యమునందు



ప్రణవములోని అక్షరములుమూడు క్రమానుసారముగా నిక్షిప్తములైనవి. ఈ విధముగానే శ్రీరామాయణమున గాయంత్రీ మంత్రాక్షరములు వరుసగా విన్యస్తములగుట గమనార్హము. ప్రణవ– శ్రీభాష్యసాదృశ్యమువలె, ప్రణవ– ప్రకృత ప్రబంధసాదృశ్యముకూడ పూర్వోక్తమే. కావున శ్రీభాష్య–ప్రకృత ప్రబంధ సాదృశ్యమును సిద్ధము. వేఱొకవిధముగా కూడ ఈ ప్రబంధమునకు శ్రీభాష్య సామ్యము కలదని చెప్పవచ్చును. శ్రీరామానుజులు **"పారాశర్యవచస్సుధామ్"** అను శ్లోకములో **"నిజాక్షరైః ఆనీతాం పారాశర్యవచస్సుధామ్"** అనుచు తమ భాష్యము అమృతమువంటిదనిరి. ఈ దివ్యసూరియు ప్రబంధముచివరలో **"అరఙ్గన్ ఎన్నముదినై క్కణ్డకణ్గళ్"** అనుటద్వారా శ్రీరంగనాథుని సుధాసామ్యమును తెలిపిరి. ఈ అమృతము దివ్యసూరిసూక్తిదుగ్ధాబ్ధినుండి పుట్టినదే కదా !

ఈ ప్రబంధములోని మొదటి పాశురములలో ప్రయోగింపబడిన **"అమలన్", "విమలన్", "నిమలన్", "నిన్మలన్"** అనుపదములలో గల నఞ్ల ద్వారా పలు విశేషార్థములు వ్యక్తమగుచున్నవని అభిజ్ఞుల అభిప్రాయము. విస్తరభయముచే ఆ అంశ మిచట విడువబడినది.

## అమలనాదిపిరాన్ – స్తోత్రవాఙ్మయము :

ఈ దివ్యప్రబంధమును అనుసంధించి తన్మయులైన శ్రీదేశికులు **'భగవద్ధ్యాన సోపానమ్'** అను స్తోత్రమును రచించిరని పెద్దలందురు. ఇందులకు ఆ స్తోత్రములోని పలు ప్రయోగములు తార్కాణములు. ఆ స్తోత్రములోని **"శ్రీవత్సేన ప్రథితవిభవం శ్రీపదన్యాసధన్యమ్"** అను దేశికసూక్తి ప్రస్తుత ప్రబంధములోని **"తిరుమఱు మార్బు"** అనుసూక్తిని, **"నాళీకేన స్ఫురితరజసా వేధసో నిర్మిమాణా"** అను దేశికప్రయోగము **"అయనైపడైత్త దోరెழిల్"** అను సూక్తిని, **"స్వాంతే గాఢం మమ విలగతి స్వాగతోదారనేత్రమ్"** అను దేశికసూక్తి **"అప్పెరియవాయ కణ్గళ్ ఎన్నై ప్పేదమై శెయ్దనవే"** అను ప్రస్తుతప్రబంధసూక్తిని అనుసరించి ప్రయోగింప బడినవనుట సుస్పష్టము. ఇట్టి భావసామ్యములు అనేకములు.

శ్రీమతే రామానుజాయ నమః



## తిరుప్పాణ్ ఆళ్వార్ తనియన్లు

### పెరియనంబి అనుగ్రహించినది

ఆపాదచూడ మనుభూయ హరిం శయానం
మధ్యే కవేరదుహితుర్ముదితాంతరాత్మా।
అద్రష్టృతాం నయనయో ర్విషయాంతరాణాం
యో నిశ్చికాయ మనవే మునివాహనం తమ్ ॥

కాట్టవే కణ్డ పాదమ్ కమల నల్లాడై యున్ది,
తేట్టరు ముదరబన్దమ్ తిరుమార్వు కణ్డమ్ శెవ్వాయ్,
వాట్టమిల్ కణ్గళ్ మేని ముని యేఱి త్తని పుకున్దు,
పాట్టినాల్ కణ్డు వాళ్ఱుమ్ పాణర్తాళ్ పరవినోమే.

### తిరుప్పాణ్ ఆళ్వార్ అనుగ్రహించిన

# అమలనాది పిరాన్

1. అమలనాది పిరాన్ అడియార్క్కెన్నై ఆళ్పడుత్త
విమలన్, విణ్ణవర్కోన్ విరైయార్ పొళ్ళిల్ వేఙ్గడవన్,
నిమలన్ నిన్మలన్ నీదివానవన్ నీళ్మదిళ్ అరఙ్గత్తమ్మాన్,
తిరుక్కమలపాదమ్ వన్దెన్ కణ్ణినుళ్ళన ఒక్కిన్దదే.



2. ఉవన్ద వుళ్ళత్తనాయ్ ఉలకమళన్దణ్డముఱ,
నివర్న్ద నీణ్డ ముడియన్ అన్రు నేర్న్ద నిశాశరర్రై,
క్కవర్న్ద వెఙ్కణై క్కాకుత్తన్ కడియార్ పొళ్ళిలరఙ్గత్తమ్మాన్, అరై
చ్చివన్ద వాడైయిన్ మేల్ శెన్రదామ్ ఎన్శిన్దనైయే

3. మన్ది పాయ్ వడవేఙ్గడ మామలై, వానవర్కళ్
శన్ది శెయ్య నిన్రాన్ అరఙ్గత్తరవినణైయాన్,
అన్దిపోల్ నిఱత్తాడైయుమ్ అదన్మేల్ అయనై ప్పడైత్తతోరెళ్ళిల్,
ఉన్దిమేల్ అదన్రో అడియేనుళ్ళత్తిన్నుయిరే.

4. శతుర మామదిళ్ శూళ్ ఇలఙ్గైక్కిఱైవన్, తలై పత్తు
ఉదిర వోట్టి ఓర్ వెఙ్గణై యుయ్త్తవన్ ఓదవణ్ణన్,
మదురమా వణ్డు పాడ మామయిలాడ అరఙ్గత్తమ్మాన్, తిరువయి
గ్ఱ్ఱుదరబన్దమ్ ఎన్నుళ్ళత్తుళ్ నిన్రులాకిన్రదే.

5. పారమాయ పళ్ళవినై పఱ్ఱఱుత్తు, ఎన్నై త్తన్
వారమాక్కి వైత్తాన్ వైత్తతన్రి యెన్నుళ్ పుకున్దాన్,
కోర మాతవమ్ శెయ్దనన్కొల్? అఱియేన్ అరఙ్గత్తమ్మాన్, తిరు
వారమార్పతన్రో అడియేనై యాట్కొణ్డదే.

6. తుణ్డ వెణ్ పిఱైయన్ తుయర్ తీర్త్తవన్, అఞ్జిఱైయ
వణ్డువాళ్ పొళ్ళిల్ శూళ్ అరఙ్గనగర్మేయ అప్పన్,
అణ్డరణ్డ పకిరణ్డత్తు ఒరుమానిల మెళ్ళుమాల్వరై, మఱ్ఱుమ్
ఉణ్డ కణ్డఙ్కణ్డీర్ అడియేనై యుయ్యకొణ్డదే

7. కైయినార్ శురిశఙ్గనలాళ్ళియర్, నీళ్వరైపోల్
మెయ్యినార్ తుళప విరైయార్, కమళ్నీణ్ముడి యెమ్
ఐయనార్ అణియరఙ్గనార్ అరవినణైమిశై మేయ మాయనార్,
శెయ్యవాయ్ ఐయో! ఎన్నై చ్చిన్దై కవర్న్దదువే

8. పరియనాకి వన్ద అవుణనుడల్ కీణ్డ, అమరర్ -
క్కరియ అదిప్పిరాన్ అరఙ్గత్తమలన్ ముకత్తు,
కరియవాకి ప్పుడై పరన్దు మిళిర్న్దు శెవ్వరియోడు, నీణ్డ వ-
ప్పెరియవాయ కణ్గళ్ ఎన్నై ప్పేదైమై శెయ్దనవే

9. ఆలమామరత్తినిలైమేల్ ఒరుపాలకనాయ్,
ఞాలమేழ్ ముణ్డాన్ అరఙ్గత్తరవినణైయాన్,
కోలమా మణియారముమ్ ముత్తుత్తామముమ్ ముడివిల్లదు ఓరెழிల్,
నీలమేని ఐయో! నిఱై క్కొణ్డదు ఎన్నెఞ్జినైయే

10. కొణ్డల్వణ్ణనై, కోవలనాయ్ వెణ్ణెయ్
ఉణ్డ వాయన్ ఎన్నుళ్ళమ్ కవర్న్దానై,
అణ్డర్కోన్ అణియరఙ్గన్, ఎన్నముదినై
క్కణ్డ కణ్కళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే

అమలనాదిపిరాన్ సంపూర్ణమ్





తిరుప్పాణ్ ఆழ்వార్లు అనుగ్రహించిన

# అమలనాది పిరాన్

## పెరియనంబి అనుగ్రహించిన తనియన్

**ఆపాదచూడ మనుభూయ హరిం శయానం
మధ్యే కవేరదుహితు ర్ముదితాంతరాత్మా।
అద్రష్టృతాం నయనయో ర్విషయాంతరాణాం
యో నిశ్చికాయ మనవే మునివాహనం తమ్ ॥**

యః = ఏ మునివాహనసూరి, కవేరదుహితుః = కావేరీనదియొక్క, మధ్యే= మధ్యభాగములో, శయానమ్ = పరుండియున్న, హరిమ్ = శ్రీరంగ నాథుని, ఆపాదచూడమ్ = పాదములనుండి శిరస్సుపర్యంతము, అనుభూయ = (దర్శించి) ఆనందించి, విషయాంతరాణామ్ = (ఆ భగవానుదు తప్ప) మిగిలిన విషయములను, అద్రష్టృతామ్ = తాము దర్శింపకుండుటను, నిశ్చికాయ= నిశ్చయించిరో, తమ్ (మునివాహనమ్) = అట్టి అప్రమేయ వైభవమును కల మునివాహన సూరిని (లోకసారంగమునిని వాహనముగా కలవారిని), మనవై = ధ్యానింతును.

## పిళ్ళైలోకమ్‌జీయర్ అరుళిచ్చెయ్ద తనియన్ వ్యాఖ్యానమ్

అవతారికై : (ఆపాదచూడ మిత్యాది) - ఇతిల్ - "కెరుడవాకననుమ్ నిఱ్క" ఎన్ఱుమ్, "అఞ్జిఱై పుట్పాకనై యాన్ కణ్డతు తెన్నరఙ్గత్తే" ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే పెరియపెరుమాళై సేవిత్తు అనుభవిత్త మునివాహనరై మనస్సాలే అనుభవిక్కుమ్బడి శొల్లుకిఱతు. అశేషశేషియానవనుడైయ గరుడవాహనత్వముమ్, శేషశాయిత్వముమ్, శ్రియఃపతిత్వముమితే సర్వాధికత్వత్తుక్కు లక్షణమ్. ఇప్పడి సర్వాధికవస్తువినుడైయ సర్వావయఙ్గళైయుమ్ సక్రమమాక అనుభవిత్తపడి శొల్లుకిఱతు.

వ్యాఖ్యానమ్ : (ఆపాదచూడమ్) - తిరుప్పాదకేశత్తై.

(అనుభూయ) అమలనాదిపిరాన్ అడైవే అనుభవిత్తు.

(హరిం శయానమ్)- "శ్రీమాన్ సుఖసుప్తః పరన్తపః" ఎన్నుమ్బడియాయ్ క్కిడక్కై. కిడన్ద కిడైయిలే 'ఉట్కుడై యశురరుయిరెల్లా ముణ్డ'వరిఱే. "హరతీతి హరిః" - అనుకూలర్ మనస్సైయుమ్, ప్రతికూలర్ ప్రాణఙ్గళైయుమ్ హరిక్కు

మవరెన్గిఱతు. అనుకూలర్రై దృష్టిచిత్తాపహరణమ్ పణ్ణుమ్బడియా యిరుక్కై. “కిడన్దతోర్ కిడక్కై కణ్డుమ్ ఎఙ్గనమ్ మఱన్దు వాఴ్కేన్”, “ఏరార్ కోలమ్ తికఴ క్కిడన్దాయ్ కణ్డేన్” ఎన్నుమ్బడి తాపహరరానవర్రై. అవర్తామ్ “అరవినణైమిశై మేయ మాయనా”రాన “ముకిల్వణ్ణ”రుమిఱే. ఇప్పడి అనుకూల ప్రతికూల రక్షణశిక్షణఙ్గళై ప్పణ్ణుమవరానవర్రై.

(కవేరదుహితుర్మధ్యే) - కవేరకన్యైయాన కావేరిమధ్యే. “కఙ్గైయిల్ పునితమాయ కావిరినడువుపాట్టిలే”యిఱే పడుకాడు కిడక్కిఱతు. “వణ్పొన్ని త్తిరైక్కైయాల్ అడివరుడ” తిరునాళినితాకవాయ్త్తు త్తిరుక్కణ్గళ్ వళరుకిఱతు. ఇప్పడి, “కవేరదుహితుర్మధ్యే శయానమ్ హరిమ్ ఆపాదచూడమ్” ఎన్నుమ్, “కుడతిశై ముడియై వైత్తు క్కుణతిశై పాతమ్ నీట్టి, వడతిశై పిన్బు కాట్టి త్తెన్ తిశై యిలఙ్గై నోక్కి, కడల్ నిఱ క్కడవుళెన్దై అరవణై త్తుయిలుమా కణ్డు” అనుభవిత్తార్- ఎన్గై.

(ముదితాన్తరాత్మా) ఇప్పడి అనుభవిత్తు హృష్టమనావానార్. సన్తోషచిత్త సమాహితరానార్. “మకిఴ్న్దతు శిన్దై” ఎన్నక్కడవతిఱే.

ఇని, అవ్వళవిల్ నిల్లాతే, (అద్రష్టుతాం నయనయో ర్విషయాన్తరాణామ్) ఎన్నుమ్బడి కాణా క్కణ్ణై యడైయరానార్. “అణియరఙ్గన్ ఎన్నముతినై క్కణ్డ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే” ఎన్టాయ్త్తు, ఇవర్ ఇవ్విషయత్తిలే అస్తమితాన్య భావరాయిరుప్పతు. “ఏతదేవామృతం దృష్ట్వా తృప్యన్తి”, “అరఙ్గమా కోయిల్ కొణ్డ కరుమ్బినై క్కణ్డుకొణ్డు ఎన్ కణ్ణిణై కళిక్కుమాఱే”, “రామం మేఽనుగతా దృష్టిః న త్వా పశ్యామి”యిఱే. సౌన్దర్యసాగరత్తిలే మగ్నరానార్. ఇవరుక్కు అఴకు అజ్ఞానత్తై విళైత్తతాయ్త్తు. అదృష్టమ్ దృష్టమాకైయాలే దృష్టమ్ అదృష్టమాయ్త్తు. అన్టిక్కే, “శిన్దై మఱ్ఱొన్ఱిన్ తిఱత్తతల్లా”, “భావో నాన్యత్ర గచ్ఛతి” ఎన్నుమ్బడి పరత్వాదికళాయ్త్తు పరోక్షవిషయమాకిఱతు- ఎన్నుతల్. “కట్కిలీ” ఎన్నుమ్ వడివైయిఱే క్కణ్ణాల్ కణ్డనుభవిత్తతు. కాణతవైయుమ్ కణ్డవస్తువిలే యుణ్డిఱే. ఇప్పడి “మైప్పడి మేనియై” అనుభవిత్తు మఱ్ఱ విషయఙ్గళై క్కాణాక్కణ్ణరా యిరుక్కుమవర్రై చ్చొల్లుకిఱతు.

(యో నిశ్చికాయ మనవై మునివాహనం తమ్) ఎన్టు. యావరొరువర్ “కణ్డ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే” ఎన్టు అఱుతియిట్టార్; అప్పడిప్పట్ట అన్ద



మునివాహనర్రై, మనవై- మనస్సాలే ప్రతిపత్తి పణ్ణుకిఱేన్ - ఎన్టపడి. “అయనలర్ కొడు తొఴుతేత్త” ఎన్నుమ్బడి హంసవాహననాన చతుర్ముఖన్ బహుముఖమాక అనుభవిత్తాప్పోలే, మునివాహనరాన ఇవరుమ్ ఏకముఖమాక ఇరణ్డు కణ్ణాలుమ్ కణ్డనుభవిత్తార్.

“కిరీటకేయూరకరత్నకుణ్డలం ప్రలమ్బముక్తామణిహేమ భూషితమ్, విశాలవక్షస్థ్సలశోభికౌస్తుభం శ్రియా చ దేవ్యాఽధ్యుషితోరువిగ్రహమ్, ప్రతప్త చామీకరచారువాససం సుమేఖలానూపుర శోభితాఙ్ఘ్రికమ్, సుబన్ధునీజాత మృణాళకోమళం దధాన మచ్ఛచ్ఛవియజ్ఞసూత్రకమ్, భుజోపధానం ప్రసృతాన్య హస్తం నికుఞ్చితోత్తానితపాదయుగ్మమ్, సుదీర్ఘ మూర్వం సముద్రగ్రవేషం భుజఙ్గతల్పం పురుషం దదర్శ” ఎన్టు, బ్రహ్మావానవన్ అభిమానియాకైయాలే, ముడియే తొడఙ్గి అనుభవిత్తాన్. ఇవర్ అడియరాకైయాలే అడియే తొడఙ్గి యనుభవిత్తార్. అవన్ కణ్డ అనన్తరమ్ విషయఙ్గళైయుమ్ కణ్డాన్. ఇవర్ విషయఙ్గళై క్కణ్డిలర్. “తిరుక్కమల పాతమ్ వన్దెన్ కణ్ణినుళ్ళన”, “కణ్డ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే” ఎన్టార్. వీణైయుమ్ కైయుమాయ్ సేవిక్కిఱ ఇవర్క్కు “శేమముడై నారదనారుమ్” ఒరువకైక్కు ఒప్పావర్.

పెరియాఴ్వార్ అవతారత్తిల్ అనుభవమ్ ఇవర్క్కు అర్చావతారత్తిలే. అవర్ “పాతక్కమలమ్” ఎన్టత్తై - “తిరుక్కమల పాతమ్” ఎన్టార్; “పీతక చ్చిఱ్ఱాడైయొడుమ్”- “అరై చ్చివన్ద వాడైయిన్మేల్”, “నన్టు మఴకియ వున్ది”- “అయనై ప్పడైత్తతోరెఴిలున్ది, “పఴమ్ తామ్బాలార్త్త- వుతరమ్”- “తిరువయిఱ్ఱుదరపన్దమ్”; “కురుమామణిప్పూణ్ కులావి త్తికఴుమ్ తిరుమార్వ్వు”- “తిరువారమార్వు”, “అణ్డముమ్ నాడు మడఙ్గ విఴుఙ్గియ కణ్డమ్”- “ముఱ్ఱుముణ్డ కణ్డమ్”; “నెయ్త్తలై నేమియుమ్ శఙ్గుమ్ నిలావి కైత్తలమ్”- “కైయినార్ శురిశఙ్గనలాఴియర్”, “శెన్దొణ్డై వాయ్”- “శెయ్యవాయ్”; “కణ్గళిరున్దవా”- “అప్పెరియవాయకణ్గళ్; “ఉరువు కరియ వెళి మణివణ్ణన్ ఎఴిల్నీలమేని కుఴల్కళ్ ఇరున్దవా”- “తుళపవిరైయార్ కమఴ్ నీణ్ముడి”. “కోవలనాయ్ వెణ్ణైయుణ్డవాయ”నిఱే పెరియపెరుమాళ్. ఆకైయాల్ అనుభవత్తిల్ ఇరువరుమ్ సగోత్రికళాయాయ్త్తిరుప్పతు. ఇప్పడి మనఃప్రీతి

పిఱక్కు్మబ్బడి అనుభవిత్త ఆ*ళ్వా*రై ఇఙ్గు మనఃప్రీతి పిఱక్కు్మబ్బడి "మనవై" ఎన్ఱు- మనస్సాలే సేవిక్కు్మబ్బడి శొల్లి*గ్ఱా*ు.

## శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ అనుగ్రహించిన తనియన్ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం

పెరియనంబి అనుగ్రహించినట్లుగా ప్రసిద్ధి చెందిన ఈ తనియన్ పాశురంలో **"నాట్టినాన్ దెయ్వమెఙ్గుమ్ నల్లదోరరుళ్‌తన్నాలే కాట్టినాన్ తిరువరఙ్గమ్ ఉయ్‌పవర్క్కుయ్యుమ్ వణ్ణమ్, కేట్టిరే నమ్బిమీర్‌కాళ్! కెరుడవాకనుమ్ నిఱ్క శేట్టైదన్ ముడియకత్తు చ్చెల్వమ్ పార్‌త్తిరుక్కిన్ఱీరే"** (తిరుమాలై-10) (ఆయా గుణాలను కలవారికి తగినట్లు అంతట తామసదేవతలను స్థాపించాడు. ఉజ్జీవించాలనే దృష్టి కల వారికి తన కృపతో శ్రీరంగాన్ని దర్శింపజేశాడు. విషయాంతరాలలో పూర్ణత్వాన్ని కల జనులారా! మీరు నా ఈ మాటలను వింటున్నారా? గరుడ వాహనుడు ఉండగా జ్యేష్ఠాదేవి వద్ద ఉండే సంపదను – దారిద్ర్యాన్ని – పొందాలని కోరుతున్నారేమి?) అని, **"అఙ్జిఱైయ పుట్పాకనై యాన్ కణ్డదు తెన్ అరఙ్గత్తే"** (పెరియ తిరు-5-6-6) (అందమైన ఱెక్కలను కల గరుడుని నడిపేవానిని నేను దర్శించినది- దక్షిణదిక్కులో గల శ్రీరంగంలో) – అని పలికే రీతిలో పెరియపెరుమాళ్‌ను (శ్రీరంగనాథుని) సేవించి అనుభవించినవారై, లోకసారంగ మహామునులను వాహనంగా చేసికొని, శ్రీరంగనాథుని అనుమతితో కోయిల్‌కు (శ్రీరంగాలయానికి) వేంచేసినవారు కనుక మునివాహనులనే పేరు పొందిన తిరుప్పాణా*ళ్వా*ర్లను పెరియనంబి (మహాపూర్ణులు) తాము మనస్సుతో అనుభవించిన (దర్శించి ఆనందించిన) రీతిని పల్కుతున్నారు. గరుడుని వాహనంగా కల్గి ఉండడం, ఆదిశేషుని పడుకగా కల్గిఉండడం, లక్ష్మికి నాథుడై ఉండడం – (గరుడవాహనత్వం, శేష శాయిత్వం, లక్ష్మీపతిత్వం) అనేక ఈ మూడు లోకానికి అంతటికి స్వామియై, సర్వాధికుడైన పరమపురుషుని అసాధారణ లక్షణాలు. ఈ విధంగా అందఱికంటే గొప్పవాడైన, పరబ్రహ్మమైన శ్రీరంగనాథుని శ్రీచరణాలనుండి (శిరస్సు) వరకు తిరుమేనిలో గల అన్ని దివ్యాంగాలను తిరుప్పాణా*ళ్వా*ర్లు వరుసగా దర్శించి ఆనందించిన రీతిని ఈ తనియన్‌లో పెరియనంబి (మహాపూర్ణులు) అనుగ్రహిస్తున్నారు.

**వ్యాఖ్యానమ్ : (ఆపాదచూడమ్) – "తిరుప్పాదకేశత్తై త్తెన్‌పుదువై ప్పట్టన్ విరుప్పాల్ ఉరైత్త"** (పెరియా*ళ్వా*ర్ తిరు-1-2-21) (పాదాదికేశాంతంగా భగవానుని తిరుమేని వర్ణనను దక్షిణ దిక్కులో గల శ్రీవిల్లిపుత్తూర్‌లోని భట్టనాథుని ఆదరంతో పల్కిన) అని పెరియా*ళ్వా*ర్లు అనుభవించినట్లే వీరుకూడా అనుభవించారు.

**(అనుభూయ) – "అమలన్ ఆది పిరాన్"** అని ప్రారంభమవుతున్న మొదటి పాశురంనుండి క్రమంగా అనుభవించి (దర్శించి),

**(హరిం శయానమ్) – "వాయసేన తతప్తేన బలవత్ క్లిశ్యమానయా, స మయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః"** (తరువాత, సుఖంగా నిద్రిస్తున్నవాడు, (అందువల్ల గొప్ప శయనకాలికసౌందర్యాన్ని కలవాడు, శత్రువులను తపింపజేసే వాడైన శ్రీరాముడు, ఆ కాకాసురునిచే బలంగా బాధ పెట్టబడే నాచే నిద్రలేప బడ్డాడు) అనే రీతిలో పెరుమాళ్ (శ్రీరాముడు) విలక్షణంగా శయనించినట్లే, పెరియపెరుమాళ్ (శ్రీరంగనాథులు) శయనించి ఉండే వైలక్షణ్యం దానిని చూచిన శత్రువులు నశించి పోయేటట్లుగాకదా ఉంటుంది. **"ఉట్కుడై యశురర్ ఉయిరెల్లామ్ ఉణ్డ ఒరువనే... తిట్కొడి మదిళ్ శూ*ళ్* తిరువరఙ్గత్తాయ్!"** (బలవంతులైన అసురుల ప్రాణాలను అన్నిటినీ గ్రహించిన అద్వితీయుడా! దృఢమైన ధ్వజాలను కల ప్రాకారాలతో చుట్టబడి ఉండే శ్రీరంగానికి నాథా!) (తిరువాయ్-7-2-3) అని నమ్మా*ళ్వా*ర్లు కూడా అనుగ్రహించారు. **"హరిః"** అనే పదం **"హరతీతి హరిః"** అనే వ్యుత్పత్తిద్వారా ఇది శ్రీమన్నారాయణుని విలక్షణనామమని తెలుస్తున్నది. భక్తుల మనస్సును, శత్రువుల ప్రాణాలను హరించడం స్వభావంగా కలవాడని దీని అర్థం. **"రూపౌదార్య గుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్"** (రామా-అయో- 3-29) (రూపసౌందర్యంలోని ఔదార్యంతో, గుణాలు మొదలైనవానితో పురుషుల నేత్రాలను, మనస్సును అపహరించే శ్రీరాముని) అనే రీతిలో ప్రేమను కలవారి నేత్రాలను, మనస్సును ఆకర్షించేవాడై ఉంటాడు. **"కిడన్దదోర్ కిడక్కై కణ్డుమ్ ఎఙ్ఙనమ్ మఱన్దు వా*ళ్*వేన్"** (తిరుమాలై-23) (శయనించిన ఆ అద్వితీయమైన సన్నివేశాన్ని దర్శించిన తరువాతకూడా ఇక ఏవిధంగా దీనిని మఱచి జీవించగలను?) అని తొణ్డరడిప్పొడి ఆ*ళ్వా*ర్లు, **"ఏరార్ కోలమ్ తిక*ళ* క్కిడన్దాయ్! కణ్డేన్"** (తిరువాయ్-5-8-1) (సౌందర్యం నిండుగా ప్రకాశించేటట్లుగా శయనించి ఉండేవాడా! నిన్ను దర్శించాను) అని నమ్మా*ళ్వా*ర్లు, భక్తుల తాపాలను తీర్చి, వారిని ఆకర్షించేవాడని పలికారు. పెరియపెరుమాళ్‌ను **"అరవినణైమిశై మేయ మాయనార్"** (అమల-7) (శేషశయనాన్ని ఆదరించే ఆశ్చర్యగుణచేష్టితుడు) అని, **"ముడివిల్లదోర్ ఎ*ళ్*ిల్ నీలమేని"** (అమలన్-9) (అంతులేని అద్వితీయమైన కాంతిని కల నీలమేని) అని అంటూ

తిరుప్పాణ్ ఆ<u>ళ్</u>వార్లు ప్రకృతప్రబంధంలో పల్కిన రీతిని ఇక్కడ **"హరిం శయానమ్"** అని తెలియజేస్తున్నారు. **"ముకిల్ వణ్ణనడిమేల్ శొన్న శొల్మాలై"** (మేఘవర్ణుని శ్రీచరణాలపై పల్కిన వాజ్మాల) అని నమ్మా<u>ళ్</u>వార్లుకూడా శ్రీరంగనాథుని మేఘవర్ణునిగా పలికారు. ఈ రీతిలో **"హరిం శయానమ్"** (శయనించి ఉండే హరిని) అని పల్కినందువల్ల తాను శయనించి ఉండే అందంతో ప్రేమను కలవారిని (భక్తులను) రక్షించేవాడు, శత్రువులను నిర్జించేవాడు – అని తెలుపబడింది.

**(కవేరదుహితుః మధ్యే శయానం హరిమ్ ఆపాదచూడమ్)** అనే ఈ పద సందర్భం ద్వారా **"కుడతిశై ముడియ వైత్తు క్కుణతిశై పాదమ్ నీట్టి వడదిశై పిన్బు కాట్టి త్తెన్ తిశై ఇలజ్గై నోక్కి క్కడల్నిఱక్కడవుళ్ ఎన్దై అరవణై త్తుయిలుమా కణ్డు ఉడల్ ఎనక్కురుకుమాలో! ఎన్ శెయకేన్ ఉలకత్తీరే!"** (తిరుమాలై–19) (పడమటి దిశలో శిరస్సును పెట్టి, తూర్పుదిశగా పాదాలను చూచి, ఉత్తర దిక్కుకు వెనుక భాగాన్ని చూపి, దక్షిణ దిక్కులోని లంకను కటాక్షించి సముద్రవర్ణుడైన నా తండ్రి సర్పశయనంపై నిద్రించడాన్ని చూచి నా శరీరం ద్రవిస్తున్నది! ఆహా! లోకులారా! ఏమి చేయను?) అని దర్శించి ఆనందించిన తొణ్డరడిప్పొడి ఆ<u>ళ్</u>వార్లవలె వీరుకూడా దర్శించి ఆనందించారని తెలుపబడింది.

**(ముదితాంతరాత్మా)** – ఈ రీతిలో అనుభవించి, గొప్ప ఆనందాన్ని పొందిన మనస్సును కలవారయ్యారు, (తిరుప్పాణ్ ఆ<u>ళ్</u>వార్లు). అంటే – సంతోషించిన మనస్సును కలవారయ్యారు. ఇక్కడ **"అంతరాత్మ"** అనే శబ్దం మనస్సును నిర్దేశిస్తున్నది. **"ఉవన్ద ఉళ్ళత్తనాయ్ ఉలకమళన్ద"** (అమలన్–2) (సంతోషించిన మనస్సు కలవాడై లోకాలను కొలిచిన) అని ఆ<u>ళ్</u>వార్లు భగవానునకు కల్గినట్లుగా పల్కిన ఆనందాన్ని తాముకూడా పొందారు. సంతోషించిన మనస్సుతో సమాహితులయ్యారు. **"మకి<u>ళ్</u>న్దదు శిన్దై తిరుమాలే! మ<u>ఱ్ఱు</u>మ్ మకి<u>ళ్</u>న్దదు ఉన్ పాదమే పో<u>ఱ్ఱి</u> మకి<u>ళ్</u>న్దదు అ<u>ళ</u>లా<u>ళి</u> శజ్గమ్ అవై పాడి యాడుమ్ తొ<u>ళి</u>లాకమ్ శూ<u>ళ్</u>న్దు తుణిన్దు"** (ఇరణ్డామ్ తిరు–32) (శ్రియః పతీ! మనస్సు ధ్యానంలో ఏకాగ్రతను పొంది ఆనందించింది. మిగిలిన వాగింద్రియం నీ శ్రీచరణమనే స్తుతించి, శత్రువులపై నిప్పును వెలువరించే చక్రం, శంఖం – అనే రెండిటిని గానం చేసి ప్రీతి చెందింది. శరీరం నర్తనం చేసే వ్యాపారంలో వ్యాపించి, ప్రీతి చెందింది) అని పూదత్తా<u>ళ్</u>వార్లు అనుభవించిన స్థితిని వీరుకూడా పొందారు కదా!



ఇక, అంతటితో నిలవకుండా, అంతకు మించి వేఱు ఏ వస్తువును చూడని స్థితిని పొందారు – అని తరువాత తెలుపబడుతున్నది.

**(అద్రష్టృతాం నయనయో ర్విషయాంతరాణామ్) – "అణియరజ్గన్ ఎన్ అముదినై క్కణ్డ కణ్గళ్ మ<u>ఱ్ఱొ</u>న్ఱినై క్కాణావే"** (అమలన్–10) (లీలావిభూతికి ఆభరణంవంటి శ్రీరంగనాథుని దర్శించిన నా కన్నులు ఇంకొక వస్తువును చూడవు) అని వీరే స్వయంగా అనుగ్రహించిన రీతిలో వేఱుదేనినీ చూడని నేత్రాలను కలవారయ్యారు. **"అస్తమితాన్యభావులు"** (మిగిలిన విషయాలు మనస్సునుంచి తొలగిన స్థితిని పొందినవారు) అనే స్థితిని పొందారు. **"నాశ్నంతి న పిబంతి ఏతదేవామృతం దృష్ట్వా తృప్యంతి"** (ఛాందోగ్య–3–6) (నిత్యులు, ముక్తులు పరమాత్మ అనే ఈ మధువును భుజించడం లేదు. తాగడం లేదు. అమృతంవంటి ఇతని చూచి తృప్తిచెందుతున్నారు) అనే ఉపనిషద్వాక్యంలో తెలుపబడిన స్థితిని పొందారు. **"అరజ్గమా కోయిల్ కొణ్డ కరుమ్బినై క్కణ్డుకొణ్డు ఎన్ కణ్ణిణై కళిక్కు మాతే"** (శ్రీరంగాన్ని కోవెలగా చేసికొన్న చెఱకువంటి భగవానుని దర్శించి నా నేత్రద్వయం ఆనందించే తీరు) (తిరుమాలై–17) అని పల్కిన తొణ్డరడిప్పొడియా<u>ళ్</u>వార్ల వలె **"రామం మేఽనుగతా దృష్టి రద్యాపి న నివర్తతే, న త్వా పశ్యామి కౌసల్యే! సాధు మా పాణినా స్పృశ"** (ఓ కౌసల్యా! రాముని అనుసరించిపోయిన నాదృష్టి ఇప్పటికీ ఇంకా తిరిగి రాలేదు. అందువల్ల నిన్ను నేను చూడలేకుండా ఉన్నాను. నీ చేతిలో నన్ను బాగా స్పృశించు) (రామా–అయో–42–34) అనే దశరథ మహారాజువలె వీరుకూడా భగవానుని సౌందర్యాబ్ధిలో మునిగిపోయారు. భగవానుని సౌందర్యం వీరికి అన్య విషయాలలో అజ్ఞానాన్ని కల్గించింది. దర్శించలేనిదానిని దర్శించినందువల్ల దర్శించగల్గినది దర్శించలేనిది అయినది. **"విషయాంతరాణామ్"** అనే పదానికి "భగవానుని తప్ప మిగిలిన విషయాలలో" – అనే అర్థాన్ని చెప్పకుండా, భగవానుని శయనించిన సన్నివేశం కాకుండా అన్యసన్నివేశాలలో – అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. అంటే– **"శిన్దై మ<u>ఱ్ఱొ</u>న్ఱిన్ తిఱత్తదల్లాత్తన్మై తేవపిరాన్ అఱియుమ్"** (తిరువాయ్–7–10–10) (దాసుడనైన నా మనస్సు భగవానునివై తప్ప ఇంకొక విషయంపై నిలువదు – అని నిత్యసూరులకు నాథుడు తెలియగలడు) అనే నమ్మా<u>ళ్</u>వార్లవలె, **"స్నేహ మే పరమో! రాజన్ త్వయి నిత్యం ప్రతిష్ఠితః, భక్తిశ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి"** (రామా–ఉత్తర–40–15) (స్వామీ! నీపట్ల నాకు గొప్ప ప్రేమ ఎల్లప్పుడు స్థిరంగా ఉన్నది. వీరా! నీపట్ల భక్తి కూడా

నిత్యంగా ఉన్నది. నా భావన అయితే వైకుంఠ నాథుని పట్ల పోవడం లేదు) అని పల్కిన హనుమానునివలె, శ్రీరంగనాథునిపట్ల అభినివేశాన్ని పొందినందువల్ల పర-వ్యూహ-విభవ-అంతర్యామి-మిగిలిన అర్చామూర్తులు అనే వేటిలోను వీరు దృష్టిలేనివారయ్యారు-అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. **"కట్కిలీ"** (కంటికి కన్పించనివాడా!) (తిరువాయ్-7-2-3) అనేరీతిలో ఇంతవరకు కల్పించని పెరియపెరుమాళ్‌యొక్క దివ్య రూపాన్ని దర్శించి, అనుభవించి (ఆనందించి) నందున మిగిలిన సన్నివేశాలను చూడనివారయ్యారు. దర్శించని మిగిలిన అవస్థలు అన్నీ తాము దర్శించిన శ్రీరంగ నాథునిలో ఉన్నాయి కదా! **"మైప్పడి మేనియుమ్ శెన్దామరై క్కణ్ణుమ్ వైదికరే మెయ్ప్పడియాల్ ఉన్ తిరువడి చ్చూడుమ్ తకైమైయి నార్"** (తిరువిరు-94) (వేదవిదులు కాటుకరంగు లోని తిరుమేనిని, ఎఱ్ఱతామరల వంటి నేత్రాలను కల నీ శ్రీచరణాలను వాస్తవంగా శిరసావహించే స్వభావాన్ని కలవారు) అనే తిరుమేనిని దర్శించి మిగిలిన విషయాలను వేనినీ చూడకుండా ఉండేవారెవరు! అనే విషయం ఇకపై తెలుపబడుతున్నది.

**(యో నిశ్చికాయ మనవై మునివాహనం తమ్)** - ఎవరు, **"అణ్డర్‌కోన్ అణి యరఙ్గన్ ఎన్ అముదినై క్కణ్డ కణ్‌గళ్ మ*ఱ్ఱొ*న్ఱినై క్కాణావే"** (అమలన్-16) (బ్రహ్మాండాధిపతి, లీలావిభూతికి ఆభరణం అయిన శ్రీరంగనాథుడనే అమృతాన్ని దర్శించిన నా కన్నులు ఇంకొక వస్తువును చూడవు) అని ఈ విషయాన్ని నిశ్చయించారో, అటువంటి ఆ మునివాహనులను - అని భావం.

**(మనవై)** - మనస్సుతో అనుభవిస్తాను - అని అర్థం. **"అయన్ అలర్ కొండు తొ*ఴు*దేత్త కఙ్గై పోదరక్కాల్ నిమిర్‌త్తరుళియ కణ్ణన్"** (పెరియ తిరు-4-2-6) (బ్రహ్మ పూలను సమర్పించి నమస్కరించి స్తుతించేటట్లుగా గంగానది ప్రవహించే టట్లు శ్రీచరణాన్ని ఉన్నతంగా పెట్టిన సర్వేశ్వరుడు) అనే రీతిలో భగవానుడు త్రివిక్రమావతారాన్ని ఎత్తినపుడు హంసను వాహనంగా కల్గిన చతుర్ముఖుడు, నాల్గు ముఖాలతో అనుభవించినట్లుగా వీరుకూడా ఏకముఖంగా రెండు కన్నులతో దర్శించి అనుభవించారు. **"కిరీటకేయూరక రత్నకుణ్డలమ్ ప్రలంబముక్తామణిహేమ భూషితమ్, విశాల వక్షఃస్థలశోభికౌస్తుభమ్ శ్రియా చ దేవ్యాఽధ్యుషితోరువిగ్రహమ్, ప్రతప్తచామీకర చారువాససమ్, సుమేఖలానూపురశోభితాంఘ్రికమ్, సువర్ధునీజాత మృణాళకోమలమ్, తథా నమచ్ఛచ్ఛవియజ్ఞసూత్రకమ్, భుజోపధానం ప్రకృతాన్యహస్తం నికుంచితోత్తానిత పాదయుగ్మమ్, సుదీర్ఘ మూర్వం సముదగ్రవేషమ్**



**భుజంగతల్పం పురుషం దదర్శ"** (కిరీటం, బాహుపురులు, రత్నకుండలాలు - అనే వీనిని కలవాడు, వేలాడే ముత్యాల, రత్నాల హారాలతో, బంగారంతో అలంక రింపబడినవాడు, విశాలమైన వక్షఃస్థలంలో ప్రకాశిస్తున్న కౌస్తుభమణిని కలవాడు, శ్రీదేవి నిత్యవాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడు, కఱగించిన బంగారువంటి అందమైన పీతాంబరాన్ని కలవాడు, అందమైన మొలనూలుతో, నూపురాలతో ప్రకాశించే పాదాలను కలవాడు, తామరతాడులవలె అందమైన, స్వచ్ఛమైన కాంతిని కల్గిన యజ్ఞోపవీతాన్ని కలవాడు, ఒక చేతిని తలదిండుగా చేసికొన్నవాడు, ఇంకొక చేతిని చాచి ఉంచినవాడు, చాచి విస్తరించిన, కొంచెం పైకెత్తిన పాదాలను రెండిటిని కలవాడు, చాలా పొడుగైన, బలమైన బాహుస్కంధాలను కలవాడు, గొప్ప అలంకారాన్ని కలవాడు, ఆదిశేషుని పడుకగా కలవాడైన పరమపురుషుని దర్శించాడు) (శ్రీహస్తిగిరి మాహాత్మ్యమ్) అని బ్రహ్మ ఉపాసకుడు కనుక శిరస్సు నుండి ఆరంభించి దర్శించాడు. వీరు పాదదాసులు కనుక పాదాలనుండి ఆరంభించి దర్శిస్తున్నారు. బ్రహ్మ భగవానుని దర్శించిన తరువాత, సృష్టికార్యాన్ని చేయవలసి ఉన్నందున అన్యవిషయాలను దర్శించాడు. వీరు **"తిరుక్కమలపాదమ్ వన్దు ఎన్ కణ్ణినుళ్ళన ఒక్కిన్డవే"** (అమలన్-1) అని, **"ఎన్ అముదినై క్కణ్డ కణ్‌గళ్ మ*ఱ్ఱొ*న్ఱినై క్కాణావే"** (అమలన్-10) అని మిగిలిన విషయాలను చూడనివారయ్యారు. **"శేమముడై నారదనార్ శెన్ఱు శెన్ఱు తుదిత్తు ఇఱైఞ్జ క్కిడన్దాన్ కోయిల్.... పునల రఙ్గమ్"** (పెరియా*ఴ్*వార్ తిరు-4-9-5) (బ్రహ్మ భావనానిష్ఠను కల శ్రీనారదుడు పలుమార్లు వచ్చి తన శేషత్వానికి తగినట్లు స్తుతించి, ప్రణమిల్లేటట్లు శయనించి ఉండేచోటు.... నీటిసమృద్ధిని కల శ్రీరంగం) అనే రీతిలో బ్రహ్మ భావనానిష్ఠుడైన నారదుడు, భగవానుని దర్శించగానే అతని తిరుమేనిలో (మునిగిన) లీనమైన ఈ తిరుప్పాణ్ ఆ*ఴ్*వార్లకు ఏ రీతిలోను సాటిరాడు. వీణను చేతిలో ధరించి, భగవాను నకు సేవచేసిన వీరికి ఆ ముని సాటి రాడు.

పెరియా*ఴ్*వార్లు కూడా వీరివలె పెరియా*ఴ్*వార్ తిరుమొ*ఴి*లో **"శీదక్కడల్"** అనే రెండవ దశకంలో) పాదాదికేశాంతంగా భగవానుని తిరుమేని అందాన్ని అనుభవించారు. ఆ ఆ*ఴ్*వార్లు విభవావతారంలో ఒకటి అయిన శ్రీకృష్ణుని అనుభవించారు. వీరు, అర్చావతారంలో ఒకటి అయిన శ్రీరంగనాథుని అనుభవించారు. వారు **"పాదక్కమలమ్"** (పెరియా*ఴ్*వార్ తిరు 11-2-1) అని పల్కినదానిని వీరు **"తిరుక్కమలపాదమ్"** (అమలన్-1) అని అన్నారు. వారు, "పీ

**దక చ్చిఱ్ఱాడైయొడుమ్"** (పెరియాళ్వార్ తిరు-1-7-3) అనేదానిని వీరు, **"అరై చ్చివన్ద ఆడైయిన్ మేల్"** (అమలన్-2) అని అన్నారు. వారు **"అళ్ళకియ ఉన్ది"** (అందమైన నాభి) (పెరియాళ్వార్ తిరు-1-2-8) అని పల్కినదానిని వీరు, **"అయనై ప్పడైత్తదోర్ ఎళ్ళిల్ ఉన్ది"** (అమలన్-3) అని, వారు, **"పళ్ళమ్ తామ్బాలార్త్త ఉదరమ్"** (పెరియాళ్వార్ తిరు-1-29) (పాతబడిన దారంతో కట్టబడిన ఉదరం) అనేదానిని వీరు **"తిరువయిఱ్ఱు దరబన్దమ్"** (అమలన్-4) అని, వారు **"కురుమామణిప్పూణ్ కులావి త్తికళ్ళుమ్ తిరుమార్బు"** (పెరియాళ్వార్ తిరు 1-2-10) అనేదానిని వీరు, **"తిరువరై మార్బు"** (అమలన్-5) అని, వారు, **"అణ్డముమ్ నాడుమ్ అడఙ్గ విళ్ళుఙ్గియ కణ్డమ్"** (పెరియాళ్వార్-1-2-13) (బ్రహ్మాండాలను, లోకాలను పూర్తిగా మింగిన కంఠం) అని పల్కినదానిని వీరు **"మఱ్ఱుమ్ ఉణ్డ కణ్డమ్"** (అమలన్-6) అని, వారు **"నెయ్త్తలై నేమియుమ్ శఙ్గుమ్ నిలావియ కైత్తలమ్"** (పెరియాళ్వార్) అని పల్కినదానిని వీరు, **"కైయినార్ శురిశఙ్గు అనలాళ్ళియర్"** (అమలన్-7) అని, వారు, **"శెమ్ తొణ్డ వాయ్"** (పెరియాళ్వార్ తిరు-1-2-14) అని పల్కినదానిని వీరు, **"శెయ్య వాయ్"** (అమలన్-7) అని వారు, **"కణ్గళ్ ఇరున్ద వా"** (పెరియాళ్వార్ తిరు-1-2-16) అనేదానిని వీరు, **"అప్పెరియవాయ కణ్గళ్"** (అమలన్-8) అని, వారు, **"ఉరువు కరియ ఒళిమణివణ్ణన్"** (పెరియాళ్వార్ తిరు-1-2-17) అని పల్కినదానిని వీరు, **"ఎళ్ళిల్ నీలమేని"** (అమలన్-9) అని, వారు, **"కుళ్ళల్కళ్ ఇరున్దవా"**(పెరియాళ్వార్ తిరు-1-2-20) (కేశపాశం ఉండే తీరు) అని పల్కినదానిని వీరు, **"తుళప విరైయార్ కమళ్ నీళ్ ముడి"** (అమలన్-7) అని పలికారు. **"కోవలనాయ్ వెణ్ణెయ్ ఉణ్డ వాయన్"** (అమలన్-10) అని వీరుకూడా (శ్రీరంగనాథుని) పెరియపెరుమాళ్‌ను గూర్చి పల్కినందువల్ల వీరుకడా శ్రీకృష్ణునే దర్శించి, ఆనందించారని పల్కడంలో లోటు లేదు. అందువల్ల అనుభవంలో వీరిరువురు సహోదరులై ఉన్నారు. ఈ విధంగా మనస్సులో ఆనందం కలిగేటట్లుగా అనుభవించిన తిరుప్పాణ్ ఆళ్వార్లను ఈ తనియన్ పాశురంలో **"మనవై"** అని అంటూ మనస్సులో ఆనందం కలిగేటట్లు మనస్సుతో దర్శించి ఆనందించిన రీతి తెలుపబడింది.

**కాట్టవే కణ్డ పాదమ్ కమల నల్లాడై యున్ది,**
**తేట్టరు ముదరబన్దమ్ తిరుమార్వు కణ్డమ్ శెవ్వాయ్,**
**వాట్టమిల్ కణ్గళ్ మేని ముని యేతి త్తని పుకున్దు,**
**పాట్టినాల్ కణ్డు వాళ్ళుమ్ పాణర్తాళ్ పరవినోమే.**



కాట్టవే = (శ్రీలోకసారంగమునులు తను భుజములపై మోయుచు తీసికొనివచ్చి) చూపగా, కణ్డ = దర్శించిన, కమల పాదమ్=పాదారవిందములను, నల్ల్ ఆడై= చక్కని పీతాంబరమును, ఉన్ది = (బ్రహ్మకు జన్మస్థానమైన) నాభిని, తేట్టు అరుమ్= అరుదైన రత్నములు పొదిగిన, ఉదర బంధమ్ = మొలత్రాడును, తిరుమార్బు = లక్ష్మీదేవికి నిలయమైన వక్షఃస్థలమును, కణ్డమ్ = కంఠమును, శెవ్వాయ్ = ఎఱ్ఱని అధరమును, వాట్టమ్ ఇల్ = వాడని (తామరలవంటి), కణ్గళ్= నేత్రము లను, మేని = (ఇట్టి దివ్యావయవములతో కూడిన) దివ్యరూపమును, ముని ఏతి = లోకసారంగమునిని అధిరోహించి, తని పుకున్దు= ఒంటరిగా (ఆలయ మును) ప్రవేశించి, పాట్టినాల్ = ద్రావిడపాశురములతో, కణ్డు వాళ్ళుమ్ = దర్శించి, ఉజ్జీవించే, పాణర్ = **"తిరుప్పాణ్"** అనబడు మునివాహనసూరి యొక్క తాళ్ = పాదములను, పరవినోమే= స్తుతించితిమికదా!

**2. అవ : (కాట్టవే కణ్డ పాదకమలమ్) పెరియపెరుమాళై పాదాదికేశాన్త మాయనుభవిక్కప్పెఱ్ఱ పాణ్బెరుమాళై స్తోత్రమ్ పణ్ణి హర్షిక్కుమ్బడి శొల్లుకిఱతు.**

వ్యాఖ్య : **(కాట్టవే కణ్డ పాదకమలమ్)** "అరఙ్గత్తమ్మాన్ తిరుక్కమలపాతమ్ వన్దెన్ కణ్ణిరుళ్ళన ఒక్కిన్ఱవే" ఎన్ఱు "శ్రీరఙ్గేశయ పాదపఙ్కజయుగమ్" ఎన్ఱ శ్రీరఙ్గరాజ చరణామ్బుజఙ్గళై చ్చొల్లుకిఱతు.

**(నల్లాడై)** "అరఙ్గతమ్మా నరైచ్చివన్ద వాడై" ఎన్ఱు రఙ్గధురన్ధరనుడైయ పీతామ్బరత్తై చ్చొల్లుకిఱతు.

**(ఉన్ది)** "అరఙ్గత్తరవిణైయాన్ - అయనై ప్పడైత్తతోరెళ్ళిలున్ది" ఎన్ఱు విధిశివనిదానమాన నాభీపద్మత్తై చ్చొల్లుకిఱతు.

**(తేట్టరు ముతర వన్దమ్)** "తేట్టరుమ్ తిఱల్ తేనా"న తెన్నరఙ్గనుడైయ తేడక్కరియ ఉదరబన్ధమ్. "అరఙ్గత్తమ్మాన్ తిరువయిఱ్ఱుదరపన్దమ్" ఎన్ఱు "పట్టికోదరబన్ధన" మెన్ఱత్తై చ్చొల్లుకిఱతు.

**(తిరుమార్వు)** "అరఙ్గత్తమ్మాన్ తిరువారమార్వు" ఎన్ఱు- లక్ష్మీలలితగృహ మాన వక్షఃస్థలత్తై చ్చొల్లుకిఱతు.

**(కణ్డమ్)** "అరఙ్గనకర్ మేయ అప్పన్ ముఱ్ఱు ముణ్డ కణ్డమ్" ఎన్ఱు శ్రీరఙ్గనేతావిన్ కణ్ఠత్తై చ్చొల్లుకిఱతు.

(శెవ్వాయ్) "అణి యరఙ్గనార్- శెయ్యవాయ్" ఎన్ఱు-"అధరమధురామ్భోజమ్" ఎన్ఱ అరుణాధరపల్లవత్తై చ్చొల్లుకిఱతు.

(వాట్టమిల్ కణ్గళ్) క్షణోజ్జ్వలమాయ్, గ్లానియై యుడైయ తామరై ప్పూవిల్ వ్యావృత్తమాయ్, "సదైకరూపరూప" మాయ్, "అరఙ్గత్తమలన్ ముకత్తు క్కరియవాకి ప్పుడై పరన్దు మిళిర్న్దు శెవ్వరి యోదు నీణ్డ అప్పెరియవాయ కణ్గళ్" ఎన్ఱు "విశాలస్ఫీతాయద్రుచిరశిశిరాతామ్రధ వళమాన"- శ్రీరఙ్గప్రణయినయనాబ్జఙ్గళై చ్చొల్లుకిఱతు.

(మేని) ఏవం విధమాన దివ్యమఙ్గళవిగ్రహత్తై.

(ముని యేఱి) మునివాహనరాయ్.

(తని పుకున్దు) ఇప్ప మహాభోగత్తిలే తామ్ ఏకరాయ్ ఉళ్ పుకున్దు,

(పాట్టినాల్) అనుభవత్తుక్కు ప్పాశురమిట్టు ప్పేశిన 'అమలనాతిపిరాన్" ఎన్గిఱ ప్రబన్ధత్తిన్ పాట్టుక్కళాలే. "అణ్డర్కోన్ అణియరఙ్గనై" క్కణ్డు వాழுమవరాయ్ నిన్ఱు, ఇవర్. పిన్బు ఇవ్వనుభవత్తుక్కు భట్టర్ దేశికరానార్.

(పాట్టినాల్ కణ్డు వాழுమ్) కాట్చియే వాழ்చ్చియాక వాழுకిఱ.

(పాణర్ తాళ్) వీణాపాణియాయ్, ప్పెరియప్పెరుమాళ్ తిరువడిక్కీழே నిరన్తరసేవై పణ్ణిక్కొణ్డునిఱ్కిఱ తిరుప్పాణాழ்వార్ తిరువడికళై.

(పరవినోమ్) స్తోత్రమ్ పణ్ణినోమ్. అలభ్యలాభమానతు లభిక్కవుమ్ పెఱ్ఱోమ్, ఇని యొరు కుఱైకళు మిల్లై -ఎన్గిఱతు.

పిళ్ళైలోకమ్ జీయర్ తిరువడికళే శరణమ్

తనియన్ వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు.

## ఆంధ్రానువాదం

**అవతారిక :** శ్రీరంగనాథుని శ్రీచరణాలనుండి కిరీటపర్యంతం అనుభవించిన తిరుప్పాణ్ ఆழ்వార్లను స్తుతించి ఆనందించే రీతిని ఈ తనియన్ తెల్పుతున్నది.

**వ్యాఖ్యానమ్ : (కాట్టవే కణ్డ పాదకమలమ్) – "అరఙ్గత్తమ్మాన్ తిరుక్కమలపాదమ్ వన్దు ఎన్ కణ్ణినుళ్ళన ఒక్కిన్ఱవే"** (అమలన్–1) (శ్రీరంగనాథుని పాదపద్మాలు వచ్చి నా కళ్ళలో నిలిచి ఉన్నాయి, ఆహా!) అని వీరు అనుగ్రహించినందువల్ల పాద కమలాన్ని భగవానుడే దర్శింపజేయగా వీరు దర్శించారు – అని స్ఫురిస్తున్నది. ఈ పాదకమలాన్ని – **"శింజానశ్రుతి శింజినీ మణిరవైః వజ్రారవింద ధ్వజైః ఛత్రీ కల్పక శంఖచక్రముకురై స్తైస్తైశ్చ రేఖామయైః ఐశ్వర్యేణ జయం త్రివిక్రమవిముఖం ఘుష్యద్భిరామ్రేడితం శ్రీరంగేశయపాద పంకజయుగం వందామహే సుందరమ్ ॥ (శ్రీరంగరాజస్తవమ్-పూర్వ-125)** (సర్వేశ్వరత్వంతో, మూడడుగులను పెట్టి కొలువడం మొదలైన విజయచేష్టితాలను పలుమార్లు ప్రసిద్ధి పొందించే ధ్వనిని చేసే వేదరూపి అయిన శ్రీచరణాల మంజీరాల ధ్వనులతో, రేఖల రూపంలో భాసించే ఆ యా వజ్రం, తామరపూవు, ధ్వజం, ఛత్రం, కల్పవృక్షం, శంఖం, అద్దం మొదలైనవానితో అందంగా ఉండే శ్రీరంగనాథుని శ్రీచరణాల ద్వంద్వానికి నమస్కరిస్తున్నాను) అని అంటూ పరాశరభట్టర్‌కూడా అనుగ్రహించారు కదా!

**(నల్లాడై) "అరఙ్గత్తమ్మాన్ అరైచ్చివన్ద వాడై"** (అమలన్–2) (శ్రీరంగనాథుని నడుము గల ఎఱ్ఱని పీతాంబరం) అని శ్రీరంగశ్రీని నిర్వహించే పీతాంబరాన్ని ఈ పదం తెల్పుతున్నది.

**(ఉన్ది) – "అరఙ్గత్తరవినణైయాన్ అయనై ప్పడైత్తదోరెழிల్ ఉన్ది"** (అమలన్–3) (శ్రీరంగంలో ఆదేశేషుని పర్యంకంగా గల్గిన శ్రీరంగనాథుని బ్రహ్మను సృష్టించిన ప్రకాశించే నాభి) అని అంటూ బ్రహ్మరుద్రులకు కారణమైన నాభీకమలాన్ని ఇది తెల్పుతున్నది. **"త్రయో దేవా స్తుల్యా స్త్రితయమిద మద్వైతమధికమ్ త్రికాదస్మా త్తత్త్వం పరమితి వితర్కాన్ విఘటయన్, విభో ర్నభీపద్మో విధిశివనిదానం భగవత స్తదన్యభ్రూభంగీపరవదితి సిద్ధాంతయతి నః"** (శ్రీరంగరాజస్తవమ్–పూర్వ–116) (త్రిమూర్తులు ముగ్గురు సమానులు–అని, ఈ మూడు మూర్తులు ఒక్కటే అని, ఈ త్రిమూర్తులకంటే గొప్పదైన పరతత్త్వం ఒకటి ఉన్నది – అని పలికే పలు విప్రతి పత్తులను (విరుద్ధవాదాలను) ఖండిస్తూ, బ్రహ్మరుద్రులకు మూలకందమై ఉండే శ్రీరంగనాథుని తిరునాభీకమలం, అతనికంటే మిగిలిన అన్ని వస్తువులు అతని కనుబొమల కదలికలకు వశమై ఉన్నవి – అని మనకు సిద్ధాంతీకరిస్తున్నవి) అని పరాశరభట్టర్ అనుగ్రహించారు కదా!

**(తేట్టరుమ్ ఉదరబన్దమ్) "తేట్టరుమ్ తిఱల్ తేనినై త్తెన్నరఙ్గనై"** (పెరుమాళ్ తిరు–2–1) (భోగ్యమైన పుట్టతేనెవంటివాడైన శ్రీరంగనాథుని) అని కుల

శేఖరాழ்వార్ అనుగ్రహించిన రీతిలో, ఎవరూ తమ ప్రయత్నం ద్వారా అన్వేషించలేని శ్రీరంగనాథుని ఉదరబంధం. (బంగారు మొలనూలు). **"అరఙ్గత్తమ్మాన్ తిరువయిఱ్ఱుదరబన్దమ్"** (అమలన్-4) (శ్రీరంగనాథుని నడుములో గల ఉదర బంధం) అని తిరుప్పాణ్ ఆழ்వార్లచేత అనుభవింపబడినదై, **"త్రివిధచిదచిద్బృందం తుందావలంబి వళిత్రయం విగణయదివైశ్వర్యం వ్యాఖ్యాతి రంగమహేశితుః, ప్రణతవశతాం బ్రూతే దామోదరత్వకరః కిణః తదుభయగుణాకృష్టం పట్టం కిలోదరబంధనమ్"** (శ్రీరంగరాజస్తవం-పూర్వ-115) (శ్రీరంగనాథుని ఉదరంపై ఉండే మూడు మడుపులు (తివళులు), మూడు విధాలైన చేతనాచేతన సమూహాన్ని లెక్కిస్తున్నట్లుగా (సకలచేతనాచేతనాలను నియమించడమనే) ఐశ్వర్యాన్ని వ్యాఖ్యానిస్తున్నది. దామోదరుడనే తిరునామానికి మూలమైన కిణం (గట్టిగా కాయవలె ఉండే భాగం) ఆశ్రితపరాధీనుడనే విషయాన్ని తెల్పుతున్నది. ఉదరబంధమనే ఆభరణ విశేషం పైన తెల్పిన పరత్వ-సౌలభ్య గుణాలు రెండిటికోసం కట్టిన పట్టంగా భాసిస్తున్నది) అని భట్టర్‌చే వర్ణింపబడిన నడుములోని ఆభరణాన్ని తెల్పుతున్నది.

**(తిరుమార్బు)** – **"అరఙ్గత్తమాన్ తిరువారమార్బు"** (అమలన్-5) అని తిరుప్పాణ్ ఆழ்వార్లచే చెప్పబడినదై, భట్టర్‌చే శ్రీరంగరాజస్తవంలో శ్రీరంగనాథుని లలిత గృహంగా (శ్రీరంగరాజస్తవం-పూర్వ-111) చెప్పబడిన వక్షఃస్థలాన్ని తెల్పుతున్నది...

**(కణ్డమ్)** – **"అరఙ్గనకర్ మేయ అప్పన్ ముఱ్ఱుమ్ ఉణ్డ కణ్డమ్"** (అమలన్-6) (శ్రీరంగంలో శయనించి ఉండే జగత్పితయొక్క అన్నిటిని గ్రహించిన కంఠం) అని అంటూ తెలుపబడిన శ్రీరంగనాథుని కంఠాన్ని తెల్పుతున్నది.

**(శెవ్వాయ్)** – **"అణి యరఙ్గనార్ అరవినణైమిశై మేయ మాయనార్ శెయ్యవాయ్"** (అమలన్-7) (భూమిలోని ఆభరణంవంటి శ్రీరంగంలో వేంచేసి ఉండేవాడు, శేషశయనంపై శయనించి ఉండే ఆశ్చర్యగుణచేష్టితుడైన శ్రీరంగనాథుని ఎఱ్ఱని అధరం) అని ఆழ்వార్లచేత అనుభవింపబడినదై, **"అధరమధురాంభోజం తత్కర్ణపాశమృణాళికావలయమపి మామాస్తాం రంగేందువక్త్రసరశ్చిరమ్, నయనశఫరం నాసాశైవాలవల్లరీ కర్ణికామకర మలకశ్రేణీ పర్యంతనీలవనావలి"** (శ్రీరంగ రాజస్తవమ్-పూర్వ-103) (అధరమనే భోగ్యమైన తామరపూవును కల్గినది, కర్ణపాశాలు అనే తామర తూడుల వలయాన్నికూడా కల్గినది, తిరునేత్రాలనబడే చేపలను కల్గినది, నాసిక అనే నాచుతీగలను కల్గినది, కర్ణభూషణాలనే మకరాలను కల్గినది, కేశపాశమనే సమీపంలో ఉండే నల్లని తోటలను కల్గినది అయిన పరమ



విలక్షణమైన శ్రీరంగనాథుని ముఖమండలమనే తటాకం చిరకాలం నన్ను కటాక్షించాలి) అని అంటూ శ్రీరంగరాజస్తవంలో తెలుపబడిన ఎఱ్ఱని దొండపండు వంటి అధరాన్ని తెల్పుతున్నది.

**(వాట్టమిల్ కణ్‌గళ్)** – క్షణకాలం మాత్రమే ఉజ్జ్వలంగా ఉన్నదై, మండించే స్పర్శను కల తామరపూవుకంటే మిక్కిలి విలక్షణమైనది, ఎల్లప్పుడు ఒకే రీతిలో ఉన్నది, **"అరఙ్గత్తమలన్ ముకత్తు క్కరియ వాకిప్పుడై పరన్దు మిళిర్న్దు శెవ్వరియోడు నీణ్డ అప్పెరియవాయ కణ్‌కళ్"** (అమలన్-8) అని చెప్పబడిన రీతిలో విశాలమై, గొప్పదై, దీర్ఘమై, సుందరమై, చల్లనిదై, తెలుపు ఎఱుపు రంగులు కలిసిన శ్రీరంగనాథుని తామరలవంటి నేత్రాలను తెల్పుతున్నది.

**(మేని)** – ఇటువంటి అప్రాకృతమైన శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహాన్ని.

**(ముని యేఱి)** – లోకసారంగమహామునిని వాహనంగా కల్గినవారై.

**(తని పుకున్దు)** – శ్రీరంగనాథుని అనుభవమనే ఈ గొప్పభోగంలో తాము ఒంటరిగా (అద్వితీయులై) లోపల ప్రవేశించి,

**(పాట్టినాల్)** – తమ అనుభవాన్ని వాగ్రూపంలో పల్కిన **"అమలన్ ఆదిపిరాన్"** అనే దివ్యప్రబంధంలోని పాశురాలతో – అని భావం. **"అణ్డర్‌కోన్ అణి యరఙ్గన్ ఎన్ అముదినై క్కణ్డ కణ్‌గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"**. (అమలన్-10) (బ్రహ్మాండాధిపతి, లీలావిభూతిని ఆభరణం, అయిన శ్రీరంగనాథుడనే నా అమృతాన్ని దర్శించిన నా కన్నులు వేఱొక వస్తువును చూడవు) అని పల్కినవారు కనుక, శ్రీరంగనాథునివద్దనే ఉజ్జీవించారు వీరు. ఆచార్యుల కాలంలో శ్రీరంగరాజ స్తవంలో శ్రీరంగనాథుని దర్శించి అనుభవించినందువల్ల, శ్రీపరాశరభట్టర్ ఈ అనుభవానికి దారి చూపారు.

**(కణ్డు వాழ்ఉమ్ పాణర్‌తాళ్)** శ్రీరంగనాథుని దర్శనాన్ని ఉజ్జీవనంగా తలచి జీవించే తిరుప్పాణ్ ఆழ்వార్ల శ్రీచరణాలను – అని భావం. అంటే – వీణను చేతిలో ధరించి, అంతరంగభక్తులై, శ్రీరంగనాథుని శ్రీచరణాల మోల ఎల్లప్పుడు అనుభవిస్తూ ఉండే తిరుప్పాణ్ ఆழ்వార్ల శ్రీచరణాలను – అని హృదయం.

**(పరవినోమే)** – స్తుతించాము. అలభ్యలాభాన్ని పొందగలిగాము. ఇక ఏలోటు లేదు – అని అంటున్నారు.

**తనియన్ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం ముగిసింది.**

### తిరుప్పాణ్ఆఴ్వార్ అరుళిచ్చెయ్యద

# అమలనాది పిరాన్

### పెరియవాచ్చాన్‌పిళ్ళై అరుళిచ్చెయ్‌త

### వ్యాఖ్యానావతారికై

ప్రణవమ్బోలే అతిసఙ్కుచితమాయిరుత్తల్, వేదముమ్, వేదోపబృంహణమాన మహాభారతమువ్బోలే పెరిన్ద తుఱుప్పుక్కూడా యిరుత్తల్ శెయ్యాతే, పత్తు ప్పాట్టాయ్, సుగ్రహమాయ్, సర్వాధికారముమాయిరుక్కుమ్. "వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః" ఎన్ఱుమ్, "వేదా నధ్యాపయామాస మహాభారతపఞ్చమాన్" ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే వేదోపబృంహణమాన మహాభారత రామాయణఙ్గళుమ్, "నారాయణకథా మిమామ్" ఇత్యాదికళై చ్చొల్లివైత్తు, భగవత్కథై యల్లాతవఱ్ఱైయుమ్ శొల్లివైత్తతు.

తిరువాయ్‌మొఴియుమ్ "అమరర్‌శువై యాయిరమ్" ఎన్ఱుమ్, "పాలోడముతన్న ఆయిరమ్" ఎన్ఱుమ్, "ఉరైకొళ్ ఇన్ మొఴి" ఎన్ఱుమ్- "ఏతమిలాయిర" మాయిరున్దతేయాకిలుమ్, అన్యాపదేశస్వాపదేశమెన్న, సామానాధికరణ్యనిర్ణయమెన్న, త్రిమూర్తిసామ్య తదుత్తీర్ణతత్త్వ నిషేధమెన్న- ఇవై తొడక్కమాన అరుమైకళై యుడైత్తాయిరుక్కుమ్. తిరునెడున్దాణ్డకమ్ పరప్పఱ్ఱు ముప్పతు పాట్టా యిరున్దతేయాకిలుమ్, అతుక్కుమ్ అవ్వరుమైకళుణ్డు. తిరుమాలైక్కు అవ్వరుమైకళిల్లైయే యాకిలుమ్, తమ్ముడైయ లాభాలాభరూపమాన ప్రియాప్రియఙ్గళై ప్రతిపాదియా నిఱ్కుమ్. తిరుప్పల్లాణ్డుక్కు ఇక్కుఱ్ఱఙ్గళిల్లైయే యాకిలుమ్, అతుక్కు మొరు కుఱ్ఱముణ్డు; త్రివిధాధికారికళుడైయ గుణాగుణఙ్గళై ప్రతిపాదిక్కైయాలే. ప్రణవమ్బోలే అసఙ్కుచితమాయ్ దుర్‌జ్ఞేయ మాయిరామైయాలే, "యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్" ఎన్గిఱపడియే - ఆయిరత్తిలొన్ఱుమ్ కడలిల్ కుళప్పడియుమ్బోలే పుఱమ్బిల్లాతవై ఎల్లామ్ ఇతిలే యుణ్డాయ్, ఇతిల్ ఇల్లాత తొన్ఱుమ్ పుఱమ్బిన్ఱియే యిరుక్కుమ్.

పరవ్యూహవిభవఙ్గళై ప్రతిపాదిక్కైయన్ఱిక్కే, అర్చావతారరూపేణ వన్దవతరిత్తు. "తిరువరఙ్గప్పెరునకరుళ్ తెణ్ణీర్పొన్ని తిరైక్కైయాల్ అడివరుడ ప్పళ్ళికొళ్ళుమ్ కరుమణియై క్కోమళత్తై క్కణ్డుకొణ్డు, మణత్తూణే పఱ్ఱి నిన్ఱు- వాయార



వాఴ్‌త్తుకిఱ ప్రబన్ధమాకైయాలే ఎల్లా ప్రబన్ధఙ్గళిలుమ్ ఇప్ప్రబన్ధత్తుక్కు వైలక్షణ్యముణ్డు. మఱ్ఱైయాఴ్వార్ కళిఱ్కాట్టిల్ ఇవర్‌క్కు వాశి యుణ్డు. "పల్లాణ్డు", "పోఱ్ఱి" ఎన్ఱు భావిక్కవేణ్డిఱ్ఱు- అవర్‌కళుక్కు; అతు వేణ్డాతే జన్మసిద్ధమాయ్‌త్తు ఇవర్‌క్కు.

"కులఙ్గళాయ ఈరిరణ్డిల్ ఒన్ఱిలుమ్ పిఱన్దిలేన్" ఎన్గిఱపడియే ఇవర్, తమ్మై నాలువర్ణత్తిలుమ్ పుఱమ్బాక నినైత్తిరుప్పర్. పెరియ పెరుమాళుమ్ అప్పడియే నినైత్తిరుప్పర్. నిత్యసూరికళ్ నాలు వర్ణత్తిలు ముళ్ళారల్లరే. ఆఴ్వార్‌కళ్ "ఇరు కరైయర్" ఎన్నుమ్బడియిఱే శ్రీతొణ్డరడిప్పొడి యాఴ్వార్ ఐకాన్త్యమ్. అవరిలుమ్ ఇవర్ "పరోపదేశముమ్, ఇతరనిరసనముమ్ అనుభవవిరోధి" ఎన్ఱు ఎమ్బెరుమానైయే అడి త్తలై శెవ్వితాక అనుభవిక్కిఱార్.

(స్నేహో మే పరమః) "ఎన్ఱనళవన్ఱాల్ యానుడైయ వన్బు". (రాజం స్త్వయి) ఇతుతానుమ్ ఎన్నాల్ వన్ద తన్ఱు, "అతువు మవనతు ఇన్నరుళే". (నిత్యం ప్రతిష్ఠితః) ఇన్ఱు ఇల్లైయాకిల్ మఱ్ఱొరుపోతు కొడుపోకిఱోమెన్న; అఙ్గన్ శెయ్యుమతన్ఱు, ధర్మైయై ప్పఱ్ఱి వరుకిఱతాకైయాలే. "నిన్నలాలిలేన్ కాణ్" ఎన్నుమాపోలే. (భక్తిశ్చ నియతా) స్నేహమానతు ఎన్ ? భక్తియానతు ఎన్? ఎన్నిల్, పెరుమాళై యొఴియ చ్చెల్లామై పిఱన్ద వ్యతిరేకత్తిల్ ముడిన్ద చక్రవర్తి నిలై- స్నేహమ్, భక్తియావతు- "నిల్" ఎన్న, "కురుష్వ" ఎన్నుమ్బడియాయ్ ముఱై యఱిన్ద పఱ్ఱిన ఇళైయప్పెరుమాళ్ నిలై.

(వీర) తన్నై త్తోత్ప్రిత్త తుఱై. ఉమ్ముడైయ వీరఙ్గొణ్డు పుఱమ్బే వెన్ఱీర్- ఎన్ఱు ఇఙ్గు వెల్లముడియాతు. తానుమ్ వీరనాకైయాలే తోత్ప్రిత్త తుఱైయై ప్పిడిత్తు ప్పేశుకిఱార్. (భావో నాన్యత్ర గచ్ఛతి) ఎన్నై మీట్టిరాకిలుమ్ ఎన్నుడైయ నెఞ్జై మీట్క ప్పోకాతు. "అన్యత్ర" ఎన్గిఱతు- "మఱ్ఱోరానుముణ్డెన్బార్" ఎన్నుమాపోలే కొడుపోక నినైత్త దేశత్తిన్ పేరుఙ్గూడ త్తనక్కు అసహ్యమా యిరుక్కిఱపడి. ఇప్పడి రామావతారమల్లతు అఱియాత తిరువడియైప్పోలేయాయ్‌త్తు- ఇవరుమ్, అవర్ తేవారమాన పెరియపెరుమాళై యల్లతఱి యాతపడియుమ్.

శ్రీవైకుణ్ఠమ్, తిరుప్పాఱ్కడల్, తిరువవతారస్థలమ్, ఉకన్దరుళిన తిరుప్పతికళ్ - ఇవై ఎల్లామ్ పెరియపెరుమాళేయానాప్పోలే, అవ్వవ్విడఙ్గళిలుణ్డాన

సౌన్దర్యగుణచేష్టితఙ్గళెల్లామ్ పెరియపెరుమాళ్ పక్కలిలే కాణలామ్. పెరియ పెరుమాళఴకుమ్, ఐశ్వర్యముమ్ పరమపదత్తిలే ముకుళిత మాయిరుక్కుమ్. అవతారత్తిల్ ఈఱిలై పోరుమ్. ఇఙ్గే వన్దపిన్బు తఴైత్తతు. ఎఙ్గనే? ఎన్నిల్, "పొఙ్గోతమ్ శూఴ్న్ద పువనియుమ్ విణ్ణులకు మఙ్గాతుమ్ శోరామే యాళ్కిన్ఱ ఎమ్బెరుమాన్ శెఙ్గోలుడైయ తిరువరఙ్గచ్చెల్వనా"రాకైయాలే అవ్విడఙ్గళిల్ సఙ్కుచితమా యిరున్దతిఱే.

తన్నై ఉకన్దారై అనుభవిక్కైయన్ఱియే, "తాన్" ఎన్ఱాల్ విముఖరా యిరుప్పారుమ్ కణ్డనుభవిక్కలామ్బడి యిరుక్కైయాలే నీర్మైయినాల్ వన్ద ఏఱ్ఱమిఙ్గే యుణ్డు. గుణాధిక్యత్తాలేయిఱే వస్తువుక్కు ఉత్కర్షమ్; గుణమ్ విలై పెఱువతు ఇఙ్గేయిఱే. గుణత్తిల్ అకప్పట్టార్ ఇవ్విషయమ్ పోక్కి అఱియార్కళిఱే.

"యతో వాచో నివర్తన్తే" ఎన్ఱు- వేదఙ్గళుక్కు ఎట్టాత సర్వేశ్వరనై, ఆఱ్ఱిల్ తణ్ణీరోపాతి ఆఱ్ఱుక్కుళ్ళే కణ్డనుభవిక్కలామ్బడి యిరుక్కిఱ విడమిఱే. "మఴైక్కన్ఱ వరై మునేన్దుమ్ మైన్దనే మతురవాఱా"న అవ్వాఱు ఇవ్వాఱాయ్త్తుక్కాణుమ్.

ఇవర్, తమక్కు ప్రాప్యరుమ్, ప్రాకరుమ్, రుచిజనకరుమ్, విరోధిని వర్తకరుమ్, ఎల్లామ్ పెరియపెరుమాళే - ఎన్ఱిరుక్కిఱార్. ఫలభోక్తృత్వమ్ తమ్మతా యిరుక్క, "ఎల్లా మవరే" ఎన్గిఱపడి ఎఙ్గనే? ఎన్నిల్, ప్రథమసుకృతముమ్ తానాయ్, పేఱ్ఱుక్కు వేణ్డువన నిర్వహిత్తుప్పోన్ద సౌహార్దముమ్ అత్తలైయిలే కిడక్కైయాలే, పేఱ్ఱుక్కు ఇత్తలైయిలుళ్ళతు శొల్ల ప్రాప్తమ్ పోరాతిఱే. ఉళ్ళతుణ్డాకిల్ అవ్వనుగ్రహత్తుక్కు హేతువా మిత్తనై. ఇతరవిషయఙ్గళిల్ అరుచియుమ్, భగవద్విషయత్తిల్ అప్రతిషేధముమ్ విళైన్ద ఇమ్మాత్రత్తిలే పెరియపెరుమాళ్ తమ్ముడైయ స్వరూపరూపగుణవిభూతికళై క్కాట్టి క్కణ్డనుభవిత్తు ప్రీతరాకిఱార్.

"ఆనయైనం హరిశ్రేష్ఠ!" ఎన్ఱు మహారాజరై యిట్టు శ్రీవిభీషణాఴ్వానై అరుళ్పాడిట్టాప్పోలే, "తాఴ్చ్చి మఱ్ఱెఙ్గుమ్ తవిర్న్దు ఉన్ కడైత్తలై యిరున్దు వాఴుమ్ శోమ్బరా"యిరుక్కిఱ లోకసారఙ్గమహామునికళై అరుళ్పాడిట్టు, "నమ్ పాడువానై యఴైత్తు క్కొణ్డువారుమ్" ఎన్న; అవరుమ్, "అరుళ్పాడు అరుళ్ పాడు" ఎన్ఱు శొల్ల; ఇవరుమ్ "అడిప్పాణన్ అడిప్పాణన్" ఎన్ఱు ఇఱాయ్క్క; ఇవరై విడాతే తోళ్మేల్ ఎఴున్దరుళ ప్పణ్ణివిత్తుక్కొణ్డుపోక, వఴియిలే ఒన్బతు పాట్టై ప్పాడి, త్తిరుప్పిరమ్బుక్కుళ్ళే నిన్ఱు పత్తామ్ పాట్టు ప్పాడి త్తలైక్కట్టుకిఱార్.



## అరుమ్బుదమ్

*అమలన్ ప్రవేశే- ప్రబంధవైలక్షణ్యా మరుళిచ్చెయ్కిఱార్ (ప్రణవ మిత్యాది) (తుఱుప్పుక్కూడు) పదఱుమ్, కూళముమ్ కూట్టి త్తూఱ్ఱాప్పోలి. తుఱుప్పుక్కూఱ్ఱానపడి ఎప్పడి? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్. (వేదోపబృంహణేత్యాది) ఎల్లావఱ్ఱిలుమ్ పఱ్ఱ ఆధిక్యమ్ ఎత్తాలే? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్. (యది హాస్తీత్యాది) వక్తృవైలక్షణ్యా మరుళిచ్చెయ్కిఱార్ (మఱ్ఱై యాఴ్వార్కళిత్యాది) పెరుమాళై యొఴియ వేఱొరు స్థలాంతర మఱియాదు ఎప్పడి యిరుక్కిఱదు? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (స్నేహో మే యిత్యాది). ఎల్లా స్థలఙ్గళైయుమ్ విట్టు ప్పెరియపెరుమాళై పఱ్ఱుకైక్కు హేతువేదు? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (శ్రీవైకుంఠ మిత్యాది). (అవ్వాఱు ఇవ్వాఱు) ఎన్ఱదు- రసోక్తి. మేలే కృష్ణన్ తానే వన్దు ఇవ్వాఱ్ఱిలే కణ్వళర్న్దాన్ - ఎన్ఱపడి. ప్రతిపాద్యవైలక్షణ్యత్తై చ్చొల్లానిన్ఱుకొణ్డు ప్రబంధత్తినుడైయ అవతరణక్రమత్తై అరుళిచ్చెయ్కిఱార్ (అవర్తమక్కిత్యాది).*

---

## పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానానికి అనువాదం

### అవతారిక

పది పాశురాలను కల్గిన **"అమలనాదిపిరాన్"** అనే ఈ దివ్యప్రబంధం, ప్రణవమనబడే ఓంకారంవలె మిక్కిలి సంగ్రహంగా కాకుండా, వేదం, వేదాన్ని వివరించే ఉపబృంహణాలైన శ్రీరామాయణ – మహాభారతాలవలె మిక్కిలి విస్తృతంగా, అంతరార్థాన్ని తెలియడానికి వీలుకాకుండా ఉండకుండా, సులభంగా తెలియదగినదై, అందరికి అభ్యసించడానికి వీలయినదిగా ఉన్నది. **"స తు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ, వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః"** (రామా–బాల–4–6) (వేదాలలో స్థిరమైన నిష్ఠను కలవారు, గొప్ప బుద్ధిమంతులైన ఆ కుశలవులను ఇద్దఱిని చూచి ఆ వాల్మీకిమహాముని వారిని వేదాన్ని (శ్రీరామాయణంద్వారా) వివరించడంకోసం పరిగ్రహించాడు) అని, **"వేదానభ్యాస**

**యామాస మహాభారతపంచమాన్, సుమంతం జైమినిం బైలం శుకం చైవ స్వమాత్మజమ్"** (భారత-ఆది-64-131) (వేదవ్యాసభగవానుడు అయిదవ వేదమైన మహాభారతంతో కూడిన నాల్గు వేదాలను సుమంతుడు, జైమిని, బైలుడు, తన కుమారుడైన శుకుడు - అనే నల్గురికి అధ్యాపనం చేశారు) అని చెప్పబడే వేద వివరణరూపాలైన, పూర్వం ప్రస్తావించిన రెండు ఇతిహాసాలను, **"నమో భగవతే తస్మై వ్యాసాయామితతేజసే, యస్య ప్రసాదాత్ వక్ష్యామి నారాయణకథా మిమామ్"** (భారత-ఆది-1-27) (ఎవరి అనుగ్రహంవల్ల ఈ నారాయణకథను పల్కుతున్నానో, అంతు లేని తేజస్సును కల్గిన ఆ వ్యాసభగవానునకు నమస్కారం) అని పలికే రీతిలో నారాయణకథను తెల్పుతున్నట్లు ఆరంభించి, గంగావృత్తాంతాన్ని, గంగాపుత్రుడైన భీష్ముడు, కుమారస్వామి మొదలైనవారి వృత్తాంతాలను మొదలైన వానినికూడా చెప్పాడు.

తిరువాయ్‌మొழ்ழி కూడా **"అమర్‌శువై ఆయిరమ్"** (తిరువాయ్-1-3-11) (శబ్దార్థ రసాలు నిండి ఉండే వేయి), **"పాలోడముదన్న ఆయిరమ్"** (తిరువాయ్-8-6-11) (పాలతో కలిపిన అమృతంవంటి వేయి) అని, **"ఉరైకొళ్ ఇన్‌మొழ்ழி"** (తిరువాయ్-6-5-3) (లోకులు పొగడే మధురసూక్తి) అని దోషరహితమై వేయి పాశురాలను కల్గినదై ఉన్నా, బాహ్యంగా స్ఫురించే అర్థాలను, అంతరార్థాలను (స్వాపదేశార్థాలను), పరమాత్మను, చేతనాచేతనాలు కలిపి ఒకే విభక్తిలో పలికే సమానాధికరణవాక్యాలను, "త్రిమూర్తులు ముగ్గురు సమానులు అని, వారికంటే మించిన పరతత్త్వం ఒకటి ఉన్నది" అనే వాదాలను నిరసించడం మొదలైన దురవగాహాలైన విషయాలను కల్గినదై ఉన్నది. తిరుమజై మన్నన్ తిరునెడున్దాణ్డకమ్ మిక్కిలి విరివిగా లేకుండా, కేవలం ముప్పై పాశురాలను కల్గినదిగా ఉన్నా, దానికికూడా ముందు తెల్పిన క్లేశాలున్నాయి. తొండరడిప్పొడి ఆழ்వార్ల తిరుమాలై ప్రబంధానికి ముందు తెల్పిన క్లేశాలు లేకపోయినా, తమ లాభాన్ని (ప్రాప్యాన్ని) గూర్చి తలచి ఆనందించడం, తమ నష్టాన్ని ఉద్దేశించి బాధపడడం - అనేవి అందులో ఉన్నాయి. తిరుప్పల్లాణ్డు ప్రబంధానికి ఈ దోషాలు ఏవీ లేకపోయినా, దానికికూడా ఒక దోషం ఉన్నది. అది ఏమి? అంటే - ఐశ్వర్యార్థి, కైవల్యార్థి, భగవచ్ఛరణార్థి- అనే మూడు విధాలైన అధికారులను అందులో ప్రస్తావించడమే. ప్రణవమనబడే ఓంకారంవలె చాలా సంగ్రహమై, అర్థాన్ని తెలిసికోవడం దుర్లభంగా



ఉండే కొఱతకూడా దీనికి లేదు. **"ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ!, యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"** (భారత-ఆది-62-26) (ఓ భరతశ్రేష్ఠా!, ధర్మార్థకామమోక్షాలనే నాల్గు పురుషార్థాలనుగూర్చి ఈ గ్రంథంలో చెప్పబడిన విషయాలే మిగిలిన గ్రంథాలలో ఉంటాయి. ఇందులో లేనివి ఎక్కడా ఉండవు) అని చెప్పబడిన భారతంవలె, వేయిలో ఒకటి అనే సంఖ్య అంతర్భవించి ఉండేటట్లు, సముద్రంలో చిన్న చిన్న నీటి ప్రదేశాలు ఇమిడి ఉండేటట్లు, ఇతరుల గ్రంథాలలో లేనివి అన్నీ ఇందులో ఉన్నాయి, ఇందులో లేనివి వేఱు ఏ గ్రంథంలోను లేవు.

మిగిలిన గ్రంథాలవలె, మనకు దర్శించడానికి వీలుకాని పరస్వరూపం, వ్యూహ దశ, విభవదశ - అనే వీనినిగూర్చి పలుకకుండా, **"తిరువరఙ్గ ప్పెరునకరుళ్ తెణ్ణీర్ పొన్ని తిరైక్కైయాల్ అడి వరుడ ప్పళ్ళి కొళ్ళుమ్ కరుమణియై క్కోమళత్తై క్కణ్డు కొణ్డు" "మణత్తూణే పర్రినిన్ఱు"** (పెరుమాళ్ తిరు-1-1-2) (శ్రీరంగ మహానగరంలో తేటగా ఉండే నీటిని కల కావేరీనది తన కెరటాలు అనే చేతులతో శ్రీపాదాలకు వాహనం చేయగా పరుండి ఉండే నల్లని మణివంటివాడు, కోమలుడైన శ్రీరంగనాథుని దర్శించి ఆమోద స్తంభాలను పట్టుకొని నిలచి) మంగళాశాసనం చేసే కులశేఖరాழ்వార్ల పెరుమాళ్ తిరుమొழ்ழிవలె శ్రీరంగనాథునకు మంగళాశాసనం చేసే ప్రబంధం కనుక, మిగిలిన అన్ని దివ్యప్రబంధాలకంటే ఈ ప్రబంధానికి గొప్ప వైలక్షణ్యం ఉన్నది.

మిగిలిన ఆழ்వార్లకంటే వీరికి చాలా వైలక్షణ్యం ఉన్నది. వారు గొప్ప కులంలో జన్మించినవారు కనుక, వారు **"పల్లాణ్డు"** అని, **"పోర్రి"** అని నైచ్యాన్ని ఆరోపించుకొని పలుకవలసి ఉన్నది. ఆ రీతిలో కాకుండా వీరు నీచకులంలో జన్మించినవారు కనుక, నైచ్యం జన్మతః వీరికి ఉన్నది. **"కులఙ్గళాయ ఈరిరణ్డిల్ ఒన్ఱిలుమ్ పిఱన్దిలేన్"** (తిరుచ్ఛన్ద-90) (నాల్గు వర్ణాలలో దేనిలోను నేను జన్మించలేదు) అనే తిరుమழிశై ప్పిరాన్‌వలె, తమను నాల్గు వర్ణాలకంటే అన్యులుగా భావించారు వీరు. శ్రీరంగనాథుడుకూడా వీరిని చతుర్వర్ణాలకు చెందినవారికంటే అన్యులుగా, నిత్యసూరులవలె వైలక్షణ్యాన్ని కలవారుగా భావించాడు. మిగిలిన ఆழ்వార్లు "ప్రవాహంలో ఒక కాలు, బురదలో ఒక కాలు" **(ఆర్రిల్ ఒరు కాల్ శేర్రిల్ ఒరు కాల్)** అని పల్కిన రీతిలో పలు అర్చావతారాలనుగూర్చి పలికారు. తొణ్డరడి

ప్పొడియాళ్వార్లు శ్రీరంగనాథుని ఒక్కని మాత్రమే కీర్తించారు. కాని, వీరు, వారివలె కొందఱికి ఉపదేశించడం, అన్యమతాలను నిరసించడం తమ అనుభవానికి ఆటంకం కాగలదని తలచి, శ్రీరంగనాథునే పాదాలనుండి కిరీటపర్యంతం అందంగా అనుభవిస్తున్నారు.

(ఇపుడు తనియన్‌వ్యాఖ్యానంలో ప్రమాణంగా ప్రస్తావింపబడిన **"స్నేహో మే"** (శ్రీరామా-ఉత్తర-40-15) ఇత్యాదిశ్లోకం ఇక్కడ ప్రసంగాత్ వ్యాఖ్యానింప బడుతున్నది).

**(స్నేహో మే పరమః) "ఎన్టన్ అళవన్డ్రాల్ యానుడైయ అన్బు"** (ఇరణ్డామ్ తిరు- 100) (నా భక్తి నా పరిమితిలో ఉన్నది కాదు) అని పల్కిన పూదత్తాళ్వార్ల వలె తమ ప్రేమ తమను మించి పొంగి పొర్లే విషయాన్ని తెలుపుతున్నారు.

**(రాజన్! త్వయి)** – ఈ ప్రేమ నావల్ల కల్గినది కాదు. **"అతువుమ్ అవనతు ఇన్నరుళే"** (తిరువాయ్-8-8-3) (అదికూడా అతని కృపయే) అని పల్కినట్లే నీ అనుగ్రహంవల్ల లభించింది.

**(నిత్యం ప్రతిష్ఠితః)** – నీవు ఇపుడు పరమపదానికి పోవడానికి ఇష్టపడక పోయినా, ఇంకొక సమయంలో నిన్ను తీసికొని వెళ్ళగలను" – అని శ్రీరాముని అభిప్రాయంగా తలచి, నీ తిరుమేనినే ఉద్దేశించి (లక్ష్యంగా కల్గి) ఉండేది కనుక, నా మనస్సు పరమపదనాథుని తిరుమేనిలో అభినివేశాన్ని పొందదు. **"నిన్నలాల్ ఇలేన్ కాణ్"** (తిరువాయ్-2-3-7) (నీవు లేకపోతే నేను లేను) అని పల్కిన ఆళ్వార్లవలె (హనుమంతుడు) పల్కుతున్నాడు.

**(భక్తిశ్చ నియతా)** – "స్నేహం వేఱు, భక్తి వేఱుకదా" అని అంటే, శ్రీరాముని విశ్లేషించి బ్రతుకలేక ప్రాణాలను విడచిన దశరథచక్రవర్తిస్థితి స్నేహం. భక్తి అంటే– "నీవు అయోధ్యలోనే ఉండాలి" అని శ్రీరాముడు ఆజ్ఞాపించగా, **"కురుష్వ మామను చరం వైధర్మ్యం నేహ విద్యతే, కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే"** (రామా-అయో-31-24) (నన్ను నీ అనుచరునిగా చేసికో. ఇందులో నీ ధర్మానికి విరుద్ధమైనది ఏదీ లేదు. దీనివల్ల నేనుకూడా కృతార్థుడను కాగలను. నీ ప్రయోజనం కూడా సిద్ధించగలదు) అనే రీతిలో విశ్లేషించి ఉండలేనివాడై, తనకు, శ్రీరామునకు మధ్య ఉండే శేష-శేషిభావ సంబంధాన్ని తెలిసికొని, శ్రీరామునితోకూడ వనానికి పోయిన లక్ష్మణుని స్థితి.



**(వీర)** – తాను శ్రీరాముని వీర్యగుణానికే జితుడయ్యాడనే విషయాన్ని హనుమంతుడు ఈ సంబోధనద్వారా తెల్పుతున్నాడు. "నీ వీర్యగుణంతో శత్రువులను జయించడమే తప్ప భక్తిలో చలింపజేయడానికి సాధ్యం కాని వీరుడనైన నన్ను జయించడం నీకు వీలుకాదు" – అని అంటున్నాడు.

**(భావో నాన్యత్ర గచ్ఛతి)** – నన్ను జయించినా జయించవచ్చు. నా మనస్సును మాత్రం జయించడం వీలు కాదు. భగవంతుడు పిలుచుకొని పోవాలని తలచిన పరమపదం అనే దేశం యొక్క పేరును చెప్పడానికికూడా ఇష్టపడకుండా హనుమంతుడు **"అన్యత్ర"** అని అంటున్నాడు, **"మఱ్ఱారానుమ్ ఉణ్డెన్బార్"** (శిఱియ తిరుమడల్) అని పల్కిన తిరుమజ్గై మన్నన్‌వలె. ఈ విధంగా శ్రీరాముని తప్ప ఇంకొక విషయాన్ని తెలియని హనుమంతునివంటివారు, శ్రీరంగనాథుని తప్ప ఇంకొకరిని తెలియనివారు – అనే సంగతిని **"ఎన్ అముదినై కణ్డ కణ్‌గళ్ మఱ్ఱొన్ఱినైక్కాణావే"** అనే నిశ్చయంతో తెల్పుతున్నారు. **"మఱ్ఱొన్ఱు"** అనేది పరవ్యూహవిభవాలను తెలియనివారు ఈ ఆళ్వార్లు అనే సంగతిని తెల్పుతున్నది.

వీరికి, శ్రీవైకుంఠం, క్షీరాబ్ధి, అయోధ్య, ఉత్తర మధురవంటి అవతారస్థలాలు, అర్చావతారస్థలాలు – అనే అన్నీ శ్రీరంగనాథుడే అయినట్లే, ఆయా స్థలాలలో ఉండే అందం మొదలైన గుణాలు, లీలలు మొదలైనవి అన్నీ శ్రీరంగనాథునిలోనే (వీరు) దర్శించారు. పెరియపెరుమాళ్ (శ్రీరంగనాథుని) యొక్క అందం, ఐశ్వర్యం మొదలైనవి అన్నీ పరమపదంలో ముకుళించినవై (వికసించినవి కాకుండా) ఉంటాయి. అవి అవతారాలలో రెండు ఆకులు విరిసినవిగా ఉంటాయి. ఇక్కడ వచ్చిన తరువాతనే అవి కొమ్మలు, రెమ్మలుగా విస్తరించి ఉంటాయి. ఏవిధంగా? అంటే, **"పొఙ్గోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోరామే ఆళ్కిన్ఱ ఎమ్బెరుమాన్ శెఙ్గోలుడైయ తిరువరఙ్గచ్చెల్వనార్"** (నాచ్చియార్ తిరు-11-3) (పొంగే సముద్రంచే పరివేష్టితమైన భూమి, పరమపదం – అనే వీటిలో ఏదీ చెదఱిపోకుండా పాలించే స్వామి, ఆజ్ఞా దండాన్ని కల శ్రీరంగనాథుడు) అనే గొప్పతనాన్ని కలవాడు కనుక, పర-వ్యూహాదులలో అవి సంకోచాన్ని పొంది ఉంటాయి కదా!

పరం, వ్యూహం మొదలైనవి – తను ప్రేమించే నిత్యులు, ముక్తులు మొదలైన వారిని అనుభవింపజేసే ప్రదేశాలు. ఇది (శ్రీరంగం) ఆ రీతిలో కాకుండా తనట్ల

అభినివేశాన్ని లేనివారుకూడా దర్శించి అనుభవించేటట్లుగా ఉన్నందున సౌలభ్యగుణంవల్ల ఏర్పడిన వైలక్షణ్యాన్ని కల్గి ఉంటుంది. గుణాధిక్యంవల్లనే కదా ఏ వస్తువుకు అయినా గొప్పతనం కల్గుతుంది. కల్యాణగుణాలు గొప్పగా వెల్గడం శ్రీరంగనాథునిలోనే కదా. గుణాలలో అభినివేశాన్ని పొందినవారు శ్రీరంగనాథుని తప్ప ఇంకొకటిని తెలియరుకదా! **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చనేతి"** (తైత్తి–ఆనంద–9–1) (ఏ పరమాత్మనుండి మనస్సుతో కూడిన వాక్కులు ఆ పరమాత్మను పరిచ్ఛేదించలేక వెనుదిరుగుతున్నాయో, ఆ పరమాత్మ యొక్క ఆనందగుణాన్ని తెలిసివాడు ఎవనివల్ల భయపడదు) అనే రీతిలో వేదాలకు అందని సర్వేశ్వరుని, నదిలో ప్రవహించే జలంవలె, రెండు కావేరీనదీప్రవాహాల నడుమ సులభంగా దర్శించి ఆనందించే టట్లుగా ఉండే చోటుకదా, ఇది. **"మழைక్కు అన్రు వరై మునేన్దుమ్ మైన్దనే! మదుర వాఱే!"** (తిరుమాలై–36) (ఇంద్రుడు కురిపించిన శిలావర్షంనుండి రేపల్లెను కాపాడడంకోసం ఆనాడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తిన బలశాలీ! మధురమైన నది వంటివాడా!) అని మధురమైన నదిగా చెప్పబడే శ్రీకృష్ణునే శ్రీరంగనాథుడనే ఈ నదిగా ఈ తిరుప్పాణ్ ఆழ்వార్లు భావిస్తున్నారు. తమకు పొందదగిన ప్రాప్యమై ఉన్నవాడు, పొందించే దారి అయిన ప్రాపకమై ఉన్నవాడు, తనపట్ల రుచిని కల్గించే వాడు, విరోధిని పోగొట్టేవాడు – అన్నీ శ్రీరంగనాథుడే – అని భావిస్తున్నారు.

శ్రీరంగనాథుని అనుభవించేవారు (భోక్త) తామే అయినపుడు, అన్నీ శ్రీరంగనాథుడే అనడం ఏవిధంగా యుక్తం? అని అంటే, భగవానుని పొందడానికి మూలమైన ప్రథమసుకృతాన్ని తానే కల్గించేవాడై, ఆశ్రయించడానికి ఆ యా సమయాలలో ఆవశ్యకమైనవానిని అన్నింటిని చేయడానికి తగిన సౌహార్దగుణమనే గొప్ప స్నేహం ఆ స్వామివద్దనే ఉన్నందున, అతనిని పొందడానికి చేతనునివద్ద ఒక సాధనం ఉన్నది – అని చెప్పే అవకాశం ఏదీ లేదుకదా! ఏదయినా ఒకటి ఉంటే, అది భగవత్కృపకు కారణమై ఉండవచ్చు. అన్యవిషయాలతో సంబంధం లేకపోవడం, భగవానుడు చేతనుని కింకరునిగా స్వీకరించడానికి వచ్చేటపుడు దానిని అడ్డుపెట్టకుండా ఉండడం– అనేవి ఇతని (జీవుని) వద్ద ఉంటే, దానిని మాత్రమే కారణంగా చేసికొని శ్రీరంగనాథుడు తన స్వరూప–రూప–గుణ–విభూతులను దర్శింపచేస్తున్నాడు. వీరు వానిని దర్శించి ఆనందిస్తున్నారు. **"ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా, విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్"** (రామా–యుద్ధ–18–38) (వానరులలో గొప్పవాడనైన సుగ్రీవా! ఇతనిని పిలుచుకొని రా. ఇతడు విభీషణుడైనా సరే, తాను రావణుడే అయినా సరే. ఇతనికి నేను అభయం ఇస్తున్నాను) అని సుగ్రీవుని పురస్కరించుకొని విభీషణుని తన వద్దకు రప్పించినట్లే, **"తాழ்చ్చి మఱ్ఱెజ్గుమ్ తవిర్న్దు"** (తిరువాయ్–3–2–4) (దైన్యాన్ని ఇక అంతటా వదలిపెట్టి) అనే రీతిలో మిగిలిన విషయాలలో అభినివేశాన్ని లేనివారై, **"కడత్తలై ఇరున్దు వాழுమ్ శోమ్బర్"** (తిరువాయ్–3–2–4) (నీ వాకిటలో పడి ఉండే సోమరులు) అనే రీతిలో శ్రీరంగాలయ కైంకర్యంలోనే అభినివేశాన్ని కల్గిన లోకసారంగమహామునిని పిలచి, "నన్ను కీర్తించే తిరుప్పాణ్‌ను పిలుచుకొని రండి" అని నియమించగా, ఆ మునికూడా **"అరుళ్‌పాడు అరుళ్‌పాడు"** అని శ్రీరంగనాథుని ఆజ్ఞనుగూర్చి తిరుప్పాణ్ ఆழ்వార్లతో పలుకగా, వీరు (ఆழ்వార్లు) కూడా **"అడియన్ అడిప్పాణన్ అడిప్పాణన్"** గూర్చి అని తమ యోగ్యతారాహిత్యాన్ని, పల్కి అడ్డుపెట్టగా, లోకసారంగమునికూడా వీరిని విడువకుండా, నిర్బంధించి తమ భుజస్కంధాలపై వారిని వేంచేపు చేసికొనిపోయారు. తిరుప్పాణ్ వెళ్ళే దారిలో మొదటి తొమ్మిది పాశురాలను పాడుతూ పోయి, శ్రీరంగనాథుని గర్భగృహంలో దర్శించగానే పదవ పాశురాన్ని పాడి ఈ ప్రబంధాన్ని పూర్తి చేశారు.

**పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానంలోని**
**అవతారిక ఆంధ్రానువాదం సంపూర్ణం**



### తిరుప్పాణా*ళ్వా*ర్లు అనుగ్రహించిన

# అమలనాది పిరాన్

**1. అమలనాది పిరాన్ అడియార్క్కెన్నై ఆళ్‌పడుత్త**
**విమలన్, విణ్ణవర్‌కోన్ విరైయార్ పొ*ళి*ల్ వేఙ్గడవన్,**
**నిమలన్ నిన్‌మలన్ నీదివానవన్ నీణ్‌మదిళ్ అరఙ్గత్తమ్మాన్,**
**తిరుక్కమలపాదమ్ వన్దెన్ కణ్ణినుళ్లన ఒక్కిన్దదే.**

అమలన్ = పరిశుద్ధుడై, ఆది = లోకముల కన్నింటికిని కారణభూతుడై, పిరాన్ = నాకు ఉపకారకుడై, ఎన్నై = (లౌకిక వ్యాపారములందు మగ్నుడనైన) నన్ను, అడియార్‌క్కు = తన దాసులకు, ఆళ్ పడుత్త = దాసునిగా చేయుటచే కల్గిన, విమలన్ = గొప్ప కాంతిని కలవాడై, విణ్ణవర్‌కోన్ = నిత్యసూరులకును నాయకుడై యుండి (ఈలోకములోనున్నవారిని దాసులుగా చేసికొనుటకై), విరై ఆర్ = పరిమళము అతిశయించియున్న, పొ*ళి*ల్ = తోటలను కల్గిన, వేఙ్గడవన్= తిరుమలలోనికి వచ్చి, నిలచినవాడై, నిమలన్ = నేను కోఱకనే, నాకు ఉపకారమును చేయుటచే, అతిశయించిన తేజస్సును కలవాడై, నిన్మలన్ = తన దాసులకు నన్ను దాసునిగా చేయుటచేకల్గిన తేజస్సునుకలవాడై, నీదివానవన్ = "స్వామి–సొత్తు" అను క్రమము తప్పని పరమపదములో నున్నవాడై, నీణ్ = ఉన్నతములైన, మదిళ్ = ప్రాకారములను కల, అరఙ్గత్తు = శ్రీరంగమున శయనించియున్న, అమ్మాన్ = అందఱికిని నాయకుడై వెల్గువానియొక్క, తిరు = లక్ష్మీదేవియు సంకోచించుచు సంవాహనము చేయతగిన శోభను కల్గినదై, కమల = ఎఱ్ఱ తామరల వంటి, పాదమ్ = పాదములు, వన్దు = తామే వచ్చి, ఎన్ కణ్ణినుళ్లన = నా కన్నులకు లక్ష్యమై, ఒక్కిన్దదే = ప్రత్యక్షసమానాకారముగా నున్నవికదా! ఏ = ఆహా! ("ఒక్కిన్దవే" అని పాఠాంతరము కలదు.)

## పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానమ్

అవ : ముదల్పాట్టు : పెరియపెరుమాళ్ తిరువడికళిల్ అ*ళ*కు **మేల్ వి*ళు*న్దు** తమ్మై అడిమై కొణ్డదు - ఎన్గిఱార్.

వ్యా : (అమలన్) నిత్యసంసారియాయ్, త్తణ్ణియరాయిరుక్కిఱ తామ్ కిట్టుకై అత్తలైక్కు అవద్య మెన్డిరున్దార్. వన్దు కిట్టిన పిన్బు పెరియపెరుమాళుక్కు ప్పిఱన్ద వైలక్షణ్యత్తై క్కణ్డు "అమలన్" ఎన్దు కొణ్డాడుకిఱార్. అమలన్ ఎన్దతు- హేయప్రత్యనీకన్- ఎన్దపడి. అపహతపాప్మత్వాది గుణఙ్గళ్ ఆత్మావుక్కు ఉణ్డాయిరుక్క చ్చెయ్‌తేయుమ్ హేయసమ్బన్ధాహమాయ్, భగవత్ప్రసాదత్తాలే ఉణ్డాక వేణ్డియిరుక్కుమ్; ఇవన్ అఙ్గనన్ఱిక్కేయిరుక్కై.

(అమలన్) - శుద్ధ నెన్దపడి. ఇవన్ శుద్ధనాకైయావతు- తన్నై వరున్ది శుద్ధనాక్కుకైయన్దు; తన్నోడు సమ్బన్ధిత్తారైయుమ్ శుద్ధనాక్కవల్ల అడియుడైమై. "తుయరఱు శుడరడి"యిఱే. "పావన స్సర్వలోకానాం త్వమేవ రఘునన్దన !" ఎన్నుమాపోలే.

(అమలన్) ఎన్గిఱతు జన్మవృత్తాదికళాల్ కుఱైయ నిన్ద తమ్మై విషయీకరిత్త పిన్బు తన్‌పక్కల్ దోషమ్ తట్టాతే, "అనశ్నన్నన్యో అభిచాకశీతి" ఎన్గిఱపడియే విళఙ్గుకిఱపడి. "ఎన్ కణ్ పాశమ్ వైత్త పరఞ్జుడర్ శోతిక్కే".

(ఆతి) ఆదీయత ఇతి ఆదిః - స్పృహణీయన్- ఎన్దపడి. తమ్మై విషయీకరిక్కైక్కు అడియానాన్ - ఎన్దు "ఆది" ఎన్నవుమామ్; జగత్కారణత్వాదికళై చ్చొల్లవుమామ్. ఆక -ఇరణ్డు పదత్తాలుమ్- హేయ ప్రత్యనీకత్వముమ్, కల్యాణగుణయోగముమ్ శొల్లుకిఱతు.

(పిరాన్) ఇవ్వో నిలైకళై ఎనక్కఱివిత్త ఉపకారకన్.

(పిరాన్) ఉపకారత్తై చ్చొల్ల ప్ప*ఱ్ఱా*మే "ఎత్తిఱమ్!" ఎన్గిఱార్.

(అడియార్‌క్కు)- "రత్నహారీ చ పార్థివః" ఎన్గిఱపడియే ఇవ్వస్తువిన్ శీర్మైయాలే ఇతు నమ్మళవిల్ అడఙ్గాతు; నమ్మడియార్‌క్కామ్, ఇత్తనై- ఎన్దు అవర్‌కళుక్కాక్కినాన్ - ఎన్గిఱార్.

(అడియార్) తన్ పక్కలిలే నిక్షిప్తభరరాయిరుక్కుమవర్‌కళ్.

(ఎన్నై యాళ్‌పడుత్త విమలన్) తన్నిడైయాట్టము మఱియాత ఎన్నై త్తన్నడియార్‌క్కు శేషభూతనాక్కిన శుద్ధన్ - ఎన్గిఱార్.

(ఎన్నై) ప్రకృతిక్కు అడిమైశెయ్‌తు పోన్ద ఎన్నై; తన్ తిఱత్తిల్ శీర్మై యఱియాత ఎన్నై.

(ఎన్నై) దేహాత్మాభిమానికళ్ తీణ్డాత ఎన్నై. నన్మైక్కు త్తనక్కవ్వరు కిల్లాతాప్పోలే తీమైక్కు ఎనక్కు అవ్వరుకిల్లాత ఎన్నై.

(ఆళ్పడుత్త) అవర్కళోడే ఒప్పూణుణ్ణవైత్తిలన్. అవర్కళుక్కు శేషమాక్కినాన్. భగవచ్ఛేషత్వతళవిలే నిన్ఱాల్ మీళ శక్తియుణ్డు, భాగవత శేషత్వత్తళవుమ్ శెన్ఱాల్ మీళప్పోకాతే; ఉకప్పాలే వరుమతాకైయాలే.

ఒరు క్షేత్రమ్ పత్తెట్టు క్రయమ్ శెన్ఱాల్ మీళ విరకిల్లై. శ్రీవిభీషణాఴ్వానుక్కు ముతలికళుడైయ విషయీకారమ్ పెరుమాళుడైయ విషయీ కారత్తుక్కు ముఱ్పట్టాప్పోలే, ఇవర్క్కుమ్ తదీయవిషయీకారమ్ ముఱ్పట్టపడి. "దదృశుః", "అనయైనం హరిశ్రేష్ఠ" అఙ్గు, ఇఙ్గు లోకసారఙ్గ మహామునికళై ప్పోయ్ ఆఴ్వారై యఴైత్తుక్కొణ్డువారుమ్ - ఎన్ఱాన్.

(అడియార్క్కెన్నై ఆట్పడుత్త) -తాన్ శేషిత్వత్తినుడైయ ఎల్లైయిలే నిన్ఱాప్పోలే శేషత్వత్తినెల్లైయిలే ఎన్నై వైత్తాన్.

(విమలన్) ఎన్ శిఱుమై పారాతే తదీయర్క్కు శేషమాక్కుకైయాల్ వన్ద ఔజ్జ్వల్యమ్. ఎతిరికళ్ తరమ్ పారాతే శీరియర్ తన్దారళవిలేయిఱే కొడుప్పతు.

(విణ్ణవర్కోన్) - ఆళిల్లాతవనల్లన్ కిడీర్ ఇప్పడి విషయీకరిత్తాన్. నిత్యసూరికళ్ ఎడుత్తు క్కైనీట్టుమ్బడి యిరుక్కిఱవన్ కిడీర్, కతిర్ పొఱుక్కి జీవిప్పారైప్పోలే నిత్యసంసారియాయిరుక్కిఱ ఎన్నై నిత్యముక్త రోడొక్క విషయీకరిత్తాన్. ఇవ్వౌదార్యమ్ కఱ్ఱదుమ్ అవర్కళోడే కిడీర్- ఎన్ఱుమామ్. "అస్మాభి స్తుల్యో భవతు" ఎన్ఱార్కళిఱే.

(విణ్ణవర్కోన్) ఇఙ్గుత్తై క్కుఴాత్తైయొఴియ అఙ్గుత్తై క్కుఴాత్తైయుమ్ కాట్టి త్తన్దాన్. "ఉడన్ కూడువతెన్ఱుకొలో!" ఎన్ఱు ఆశైప్పడవేణ్డువతిల్లై.

(కోన్) అవర్కళాలుమ్ ఎల్లై కాణవొణ్ణాతు.

(విరైయార్ పొఴిల్ వేఙ్గడవన్) - పరిమళమ్ నిఱైన్దిరున్దుళ్ళ శోలైయై యుడైయ తిరువేఙ్గడమలైయై యుడైయవన్. పెరియపెరుమాళై ప్పాడానిఱ్క త్తిరుమలైయిలే పోవానెన్? ఎన్నిల్; ఒరువనైక్క విప్పాడుమ్బోతు అవనుడైయ వరత్తు చ్చొల్లియిఱే కవి పాడువతు.



"పరమపదత్తిల్ నిన్ఱుమ్ శ్రీమధురైయిలే తఙ్గి త్తిరువాయ్ప్పాడిక్కు వన్దాప్పోలే, శ్రీవైకుణ్ఠత్తి నిన్ఱుమ్ తిరుమలైయిలే తఙ్గిక్కాణుమ్ కోయిలుక్కు వన్దతు" ఎన్ఱు భట్టర్ అరుళిచ్చెయ్యుమ్బడి. అన్ఱియే, కోయిలిల్ భోగ్యత్తై తమక్కు నిల మల్లామైయాలే తిరుమలైయిలే పోయ్ ధరిక్క ప్పార్క్కిఱార్ - ఎన్ఱుమామ్.

(విరైయార్) నిత్యసూరికళై యుడైయనావతుక్కు మేలే ఓరైశ్వర్యమ్.

(విణ్ణవర్కోన్ విరైయార్ పొఴిల్ వేఙ్గడవన్) - ఆఱ్ఱిలే యఴున్దువార్ ఆఴఙ్గాలిలే ఇళైప్పాఱ త్తేడుమాప్పోలే అవర్కళుమ్ వన్దు అడిమై శెయ్యుమిడమ్.

(వేఙ్గడవన్) అర్చావతారత్తుక్కు ప్పాఱ్కాల్ పొలియవిట్ట విడమ్.

(నిమలన్)- ఇత్తలైయిల్ అర్థిత్వముమ్ కూడ ఇన్ఱిక్కేయిరుక్క ఇప్పడి ఉపకరిక్కైయాల్ వన్ద ఔజ్వల్యమ్. ఇవనుమ్ ఓరడి యిడ ప్పార్త్తిరా తొఴికైఅచిద్వ్యావృత్తియాలే. ఓరడియిట్టారుణ్డాకిల్, "పద్భ్యా మభిగమాచ్చైవ స్నేహసన్దర్శనేన చ".

(నిన్మలన్) ఇత్తలైక్కు ఉపకరిత్తానాయిరుక్కై యన్ఱిక్కే తన్ పేఱాయిరుక్కై "అమలన్" ఎన్ఱు - తనక్కాక్కినపడి, "విమలన్" ఎన్ఱు- తన్నడియార్క్కు ఆక్కినపడి; "నిమలన్" ఎన్ఱు- నాన్ పచ్చై యిడాతిరుక్క ఎన్ కార్యమ్ శెయ్తాన్- ఎన్గిఱార్. "నిన్మలన్' ఎన్ఱు- ఇతు తన్ పేఱాక చ్చెయ్తాన్ - ఎన్గిఱార్. "కృతకృత్య స్తదా రామః" ఎన్గిఱపడియే.

(నీతివానవన్) - శేషశేషిత్వఙ్గళ్ ముఱైమాఱాత నిత్యవిభూతియిలే యుళ్ళవన్. "ఈశ్వరోఽహమ్" ఎన్ఱు ఎతిరిట్టిరుక్కుమిడమిఱే యివ్విడమ్. అఙ్గు క్కలక్కువారు మిల్లై; కలఙ్గువారు మిల్లై. ఇఙ్గు క్కలక్కు వారు ముణ్డు; కలఙ్గువారు ముణ్డు,

(నీణ్మతిళరఙ్గత్తమ్మాన్) "నీతివానవన్" ఎన్నా, నీణ్మతిళరఙ్గత్త మ్మాన్ - ఎన్గిఱార్; "అళప్పరియ వారముతై యరఙ్గమేయ వన్దణనై" ఎన్నుమాప్పోలే.

(నీణ్ మదిళ్) రక్షకత్వత్తుక్కు ప్పోరుమ్బడియాన మదిళైయుడైయ పెరియకోయిలిలే కణ్వళర్న్దరుళుకిఱ పరమశేషి.

(అమ్మాన్) ఈరరశు తవిర్త్తాలితే శేషిత్వమ్ పూర్ణమావతు. తిరుమలైయిల్ భోగ్యతై నిలైనిల్లామైయాలే మీళవుమ్ కోయిలిలే పుకుకిఱార్, వెళ్ళత్తై క్కళ్ళమడైయాలే పళ్ళత్తే విడుమాప్పోలే. తిరువేఙ్గడ ముడైయాన్ వడక్కు త్తిరువాశలాలే వన్దు పుకున్దానత్తనై -ఎన్నుమామ్.

(తిరుక్కమల పాదమ్)- శెవ్వియుమ్, కుళిర్త్తియుమ్, వికాసముమ్, పరిమళముమ్ తొడక్కమానవై. ఆదిత్యనై క్కణ్డాలితే తామరై యలరువతు, ఇత్తామరైక్కు ఆదిత్యన్ ఇవర్. పిరాట్టి తిరుములైత్తడఙ్గళిలుమ్, తిరుక్కణ్గళిలుమ్ ఒన్ఱిక్కొళ్ళుమ్ తిరువడికళ్. ఇవరుడైయ "తళిర్పురైయుమ్ తిరువడికళ్" ఇరుక్కిఱ పడి.

(అమ్మాన్ తిరుక్కమలపాదమ్) తొడర్న్దు వరుకైక్కుప్రాప్తి.

(వన్దు) ద్వీపాన్తరత్తిల్ శరక్కు చ్చేరవేణ్డినార్ పాతిప్పాతి వఴియా కిలుమ్ వరుతల్, ఒరుతలై ప్పఱ్ఱుతల్ శెయ్యవేణుమితే; అఙ్గనన్ఱియే, "వన్దు నతడియేన్ మనమ్ పుకున్దాయ్" ఎన్గిఱపడియే - పఴి వన్దానుమ్ తానే, పఱ్ఱి నానుమ్ తానే - ఎన్గిఱతు.

(ఎన్ కణ్ణినుళ్ళన) (నీతివానవవన్ కమలపాతమ్ - ఎన్ కణ్ణినుళ్ళన) సదా దర్శనమ్ పణ్ణుకిఱవర్కళ్ కణ్ణుక్కిలక్కానతుకిడీర్, ఎన్ కణ్ణుక్కిల క్కాకిఱతు.

వల్లతనై నాళుమ్ విరోధమ్ పణ్ణినేన్. పోక్కఱ్ఱవాతే కణ్ణై చ్చెమ్బుళి త్తేన్. తొడర్న్దు శెమ్బుళిత్త కణ్ణై యిఱుత్తు ఉళ్ళే పుకున్దు నిఱ్కైయాలే "ఎన్ కణ్ణినుళ్ళన" ఎన్గిఱార్. అన్ఱియే తమ్ కణ్ణాల్ పార్క్కై అవశ్యమెన్ఱు కణ్ణై చ్చెమ్బుళిత్తార్. కణ్ణినుళ్ళే ప్రకాశిక్క త్తొడఙ్గిఱ్ఱు.

(ఒక్కిన్ఱ) - ప్రయోజనమ్ ఇరణ్డు తలైక్కు మొత్తిరానిన్ఱతు; అఙ్గుత్తైక్కు శీలసిద్ధి; ఇఙ్గుత్తైక్కు స్వరూపసిద్ధి.

(ఒక్కిన్ఱవే) ప్రత్యక్షసమానాకారమాయిరున్దదు - ఎన్నుతల్; ఎన్ కణ్ణుక్కిలక్కాన విడత్తిలుమ్ పలైయనిలై కొలైయాతిరున్దతు - ఎన్నుతల్, సంసారికళై ప్పార్త్తు ఉఙ్గళుక్కు మొక్కుమో? ఎన్గిఱారాతల్; ఇన్ద లాభమ్ అత్తలైక్కుమొక్కుమో? ఎన్గిఱారాతిల్.



అమలన్ - ఉయర్వఱ వుయర్నల ముడైయవన్; అతి - యవన్; పిరాన్- మయర్వఱ మతినలమరుళినవన్, అడియార్క్కు- పయిలుమ్ శుడరొళి; విణ్ణవర్కోన్ - అయర్వఱు మమర్కళతిపతి; వన్దు - అవర్ తొఴుతెఴు - ఎన్ఱార్; ఇవర్క్కు అవైతానే వన్దునిన్ఱన.

## అరుమ్బుదమ్

*ముదఱ్పాట్టు : అమలత్వమ్ ముక్తర్క్కుమ్ ఉణ్డో? ఎన్న, అరుళిచ్చెయ్ కిఱార్.(అపహతపాప్మేత్యాది)శుద్ధ నెన్ఱు అర్థాంతరమ్. మున్దిన అర్థత్తిలే అరుళిచ్చెయ్కిఱార్ (జన్మవృత్తాదికళిత్యాది).*

*(ఆదీయతే) ఆదానమే పణ్ణప్పడుకై. స్వీకరిక్కప్పడుకిఱాన్- ఎన్ఱపడి. "పిరాన్" ఎన్ఱదు కీఴై ప్పఱ్ఱవాదల్, మేలై ప్పఱ్ఱవాదల్. (ఎన్నై) తన్ సద్భావమఱియాద ఎన్నై- ఎన్నుదల్; తన్ కల్యాణ గుణమఱియాద ఎన్నై- ఎన్నుదల్. "ఆట్పడుత్త" ఎన్ఱత్తాల్ ఆధిక్యమేదు? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (భగవచ్ఛేషత్వమిత్యాది)*

*"విణ్ణవర్కోన్" ఎన్నైయాలే శేషిత్వత్తిల్ ఎల్లై-ఎన్నై. ఆఴ్గాల్- వ్యంగ్యమ్. శీలగుణమికుదియాలే ఆఴ్గాల్- ఎన్గిఱదు. ఇవనుడైయ అద్వేషాదికళుమ్ పొఱుక్కమాట్టాన్ - ఎన్నుమత్తై అరుళికిఱార్ (పద్భ్య మిత్యాది).*

*కలక్కుకిఱదు - ప్రకృతి. కలఙ్గుకిఱాన్ - ప్రత్యగాత్మా. (తిరు)- పూజ్యవాచి యాదల్, పిరాట్టియాదల్. విణ్ణవర్కోన్- ఎన్ఱు ద్వీపాంతరవస్తు. కణ్ణుక్కు విషయమెన్నామల్, ఉళ్ళన ఎన్బానేన్? ఎన్న, అరుళిచ్చెయ్ కిఱార్. (వల్లదనై నాళుమిత్యాది). "ఒక్కిన్ఱ" ఎన్నైయాలే - నిలై కులైయా దిరుక్కై.*

## ఆంధ్రానువాదం

**అవతారిక :–** శ్రీరంగనాథుని శ్రీచరణంలోని అందం తమను వశం చేసికొని, తమను సేవకునిగా చేసికొన్నది – అని ఇందులో అంటున్నారు.

**వ్యాఖ్యానమ్ :– (అమలన్)** – అనాదికాలంగా సంసారంలో పరిభ్రమిస్తున్న వారై, చాలా నీచకులానికి చెందినవారై ఉండే తాము శ్రీరంగనాథునివద్దకు పోవడం ఆ స్వామికి కొఱతను కల్గిస్తుంది – అని తిరుప్పాణ్ పెరుమాళ్ భావించారు శ్రీరంగనాథుని వద్దకు వచ్చి చేరిన తరువాత తమను చూడగానే అతనికి కల్గిన ముఖవికాసాన్ని చూచి, **“అమలన్”** అని అంటూ కీర్తిస్తున్నారు. **“అమలన్”** అంటే– దోషాలకు (హేయాలకు) ప్రతిభటుడు– అని అర్థం. అంటే – తాను హేయగుణాలను కల్గి ఉండకపోవడమే కాదు; ఇతరుల హేయగుణాలను (దోషాలను) కూడా పోగొట్టగల్గినవాడు – అని భావం. **“అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః”** (ఛాందోగ్య–8–1–5) (పాప రహితుడు, వార్ధక్యం లేనివాడు, మరణం లేనివాడు, దుఃఖం లేనివాడు, ఆకలి లేనివాడు, దాహం లేనివాడు, కల్యాణగుణాలను అన్నిటిని కలవాడు, అడ్డు లేని సంకల్పాన్ని కలవాడు) అనే గుణాలు పరమాత్మకు ఉన్నట్లే, జీవాత్మకుకూడా ఉన్నా, జీవునకు ప్రాకృతమైనశరీరరంతో సంబంధం ఉన్నందు వల్ల ఆ గుణాలు వ్యక్తం కాకుండా ఉంటాయి. ముక్తిదశలోనే భగవానుని అనుగ్రహంవల్ల అవి కలుగవలసి ఉంటుంది. పరమాత్మ అయితే, ఆ రీతిలో కాకుండా సహజంగానే ఆ గుణాలను నిత్యం కల్గి ఉంటాడు – అని దీనిద్వారా తెలుపుతున్నారు.

**(అమలన్)** జన్మ, వృత్తం – మొదలైనవాటిలో చాలా తక్కువగా ఉండే తమను పరిగ్రహించిన తరువాతకూడా తనవద్ద ఏవిధమైన కొఱత లేకుండా ఉన్నవాడు– అని భావం. **“ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్ అన్యో అభిచాకశీతి”** (ముండక–3–1–1) (జ్ఞానమనే అందమైన రెక్కలను కల్గినవి, సమానమైన గుణాలను కల్గినవి, ఎల్లప్పుడు కలసి ఉండేవి అయిన రెండు పక్షులు (జీవుడు, ఈశ్వరుడు) ఒకే వృక్షాన్ని (దేహాన్ని) ఆశ్రయించి ఉన్నవి. వాటిలో ఒకటి (జీవుడు) పండిన పండును (పక్వమైన కర్మఫలాన్ని) భుజిస్తున్నది. ఇంకొకటి (పరమాత్మ) ఆ పండును తినకుండా ప్రకాశిస్తున్నది) అనే రీతిలో తాను ప్రకాశిస్తూ ఉంటాడు. **“నీశనేన్ నిఱై ఒన్టుమిలేన్, ఎన్కణ్ పాశమ్ వైత్త పరమ్ శుడర్చ్చోదిక్కే”** (తిరువాయ్–3–3–4) (నీచుడను, ఏ గుణాన్ని లేనివాడను అయిన నాపట్ల వాత్సల్యాన్ని కల పరంజ్యోతికి) అని నమ్మాళ్వార్లుకూడా (పరమాత్మ ప్రకాశిస్తూ ఉంటాడని) అనుగ్రహించారు కదా!



**(ఆది)** **“ఆదీయతే ఇది ఆదిః”**(అందఱిచే పరిగ్రహింపబడేవాడు. కనుక **“ఆదిః”** అనబడుతున్నాడు) అనే రీతిలో అందరిచే పరిగ్రహింపదగినవాడు. **“ఆది”**– అనేది ఆదిశబ్దవ్యుత్పత్తి. అందఱిచే ఆశపడదగినవాడు–అని దీని భావం. లేక, **“ఆది”** అనే పదం **“మొదలు”** అనే అర్థాన్ని ఇస్తుంది కనుక, మనలను దాసునిగా చేసికోవడానికి మొదటి కారణమై ఉన్నాడు – అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **“ఆది”**– అంటే లోకానికి కారణమై ఉండేవాడు – అనికూడా గ్రహించవచ్చు. ఈవిధంగా **“అమలన్”, “ఆది”** అనే రెండు పదాలద్వారా క్రమంగా హేయగుణాలకు ప్రతిభటంగా ఉండేవాడు అని, కల్యాణగుణాలను అన్నిటిని కలవాడు – అని చెప్పబడింది.

**(పిరాన్)** – తనను ఆశ్రయించి ఉండే ఈ గొప్పతనాలను అన్నిటినీ నాకు తెలియజేసిన ఉపకారకుడు – అని భావం.

**(పిరాన్)** – ఇతః పూర్వమే చేసిన ఉపకారాలు మాత్రమే కాకుండా ఇంకా పలు ఉపకారాలను చేయబోతున్నాడు – అని ఆశ్చర్యపడుతున్నారు.

**(అడియార్క్కు)** – **“గవాం శతసహస్రేణ దీయతాం శబలా మమ, రత్నం హి భగవన్! ఏతత్ రత్నహారీ చ పార్థివః”** (రామా–బాల–53–9) (నూఱు వేల గోవులను పొంది నీవు ఈ కామధేనువు కుమార్తె శబలను నాకు ఇవ్వాలి. భగవన్! ఇది రత్నం (చాలా గొప్పది) కదా! రత్నాలను గ్రహించేవాడు రాజు కదా) అనే రీతిలో ఆత్మస్వరూపంయొక్క గొప్పతనాన్ని చూచి, దీని నేనుమాత్రం ధరిస్తే చాలదు; మన దాసులకు కూడా ఇవ్వాలి – అని నన్ను తన దాసులకు సేవకునిగా చేశాడు.

**(అడియార్)** – తమను రక్షించే బాధ్యతను భగవానుడైన అతనివద్ద సమర్పించిన వారు (భగవద్భక్తులు).

**(ఎన్నై ఆట్పడుత్త విమలన్)** – తననుగూర్చి ఏమీ తెలియని నన్ను తన దాసులకు దాసునిగా చేసిన పరిశుద్ధుడు – అని అంటున్నారు.

**(ఎన్నై)** – ప్రకృతివికారమైన దేహానికి సేవ చేస్తూ ఉండే నన్ను – అని భావం. లేక, భగవానుని దాసుల గొప్పతనాన్ని తెలిసేటట్లు చేసిన నన్ను అని కూడా భావం.

**(ఎన్నై)** – "దేహమే ఆత్మ" అని భావించినవారుకూడా తాకని నన్ను – అని భావం. "మంచిని చేసినవారిలో తనకంటే మించినవారు ఇంకొకరు లేనట్లుగా, చెడ్డను చేసిన వారిలో నాకంటే మించినవారు ఇంకొకరు లేని నన్ను" – అని భావం.

**(ఆట్పడుత్త)** – వారి వరుసలో ఒకనిగా నన్ను నిలిపి అనుభవింపజేయలేదు. వారికి నన్ను దాసునిగా చేశాడు. భగవానునకు దాసుడైన అవధిలో ఉంటే తిరిగి సంసారి కావడానికి కొరత అవకాశం ఉన్నది. అతని దాసునివరకు నా దాస్యాన్ని పర్యవసింపజేస్తే, తిరిగి సంసారి కావడానికి అవకాశం లేనే లేదు. భగవానుని ఎక్కువగా అభిమానించినవారికే అతని దాసులవరకు దాసుడు కావడానికి సాధ్యమవుతుంది. ఒక ప్రదేశం ఒకనికి అమ్మబడితే, ఆ అమ్మకం చెల్లదు – అని అడ్డగించే అవకాశం ఉన్నది. ఆ స్థలమే పలువురి చేతులు మాఱి, పలుమార్లు అమ్మబడితే, ఆ విధంగా అడ్డుపెట్టడం ఎవరికీ వీలు కాదుకదా!

విభీషణుడు శ్రీరాముని పొందడంకోసం ఆకాశమార్గంద్వారా బయలుదేరి వచ్చేటపుడు వానరవీరుల దృష్టియే మొదట అతనిపై పడింది. అదే రీతిలో వీరికి (తిరుప్పాణ్ ఆళ్వార్లకు) కూడా భగవానుని దాసులైన లోకసారంగముని కటాక్షమే మొదట పడింది. **"తం మేరుశిఖరాకారం దీప్తా మివ శతహ్రదామ్, గగనస్థం మహీస్థా స్తే దదృశు ర్వానరాధిపాః"** (రామాయణమ్–యుద్ధ–17–2) (మేరు శిఖరం వంటి మేనిని కలవాడై, ఆకాశంలో ఉండే ఆ విభీషణుని భూమిలో ఉండే వానర వీరులు ప్రకాశించే మెఱపునువలె చూచారు) అనే శ్లోకం విభీషణునిపై వానర వీరులు దృష్టి పడింది – అనే దానికి ప్రమాణం. **"ఆనయైనం హరిశ్రేష్ఠ దత్తమస్యాభయం మయా, విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్"** (రామా–యుద్ధ–18– 34) (వానరులలో గొప్పవాడవైన సుగ్రీవా! ఇతనిని పిలుచు కొని రా. ఇతడు విభీషణుడైనా, లేక, రావణుడే అయినా, ఇతనికి నేను అభయం ఇస్తున్నాను) అని అక్కడ సుగ్రీవుని పురస్కరించుకొనే విభీషణుని తీసికొని రమ్మని చెప్పినట్లే, ఇక్కడకూడా లోకసారంగ మునిని పంపించి, వీరిని తీసికొని రమ్మని పలికాడు, శ్రీరంగనాథుడు.



**(అడియార్క్కు ఎన్నై ఆట్పడుత్త)** – తాను ప్రభువులకు ప్రభువై (శేషిభూతులకు శేషియై) – శేషిత్వానికి పరమావధిలో ఉన్నట్లే, నన్ను దాసులకు అందఱికి దాసుడనై, దాస్యంయొక్క పరమావధిలో ఉండేటట్లు చేశాడు.

**(విమలన్)** – పూర్వం ఉండే స్థితి కంటే మిక్కిలిగా ప్రకాశిస్తున్నవాడు. నా నైచ్యాన్ని చూడకుండా, తన దాసులకు దాసునిగా చేసినందువల్ల పూర్వంకంటే ఎక్కువగా ప్రకాశిస్తున్నవాడు అయ్యాడు – అని భావం. గొప్ప ఉదారులు తమవద్ద దానాన్ని పొందేవారి తక్కువదనాన్ని గమనించకుండా, తమ గొప్పతనానికి తగినట్లుగాకదా ఇస్తారు. ఆ రీతిలోనే నాకుకూడా దాసులకు దాసుడను అయే గొప్ప ఉజ్జీవనాన్ని (స్వామి) ప్రసాదించాడు.

**(విణ్ణవర్కోన్)** – నన్ను ఈ విధంగా తన దాసునిగా చేసికొనడానికి తనకు ఏ సేవకులు లేకపోవడం కారణం కాదు. నిత్యసూరుల గోష్ఠిని కలవాడుకదా ఈ విధంగా నన్ను అనుగ్రహించాడు. చాలా గొప్పవారైన నిత్యసూరులు కైంకర్యం చేసేటట్లుగా ఉన్నవాడుకదా! క్షేత్రంలో చెదఱి పడిఉండే ధాన్యపు గింజలను ఏరుకొని తిని జీవించేవారివలె, అనాదికాలంగా సంసారిగా పడి ఉండే నన్ను, వారిలో (నిత్యసూరు లలో) ఒకడను అయేటట్లుగా నన్ను అనుగ్రహించాడు. నిత్యసంసారులై ఉండే జీవులను తమతో ఒకనిగా అంగీకరించే వారివద్దనే ఈ (నిత్యసూరుల వద్దనే) ఔదార్యగుణాన్ని అభ్యసించాడు – అనే అర్థాన్ని కూడా ఇక్కడ గ్రహించవచ్చు. **"తస్మాత్ క్షిప్రం సహాస్మాభిః తుల్యో భవతు రాఘవ!, విభీషణో మహాప్రాజ్ఞః సఖిత్వం చాప్యుపైతు నః".** (రామా–యుద్ధ–18–38) (రాఘవా! అందువల్ల మహాబుద్ధి మంతుడైన విభీషణుడు మిక్కిలి శీఘ్రంగా మనలో ఒకడుగా కానీ. మనతో స్నేహాన్ని కూడా పొందనీ) అని వానరవీరులు ఈ రీతిలోనే విభీషణుని తమలో ఒకనిగా అంగీకరించారుకదా!

**(విణ్ణవర్కోన్)**–భూలోకవైకుంఠమైన శ్రీరంగంలో ఉండే భక్తులకు (నీ దాసులకు) నన్ను దాసునిగా చేయడం మాత్రమేకాక, పరమపదంలో ఉండే నిత్యముక్తులనుకూడా నాకు దర్శింపజేసి, వారికి నన్ను దాసునిగా చేశాడుకదా! **"మాయప్పిరాన్ అడియార్కళ్ కుళ్జాంగళైయే ఉడన్ కూడువదు ఎన్రుకొలో!"** (తిరువాయ్–2–3–10) (ఆశ్చర్యగుణ చేష్టితుడైన స్వామియొక్క భక్తబృందాలతో

కలిసి ఉండడం ఏనాడో కదా!) అని పల్కిన నమ్మాళ్వార్లవలె వీరు ఆశపడడం లేదు.

**(కోన్)** – తన అవధిని దర్శించడానికి వారికి (నిత్యసూరులు) వీలు కాని రీతిలో వారికి మించిన నాయకుడై ఉండేవాడు.

**(విరైయార్ పొళ్ళిల్ వేఙ్గడవన్)** – సువాసన అతిశయించి ఉండే తోటలను కల తిరువేంకటాద్రిని కలవాడు. (ఈ ప్రబంధంలో) పెరియపెరుమాళ్‌ను కీర్తిస్తూ ఉండేటపుడు ఈ ఆళ్వార్లు తిరుమలలో అభినివేశాన్ని పొందుతున్నారే! ఏమి? – అని అంటే, ఒకని గొప్పతనాన్ని కీర్తిస్తూ కవితను పలికేటపుడు, అతడు ఎక్కడ నుండి వచ్చాడో ఆ విషయాన్నిగూర్చి పల్కికదా కవితను చెప్పాలి. భగవానుని విభవావ తారమైన శ్రీకృష్ణావతారాన్నిగూర్చి పలికేటపుడు, పరమపదంనుండి వచ్చి, మధురలో ఉండి, తరువాత రేపల్లెకు వచ్చాడు – అని పల్కినట్లే, అర్చావతారాన్నిగూర్చి పలికే టపుడు, శ్రీవైకుంఠంనుండి వచ్చి, తిరుమలలో కొంతసేపు నిలచి ఉండి, ఆ పిమ్మటనే శ్రీరంగం దివ్యాలయం లోకి వచ్చాడు – అని పరాశరభట్టర్ పలికేవారు. ఆ విధంగా కాకుండా, శ్రీరంగ నాథుని భోగ్యత తమకు అనుభవించడానికి సాధ్యం కానందున మధ్యలో తిరుమలనుగూర్చి పల్కి, ధరించడానికి (తట్టుకోవడానికి) ఆళ్వార్లు ప్రయత్నిస్తున్నారు – అనికూడా చెప్పవచ్చు.

**(విరైయార్) – “విణ్ణవర్‌కోన్”** అని అంటూ నిత్యవిభూతిని కలవాడు – అని పల్కినందులకు తగినట్లుగా, తరువాత **“విరైయార్ పొళ్ళిల్ వేఙ్కడవన్”** (పరిమళంతో నిండిన తోటలను కల వేంకటాద్రికి స్వామి) అని అంటూ లీలావిభూతిని ఐశ్వర్యంగా కలవాడని అంటున్నారు.

**(విణ్ణవర్‌కోన్ విరైయార్ పొళ్ళిల్ వేఙ్గడవన్)** – నిత్యసూరులు పరమపద నాథునిపట్ల అభినివేశాన్ని పొంది, అతని గుణాల అవధిని చూడలేక, శ్రీవేంకటాద్రికి వచ్చి, ఇతని పరత్వం, సౌలభ్యగుణాలు చాలా అవధిని దర్శించడానికి వీలు కాకుండా గొప్పగా ఉండడాన్ని గమనించి, ఇతనికి దాస్యాన్ని చేస్తున్నారని భావం **(“ఆగ్రిలే అళున్దు కాల్ ఆళాఙ్గాలిలే అళైప్పాఱ తేడుమాపోలే”** అనే పెరియ వాచ్చాన్‌పిళ్ళై శ్రీసూక్తికి – నదిలో మునిగిపోయేవారు, ఆ నదిలో లోతుగా ఉండే చోటికి పోయి క్లేశాన్ని తీర్చుకోవడానికి అన్వేషిస్తున్నట్లు – అని అర్థం. అంటే–



శ్రీరంగనాథుని భోగ్యత అనే నదిలో మునిగిపోయే ఆళ్వార్లు, దానినుండి తప్పి జీవించాలని తలచి, భోగ్యతలో అంతకంటే లోతైన చోటు అయిన వేంకటాద్రికి పోయి అక్కడ క్లేశాన్ని తీర్చుకోవాలని చూస్తున్నారే!– అనే హార్దభావం దీనివల్ల స్ఫురిస్తున్నది).

**(వేఙ్గడవన్)** – అర్చావతారానికి అంతటికీ మూలస్థానంవలె ఉండే చోటు.

**(నిమలన్)** – నేను కోరకుండా ఉన్నా, ఈ విధంగా నాకు ఉపకారం చేసినందువల్ల అతనికి కల్గిన ప్రకాశం దీనిద్వారా తెలుపబడుతున్నది. “ఇతడు నావైపు ఒక అడుగు ముందుకు పెట్టి రానీ. ఆ తరువాత ఇతనిని దాసునిగా గ్రహిస్తాను” – అని భావించకుండా, తానే స్వయంగా నన్ను దాసునిగా పరిగ్రహించాడు. జ్ఞానం లేని అచేతనంకంటే తమకు ఉండే వైలక్షణ్యాన్ని చూపడం కోసం ఇతనివైపు ఒక అడుగు ముందుకు వేసినవారు ఉన్నా, **“అర్చితా శ్చైవ హృష్టాశ్చ భవతా సర్వథా వయమ్, పద్భ్యా మభిగమాచ్చైవ స్నేహసందర్శనేన చ”** (రామా–అయో–50–41) (కాలినడకతో వచ్చినందువల్ల, ప్రేమను చూపినందు వల్ల నీచేత మేము అన్నివిధాలుగా పూజింపబడ్డాము. ఆనందించాముకూడా) అనే విధంగా దానిని చాలా అధికంగా, గొప్పదిగా భావించేవాడు.

**(నిన్మలన్)** – నన్ను దాసునిగా స్వీకరించడంకూడా నాకు సహాయం చేసినట్లు భావించకుండా, తాను పొందవలసిన ప్రాప్యాన్ని పొందినట్లుగా భావించే గొప్ప భావశుద్ధిని కలవాడు – అని భావం. **“అమలన్”** అని భగవానుడు తమను తనకు దాసునిగా చేసికొన్న రీతిని తెలిపారు. **“విమలన్”** అని అంటూ తన దాసులకు దాసునిగా చేసిన రీతిని తెలిపారు **“విమలన్”** అని నానుండి దేనినీ ఎదురు చూడకుండా నా కార్యాన్ని పూర్తిచేశాడనే విషయాన్ని తెలిపారు. **“నిన్మలన్”** అని అనడంద్వారా దీనినికూడా స్వప్రయోజనంగా భావించి చేశాడని తెలిపారు. **“అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ”** (రామా–బాల–1–85) (లంకలో రాక్షసరాజుగా విభీషణుని అభిషేకించిన తరువాత, తన కార్యాన్ని చేసి ముగించిన శ్రీరాముడు మనస్సులో తాపాన్ని తీరినవాడై సంతోషించాడుకదా!) అనే రీతిలో విభీషణునకు లంకారాజ్యాభిషేకాన్ని చేసిన తరువాత శ్రీరాముడు తన కార్యాన్ని పూర్తిచేసినవానినిగా తనను భావించాడు కదా!

**(నీదివానవన్)** – ఈ లీలావిభూతిలో ఉండేవారివలె, “భగవానునకు మనం దాసులం (శేషభూతులం), అతడు మనకు శేషి”– అనే భావాన్ని కాదనేవారెవ్వరూ లేనందువల్ల శేషి – శేషభూతుడు అనే సంబంధక్రమం మాఱకుండా, క్రమాను సారంగా ఉండే నిత్యవిభూతిలో ఉండేవాడు. ఇక్కడ ఉండే జీవులు పలువురు “నేనే ఈశ్వరుడను” అని భగవానునివద్ద ఎదురు బాణాన్ని సంధించే (ఎదిరించే) వారుగా కదా ఉన్నారు. అక్కడ నీతికి (క్రమానికి) కలత పొందించేవారు లేరు; కలతను పొందేవారూ లేరు. ఇక్కడ కలత కల్గించే వారున్నారు; కలతను పొందేవారు కూడా ఉన్నారు.

**(నీళ్‌మదిళ్ అరఙ్గత్తమ్మాన్)** – **“నీదివానవన్”** అని శ్రీవైకుంఠాన్నిగూర్చి పల్కిన వెంటనే **“నీళ్ మదిళ్ అరఙ్గత్తమ్మాన్”** అని భూలోకవైకుంఠాన్నిగూర్చి పల్కుతున్నారు. **“అళప్పరియ ఆరముదై అరఙ్గమేయ అన్దణనై”** (అపరిచ్ఛిన్నమైన అతృప్తామృతం వంటివాడు, శ్రీరంగంలో శయనించి ఉండే బ్రాహ్మణుడు) అని తిరుమంగై మన్నన్ కూడా పలికారు కదా!

**(నీళ్ మదిళ్ అరఙ్గత్తమ్మాన్)** – భగవానుని (తనను) రక్షించడానికి తగిన కోటలను కల శ్రీరంగంలో శయనించి ఉండే దేవాధిదేవుడు.

**(అమ్మాన్)** – శ్రీరంగంలో ఉండేవారు అందఱు తమ శేషత్వాన్ని అంగీకరించే వారు కనుక, ఇక్కడ “నీవు గొప్పవాడవా? నేను గొప్పవాడనా?” అనే వాదం ఉండదు. అందువల్ల ద్వైరాజ్యం లేకుండా భగవానుని శేషిత్వం ప్రకాశిస్తుంది. ఇక్కడ, లోతును ఇంతటిది అని చూడడం (భోగ్యతలోని అతిశయం ఇంత అని చూడడం) సాధ్యం కాదు కనుక, **“విరైయార్ పొ*ழ*ిల్ వేఙ్గడవన్”** – అని శ్రీవేంకటాద్రిని దర్శించి అనుభవించడానికి ఆరంభించారు. ఆ వేంకటాద్రిలోని భోగ్యత అవధికి మించి ఉన్నందువల్ల తిరిగి మళ్ళీ శ్రీరంగాన్ని అనుభవించడం ఆరంభిస్తున్నారు. ఒకే నదీప్రవాహాన్ని మడుల (పంట పొలాల) లోకి మళ్ళించి పల్లపు ప్రదేశాలలోకి విడిచేటట్లే, శ్రీరంగనాథుడే ఉత్తరద్వారం ద్వారా వచ్చి ప్రవేశించి శ్రీరంగనాథుడుగా శయనించి ఉన్నాడు – అనికూడా చెప్పవచ్చు.

**(తిరుక్కమలపాదమ్)** – అందం, చల్లదనం, వికాసం, సుగంధం మొదలైన గుణాలలో తామరలతో పోలి ఉన్నందువల్ల **“తిరుక్కమలపాదమ్”** అని అంటున్నారు. సూర్యుని చూచినపుడుకదా తామర వికసిస్తుంది. ఈ శ్రీపాదాలనే తామర పూలకు సూర్యుడు తిరుప్పాణ్ ఆ*ழ*్వార్లు. **“తిరుక్కమలపాదమ్”** అని అన్నందున **“తిరు”** అనే లక్ష్మీదేవి తన స్తనతటాలలోను, కళ్ళలోను, ఒత్తుకొనే శ్రీచరణాలు ఇవి – అని భావం. తిరుమంగై ఆ*ழ*్వార్లు **“తళిర్ పురైయుమ్ తిరువడి ఎన్‌తలైమేలవే”** (తిరునెడు–1) (చిగురువంటి సుకుమారమైన భగవానుని శ్రీచరణాలు నా తలపై నిలచి ఉన్నాయి) అని పల్కినట్లే వీరుకూడా **“తిరుక్కమలపాదమ్ ఎన్ కణ్ణినుళ్ళన”** (శ్రీపాదకమలాలు నా కళ్ళలో ఉన్నాయి) అని అంటున్నాయి.



**(అమ్మాన్ తిరుక్కమలపాదమ్)** – ప్రాప్తశేషి అయినందువల్ల ఆ శ్రీచరణాలు వీరిని అన్వేషించి వచ్చి పొందాయి.

**(వన్దు)** – ఒక వస్తువును సముద్రాన్ని దాటి ఇంకొక ద్వీపానికి పోయి, అమ్మాలి – అంటే, అమ్మేవారు సగం దూరం, కొనేవారు సగం దూరం వచ్చి, దారిమధ్యలో అమ్మకం జరుగవచ్చు. లేక, కొనేవారే పూర్తిగా అమ్మేవానికి దగ్గరకు వచ్చి కొనవచ్చు. ఆ విధంగా కాకుండా, **“వన్దు ఉనదడియేన్ మనమ్ పుకున్దాయ్”** (పెరియ తిరు–3–5–1) (వచ్చి నీకు దైసుడనైన నా మనస్సులో ప్రవేశించావు) అని తిరుమంగైయా*ழ*్వార్లు అనుగ్రహించిన రీతిలో, దారి పూర్తిగా పయనించి నావద్దకు వచ్చినవాడు తానే, నేను అతనిని ఆశ్రయించకుండా ఉన్నా, నన్ను పట్టుకొన్నవాడుకూడా తానే – అని అంటున్నారు.

**(ఎన్ కణ్ణినుళ్ళన)** – **“కమలక్కణ్ణన్ ఎన్ కణ్ణినుళ్ళాన్ కాణ్బన్ అవన్ కణ్‌గళాలే అమలఙ్గళాక వి*ழ*ిక్కుమ్”** (తిరువాయ్–1–9–9) (పుండరీకాక్షుడు నా కంటిలో ఉన్నాడు. నేను నా కళ్ళతో అతనిని సేవించాను. ఎందుకంటే, అతడు నన్ను తన నేత్రాలతో వీక్షించాడు) అనే నమ్మా*ழ*్వార్లవలె పల్కుతున్నారు.

**(నీదివానవన్ కమలపాదమ్ ఎన్‌కణ్ణినుళ్ళన)** – **“తద్విష్ణోః పరమం పదమ్ సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షురాతతమ్, తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే, విష్ణో ర్యత్పరమం పదమ్”** (ఋగ్వేద–సామవేదమ్–3–18–2–4) (విష్ణువు యొక్క ఆ పరమపదాన్ని నిత్యసూరులు ఎల్లప్పుడు దర్శిస్తున్నారు. ఆ పరమపదం, అన్నిటిని ప్రకాశింపజేసేవాడు, ఆకాశంలో ఉండేవాడు, లోకాలకు అన్నిటికి నేత్రభూతుడై ఉండేవాడు అయిన సూర్యునివలె ప్రకాశాన్ని కల్గినది. విష్ణువుయొక్క

పరమపదంలో మేధావులు, స్తుతించడమే స్వభావంగా కలవారు, ఎల్లప్పుడు మేల్కొని ఉండే వారైన నిత్యసూరుల కంటికి లక్ష్యమైన భగవాను శ్రీచరణాలు నాకంటికి (ప్రాకృత నేత్రాలకు) కన్పిస్తున్నాయి కదా! ఆహా!) – అని ఆశ్చర్యపడుతున్నారు. ఆ శ్రీచరణాలకు సాధ్యమైనంతవరకు ప్రతిదినం విరోధం చేసినవాడనుకదా నేను. ఆ విధంగా వ్యతిరేకంగా ప్రవర్తించకూడదని నా నేత్రాలను మూసికొన్నాను. అయితే, ఆ శ్రీచరణాలు నన్ను విడువకుండా వెంబడించి వచ్చి మూసికొన్న నా నేత్రాల లోపలకు బలవంతంగా ప్రవేశించి నిలచినందున, **'ఎన్‌కణ్ణినుళ్ళన'** (నా కళ్ళలో ఉన్నాయి) అని అంటున్నారు. ఆ రీతిలో కాకుండా, మిక్కిలి హీనుడనైన నేను నాకంటితో చూడడం ఆ పాదాలకు అవద్యకరం – అని కళ్ళను మూసికొన్నాను. అయినా, ఆ శ్రీచరణాలు నాకంటిలోపల ప్రకాశించడం ఆరంభించాయి – అని అంటున్నారనికూడా చెప్పవచ్చు.

**(ఒక్కిన్ఱ)** – ప్రయోజనం భగవానునకు, ఆఴ్వార్లకు సమానంగా ఉన్నది. భగవానునకు శీలగుణం (చాలా గొప్పవాడు చాలా నీచునితో ఏవిధమైన అంతరం లేకుండా కలసి వర్తించడమనే శీలగుణం) సిద్ధించింది. ఆఴ్వార్లకు శేషత్వస్వరూపం సిద్ధించింది.

**(ఒక్కిన్ఱ)** – ఉపాసకులకు ప్రత్యక్షసమానాకారమైన దర్శనం కలిగేటట్లుగా, భగవానుని అనుగ్రహంవల్ల వీరికి అటువంటి దర్శనం కల్గింది – అని తెలుపు తున్నారని కూడా చెప్పవచ్చు లేక, నా కంటితో చూచినందువల్ల శ్రీచరణాలకు ఏ కొఱత కలుగకుండా, పూర్వపు స్థితికి ఏలోటు లేకుండా ఉన్నది – అని కూడా చెప్పవచ్చు. లేక, **"ఒక్కిన్ఱదే"** అని అంటూ మిగిలిన సంసారిజీవులను చూచి "మీకు ఈ దర్శనం కలిగిందా?" అని అంటున్నారనికూడా చెప్పవచ్చు. లేక, అతనిని (స్వామిని) చూచి నేను ఆనందించినట్లే నన్ను చూచి, అతడు ఆనందించాడా ఏమి!– అని అంటున్నారని చెప్పవచ్చు.

**(అమలన్)** – నమ్మాఴ్వార్ల వలె **"ఉయర్వఱ ఉయర్ నలమ్ ఉడైయవన్"** (తిరువాయ్–1–1–7) (నిస్సమాభ్యధికమైన ఆనందాన్ని కలవాడు) అని అంటున్నారు.

**(ఆది) – "ఎవన్ అవన్"** (తిరువాయ్–1–1–1) అని నమ్మాఴ్వార్లు పల్కినట్లుగా అంటున్నారు.



**(పిరాన్)** – **"మయర్వఱ మదినలమ్ అరుళినన్".** (తిరువాయ్–1–1–1) (దోషరహితమైన, భక్తిరూపంలో పరిణమించిన జ్ఞానాన్ని అనుగ్రహించినవాడు) అనే రీతిలో పల్కుతున్నారు.

**(అడియార్కు)** నమ్మాఴ్వార్ల **"పయిలుమ్ శుడరొళి"**. (తిరువాయ్–3–7) దశకంలోని అర్థాన్ని దీనిద్వారా పల్కుతున్నారు. **"విణ్ణవర్‌కోన్"** (నిత్యసూరినాథుడు) అని అంటూ **"అయర్వఱుమ్ అమరర్‌కళ్ అదిపతి"** (తిరువాయ్–1–1–) (భ్రమ విప్రలంభాదులు లేని నిత్యసూరులను అధిపతి) అనే అర్థాన్ని పల్కుతున్నారు.

**(వన్దు)** – నమ్మాఴ్వార్లు **"తొఴుదెఴు ఎన్‌మననే"** (ఓ మనసా! కొలిచి ఉజ్జీవించు) అని అంటూ తమ మనస్సును ఉపదేశించారు. వీరికి ఆ శ్రీచరణాలే కంటి లోపలకు వచ్చి సాక్షాత్కరించాయి.

**2. ఉవన్ద ఉళ్ళత్తనాయ్ ఉలకమళన్దణ్డముఱ,**
**నివర్న్ద నీణ్డ ముడియన్ అన్ఱు నేర్న్ద నిశాశరరై,**
**క్కవర్న్ద వెజ్కణై క్కాకుత్తన్ కడియార్ పొఴిలరజ్గత్తమాన్, అరై**
**చ్చివన్ద వాడైయిన్ మేల్ శెన్ఱదామ్ ఎన్‌శిన్దనైయే**

ఉవన్ద ఉళ్ళత్తనాయ్ = (నన్ను వశీకరించుకొనుటవలన) ఆనందించిన మనస్సును కలవాడై, ఉలకమ్ అళన్దు = మూడులోకములను కొలిచి, అణ్డముఱ= బ్రహ్మాండములందు అంతట నిండునట్లు, నివర్న్ద = వ్యాపించినవాడై, నీణ్డ ముడియన్ = సమస్తరాజ్యములకు అధిపతి అనుటను తెలుపునట్టి దీర్ఘమైన కిరీటమును కలవాడై, అన్ఱు = జనస్థానములో నున్నపుడు, నేర్న్ద = ఎదిరించిన, నిశాశరరై= ఖరదూషణాది రాక్షసుల ప్రాణములను, కవర్న్ద = అపహరించిన, వెమ్= క్రూరమైన, కణై = బాణములను కలవాడై, కడియార్ = సుగంధము నిండిన, పొఴిల్ = తోటలను కల, అరజ్గత్తు = శ్రీరంగమున శయనించియున్న, అమ్మాన్= సర్వస్వామియైనవానియొక్క, అరై = కటియందు (నడుమునకు) అలంకరించిన, శివన్ద ఆడైయిన్ మేల్ = పీతాంబరముపై, ఎన్ శిన్దనై = (పూర్వము యువతుల విషయమున ఆసక్తమైన) నా మనస్సు, శెన్ఱదు ఆమ్ = చేరినదే! (లగ్నమైనదికదా!), ఏ = ఆశ్చర్యము !

**అవ : ఇరణ్డామ్బాట్టు : ముతఱ్పాట్టిల్ - అవన్ తొడర్న్దు వన్ద పడి శొన్నార్, ఇప్పాట్టిల్ - తామ్ మేల్విఴున్దపడి శొల్లుకిఱార్. తిరువడికళిలే తొడర్న్ద**

తిరువుళ్ళమ్ తిరుప్పరియట్టత్తిన్మేలే శేర్న్దపడి ఎజ్గనే? యెన్నిల్, తానఱిన్దు శేరిల్ విషయత్తిన్ భోగ్యతైక్కు క్కుఱ్ఱమామ్, ఆకైయాలే భోగ్యతై యళవుపట్టతుమల్ల, ఆశై తలైమడిన్దతు మల్ల; కడలోతమ్ కిళర్న్దలైక్కప్పుక్కాల్ ఉళ్ళే కిడన్దతొరు తురుమ్బుకడలై అళవిట్టల్లవే కరైయేఱువతు, ఒరు త్తిరై ఒరు తిరైయిలే ఏఱవీశు మత్తనైయిఱే.

వ్యా : (ఉవన్ద వుళ్ళత్తనాయ్) ఆழ்వ్వారై అకప్పడుత్త కైయాల్ వన్ద ప్రీతి. సర్వేశ్వరనాయ్, శ్రియఃపతియాయ్, అవాప్తసమస్తకామనా యిరుక్కిఱవన్ అర్థియాయ్ వన్దు, తన్ తిరువడికళై త్తలైయిలే వైయానిన్టాల్ "మదీయమూర్ధానమలఙ్కరిష్యతి" ఎన్టు ఉకక్కవేణ్డి యిరుక్క, అవై యఱియాతిరుక్క, ప్రజై పాల్ కుడిక్క క్కణ్డు ఉకక్కుమ్ మాతావైప్పోలే ఉకన్ద తిరువుళ్ళత్తై యుడైయనాయ్. ఇవఱ్ఱై ప్పిరిన్దార్ వ్యసనముమ్ తన్నతేయిఱే; "వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః" ఎన్గిఱపడియే.

(ఉలక మళన్దు) వకుత్త తిరువడికళ్ తలైయిలే వన్దిరున్దాలుమ్ ఉకక్క అఱియాత లోకత్తై క్కిడీర్, తానుమ్ విడాతే యళన్దతు. ఉకక్క అఱియామైక్కు "వన్ మా వైయ" మిఱే.

గుణాగుణనిరూపణమ్ పణ్ణాతే ఎల్లార్తలైయిలుమ్ ఒక్క త్తిరువడికళై వైత్తపడియాలే, భక్తిమాన్గళుమ్, పాతకికళుమ్ ఒక్క వాழ்న్దుపోయ్ఱ్ఱు.

(అణ్డ ముఱ నివర్న్ద నీణ్ముడియన్) అణ్డకటాహత్తిలే శెన్టు శేర్న్ద తిరువభిషేకత్తైయుడైయవన్. అణ్డకటాహమ్ వెడిత్తు, అతు అడైక్కవేణ్డుమ్బడియిఱే అపేక్షితమ్ పెఱ్ఱు వళర్న్దపడి.

(అణ్డముఱ) "అణ్డమ్ మోழை యెழ".

(నివర్న్ద) పూ అలర్న్దాప్పోలే, నీణ్ముడియన్ ఉభయవిభూతిక్కుమ్ నిర్వాహకనెన్టు తోఱ్ఱుమ్బడి యిరుక్కిఱ తిరువభిషేకత్తై యుడైయవన్. రక్ష్యవర్గత్తై నోక్కినాలిఱే రక్షకన్ ముడి ధరిప్పతు.

(అన్టు) కణ్డ కాట్చియిలే "జితమ్" ఎన్నవేణ్డియిరుక్కిఱ అన్టు. ఎతిరిట్ట పైయల్కళై ముడిక్కైక్కు వెవ్వియ శరత్తై యుడైయ చక్రవర్తి త్తిరుమకన్.



(అన్టు) రక్షకనావన్ రక్ష్యత్తై నోక్కక్కడవతాక వన్దు నిన్ట అన్టు

(నేర్న్ద నిశాశరరై) ఎతిరిట్ట నిశాచరరై. "నేర్న్ద నిశాశరర్" ఎన్గిఱతు-తిరుప్పల్లాణ్డు పాడవేణ్డు మழைక్కణ్డుమ్ ఎతిరమ్బుకోప్పతే! - ఎన్టు. నిశాశరర్- వెళియిల్ ముకమ్ కణ్డఱియాత పైయల్కళ్.

(కవర్న్ద) పుఱప్పడుమ్బోతు వినయత్తోడు పుఱప్పట్టు, వేట్టై నాయ్కళ్ ఓడి మేల్ విழுమాప్పోలే మేల్విழுకై.

(వెమ్ కణై) - విడుమ్బోతు అమ్బాయ్, పడుమ్బోతు కాలాగ్నిపోలే యిరుక్కై. "దీప్తపావకసఙ్కాశై శ్శరైః" ఎన్గిఱపడియే పెరుమాళ్ కణ్ పార్క్కిలుమ్ ముడిత్తల్లతు నిల్లాత ఎమ్మై.

(కాకుత్తన్) కుడిప్పిఱప్పాల్ తరమ్ పారాతే విషయీకరిత్తపడియుమ్, వీరవాశియుమ్.

(కడియార్ పొழிల్) తిరువులకు అళన్దరుళిన విడమే పిడిత్తు అడియొఱ్ఱినాన్. రావణవధమ్ పణ్ణి త్తెఱ్కుత్తిరువాశలాలే పుకున్దు శాయ్న్దరుళినాన్. ఇన్నముమ్ వేర్ప్పు అడఙ్గఱ్ఱిల్లై. తిరుచ్చోలైయిన్ పరిమళమ్ విడాయర్క్కు శిశిరోపచారమానపడి.

(అరఙ్గత్తమ్మాన్) అవతారత్తుక్కు ప్పిఱ్పాడర్క్కుమ్ ఇழవు తీర క్కోయిలిలే వన్దు కణ్వళర్న్దరుళుకిఱపడి.

(అమ్మాన్) ఇఙ్గే వన్దపిన్బు ఈశ్వరత్వమ్ నిలై నిన్ఱ్కు.

(అరై చ్చివన్ద వాడై) "ఉడైయార్న్ద వాడై"; "శెక్కర్ మాముకిల్". తిరుమేనిక్కు పరభాగమాన తిరుప్పీతామ్బరమ్.

(శివన్ద వాడైయిన్మేల్ శిన్టై తామ్) "శోఱ్ఱిన్మేలే ఎనక్కు మనమ్ శెన్టతు" ఎన్నుమాపోలే ఆశ్చర్యపడుకిఱార్.

(ఎన్ శిన్దనైయే) అరుడైయ కూఱై యుడైయై క్కణ్డు ఉకక్క క్కడవ నెఞ్జు ఇతిలే యకప్పట్టతు.

**(ఎన్ శిన్దనై)** తిరువడికళిన్ శువడఱిన్ద పిన్బు పుఱమ్బు పోకమాట్టాత నెఞ్జు. తీర్థమాడా నిఱ్కు త్తుఱైయిలే పిళ్ళైయై క్కెడుత్తు త్తిరువోలక్కత్తిలే కాణ్బారైప్పోలే, తిరువడికళిల్ నిన్ఱుమ్ తిరుప్పీతామ్బరత్తిలే తిరువుళ్ళత్తై క్కణ్డపడి. ఇత్తాల్ - తిరువులకళన్దరుళినత్తైయుమ్, రామావతారత్తైయుమ్ పెరియ పెరుమాళ్ పక్కలిలే ఓరో వకైకళాలే కాణ్గిఱార్.

## అరుమ్బుదమ్

*ఇరణ్డామ్ పాట్టు : (ఉవన్ద-ఇత్యాది) (తానఱిన్దు శేరిల్) తిరువరైయిల్ భోగ్యతైయై అఱిన్దు కిట్టిల్- ఎన్ఱపడి. (విషయత్తిన్ భోగ్యతైయై)- తిరువడికళిన్ భోగ్యతైయై.*

*(ఉకప్పు)- ఆழ்ప్వార్ విషయమాదల్, లోకవిషయమాదల్. ఉకక్క అఱియావిట్టాల్ వైప్పానేన్? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (గుణాగుణేత్యాది), (అడైకెట్ట) తమరిడ. అళప్పదఱ్కు మున్బు నీణ్‌ముడి యిల్లైయో? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (రక్ష్యవర్గత్తై ఇత్యాది) (విషయీకరిక్కై) విభీషణాழ்ప్వానై.*

**రెండవ పాశురం – అవతారిక :–** మొదటి పాశురంలో **"కమలపాదమ్ వన్దు ఎన్ కణ్ణినుళ్ళన"** (శ్రీచరణ కమలాలు నా నేత్రాలలో మించి ఉన్నాయి) అని అంటూ అతడు (భగవానుడు) వీరిని (ఆழ்ప్వార్లను) వెంబడించిన రీతినిగూర్చి పలికారు. ఇక, ఈ పాశురంలో – **"శివన్ద ఆడైయిన్ మేల్ శెన్ఱదామ్ ఎన్ శిన్దనైయే"** (ఎఱ్ఱని పీతాంబరంపై నా మనస్సు ప్రసరించింది) అని తాము అభిముఖులై వచ్చి, ఆ స్వామిని అనుభవించిన (దర్శించిన) ప్రకారాన్ని పల్కుతున్నారు.

శ్రీచరణాలను అనుభవించిన వీరి మనస్సు (వాటిని వదలి) **"శివన్ద ఆడై"** (పీతాంబరం) పై చేరడం ఏవిధంగా? అని అంటే, తామే తెలిసికొని చేరి ఉంటే **"కమలపాదమ్"** భోగ్యతకు కొఱత కలుగుతుంది. కనుక, శ్రీచరణపద్మాల భోగ్యత కొఱతపడినందువల్ల గాని, (లేక) వానిపట్ల అభినివేశం కొఱతపడినందువల్ల గాని, ఆழ்ప్వార్ల మనస్సు పీతాంబరంపైకి వెళ్ళలేదు. సముద్రంలోని అలలు వీచేటపుడు ఆ సముద్రం లోపల ఉండే గడ్డితునుక సముద్రాన్ని అంతటిని చూచిన తరువాత



తీరాన్ని చేరుతున్నది – అనే స్థితి లేదు. ఒక కెఱటం తరువాత ఇంకొక కెఱటం – ఆ తునుకను గెంటగా అది తీరాన్ని చేరుతుంది. అదే రీతిలో వీరి మనస్సుకూడా ఒక దివ్యాంగంనుండి ఇంకొక దివ్యాంగానికి గెంటబడగా పోయి చేరుతున్నది – అని చెప్పాలి.

**వ్యాఖ్యానమ్ :– (ఉవన్ద ఉళ్ళత్తనాయ్)** – ఆழ்ప్వార్లను వశీకరించుకొన్నందువల్ల భగవానునకు కల్గిన ఆనందం దీనివల్ల తెలుపబడింది. సర్వేశ్వరుడై, శ్రియఃపతియై, అన్ని కోఱికలు తీరినవాడై (అవాప్తసమస్తకాముడై) ఉండే భగవానుడు యాచకుడై వచ్చి, తన శ్రీచరణాలను లోకంలో ఉండే అందఱి తలలపై పెట్టాలని ప్రయత్నిస్తే, **"కదా పునః శంఖరథాంగకల్పక ధ్వజారవిందాంకుశవజ్రలాంఛనమ్, త్రివిక్రమ! త్వచ్చరణాంబుజద్వయం మదీయమూర్ధాన మలంకరిష్యతి"** (స్తోత్రరత్నమ్–31) (త్రివిక్రమా! శంఖం, చక్రం, కల్పవృక్షం, ధ్వజం, తామరపూవు, అంకుశం, వజ్రాయుధం – అనే వీటి గుర్తులను కల నీ శ్రీచరణపద్మాలను నేను నా శిరస్సుపై ఎపుడు అలంకరించుకోగలను?) అనే రీతిలో దానికి ఆనందించవలసిఉండగా, ఆవిధంగా వారు ఆనందించకుండా ఉన్నా, "ఈలోకంలోనివారు అజ్ఞానంవల్ల మనలను అడ్డుపెట్టకుండా ఉన్నారుకదా!" అని తలచి, బిడ్డ పాలు తాగడాన్ని చూచి తాను సంతోషించే తల్లివలె, చాలా ఆనందించిన మనస్సును కలవాడయ్యాడు, భగవానుడు – అని అంటున్నారు. **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః, ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి"** (రామా–అయో–2–40) (శ్రీరాముడు లోకుల దుఃఖాలలో వారికంటే ఎక్కువగా దుఃఖిస్తాడు. వారి అన్ని ఉత్సవాలలో వారి తండ్రివలె ఆనందిస్తాడు) అనే రీతిలో తన సొత్తుకు దూరమైతే బాధపడేవాడు ఇతడే కదా!

**(ఉలక మళన్దు)** – (ప్రాప్తమైన) తమ నాయకుని శ్రీచరణాలు తమ శిరస్సుపైకి వచ్చినా (పెట్టబడినా) ఆనందించడం తెలియని లోకాన్నికదా, అతడు ఆ లోకంపట్ల తానే ముందుగా అభినివేశాన్ని పొంది కొలిచాడు. **"వన్ మా వైయ మళన్ద ఎమ్ వామనా!)** (తిరువాయ్–3–2–2) (కఠినమైన గొప్ప భూమిని కొలిచిన మా వామనమూర్తీ!) అనే రీతిలో ఈలోకంలోనివారు మిక్కిలి కాఠిన్యాన్ని కలవారు కనుక, భగవానుడు తన శ్రీచరణాలను తమ తలలపై పెట్టినపుడు సంతోషించడం తెలియకుండా ఉన్నారు. వీరు సద్గుణాన్ని కలవారా? లేక, దుర్గుణాన్ని కలవారా? అని విచారించకుండా అందఱి తలలపై శ్రీచరణాలను ఒకేరీతిలో పెట్టినందు

వల్ల, భక్తిని కలవారు, పాపాన్ని చేసినవారు – అనే తేడా లేకుండా శ్రీచరణస్పర్శ అనే ఉజ్జీవనాన్ని పొందారు.

**(అణ్డముఱ నివర్న్ద నీళ్‌ముడియన్)** – బ్రహ్మాండభిత్తివరకు పోయి చేరిన కిరీటాన్ని కలవాడు.

**(అణ్డముఱ)** – లోకాన్ని కొలువడమనే తన ఆశ నెఱవేఱినందున కల్గిన సంతోషంచేత. **"అణ్డమ్ మోళ్ఴై ఎళ్ఴ"** (తిరువాయ్–7–4–1) (అండభిత్తిని భేదించగా) అనే రీతిలో అండభిత్తిని భేదించి, ఆ పిమ్మట పైకి ప్రసరించలేని రీతిలోకదా, ఇతడు లోకాన్ని కొలిచాడు.

**(నివర్న్ద)** – పూవు వికసించినట్లుగా నిమిరిన – అని (హార్ద) భావం.

**(నీళ్‌ముడియన్)** –"నిత్యవిభూతి, లీలావిభూతి – అనే రెండు లోకాలకు ఇతడే ఈశ్వరుడు" అని ప్రకాశించేటట్లుగా ఉండే దీర్ఘమైన కిరీటాన్ని కలవాడు. రక్షించవలసినవారిని రక్షించినపుడుకదా ప్రభువు శిరస్సుపై కిరీటం నిలుకడగా ఉంటుంది.

**(అన్ఱు నేర్న్ద నిశాశరరై క్కవర్న్ద వెఞ్గణై క్కాకుత్తన్)** – ఇతనిని చూడగానే ఇతని విజయం, తమ పరాజయం శత్రువులుసైతం అంగీకరించేటట్లుగా ఉన్నవాడు. ఎదిరించిన అసురులను నశింపజేయడంకోసం మిక్కిలి వేడిమిని కల బాణాలను ప్రయోగించిన చక్రవర్తి కుమారుడు (శ్రీరాముడు).

**(అన్ఱు)** – కాపాడే భగవానుడు, తనచే కాపాడబడే ప్రజలను రక్షించడంకోసం శ్రీరాముడై వచ్చి జన్మించిన ఆనాడు.

**(నేర్న్ద నిశాశరరై)** ఎదిరించిన రాక్షసులను, అసురులను – అని భావం. **"నేర్న్ద"** అనే విశేషణంద్వారా "మంగళాశాసనం చేయవలసిన భగవానుని సౌందర్యాన్ని చూచినా, అతనికి ఎదురుగా నిలచి బాణాలను విడువడమా!" అనే భావం స్ఫురిస్తున్నది. **"నిశాశర్"** అనే పదం "వెలుతురు ఉండే చోట ముఖాన్ని చూపించలేక, రాత్రిలో సంచరించే దుష్టులు"– అనే అర్థాన్ని ఇస్తుంది.

**(కవర్న్ద)** – (స్వామి బాణాలు) భగవానుని వింటినుండి వెలువడేటపుడు అణకువతో బయలుదేరి, శత్రువులను చేరేటపుడు వేటకుక్కలు తమ ఎరను చూచి పరుగెత్తి పైనపడే రీతిలో పడతాయి – అని భావం.



**(వెఞ్గణ్)** – భగవానుడు విడిచేటపుడు బాణమై, శత్రువులపై పడేటపుడు ప్రళయకాలంలోని అగ్నివలె తీవ్రమైన వేడిమిని కల్గినవిగా ఉంటాయి. **"దీప్తపావకసంకాశైః శరైః కాంచనభూషణైః, న త్వా మిచ్ఛామ్యహం ద్రష్టుం రామేణ నిహతం శరైః"** (రామా– యుద్ధ–16–32) (జ్వలించే అగ్నివంటివి, చాలా పదునైనది, బంగారంతో అలంకరింపబడినవి అయిన బాణాలతో శ్రీరామునిచే నీవు వధింపబడడం నేను చూడగోరడం లేదు) అనే రీతిలో భగవానుడు దయ జూపినా, శత్రువులను వధించకుండా వదలని తీవ్రమైన వేడిమిని కల్గినవి – అని భావం.

**(కాకుత్తన్)** కకుత్థ్సమహారాజుయొక్క వంశంలో జన్మిస్తే, ఉన్నతుడు – అధముడు అనే వ్యత్యాసం లేకుండా అందఱిపట్ల దయను చూపించే గుణాన్ని, గొప్ప వీర్యగుణాన్ని కల్గి ఉంటాడని భావం.

**(కడియార్ పొళ్ఴిల్)** – **"ఉలకమళన్దు"** అని అంటూ లోకాన్ని కొలిచిన వృత్తాంతాన్నిగూర్చి పల్కి, **"కవర్న్ద వెఞ్గణై క్కాకుత్తన్"** (నిరాచరుల ప్రాణాలను గ్రహించిన క్రూరబాణాలను కల శ్రీరాముడు) అని రావణుని వధించిన శ్రీరామునిగూర్చి పల్కి, వెంటనే శ్రీరంగనాథుని కీర్తించినందువల్ల, లోకాలను కొలిచి నందువల్ల కల్గిన శ్రమను, రావణవధను చేసినందువల్ల కల్గిన శ్రమను పోగొట్టుకోవడంకోసం రావణవధను చేసిన ఆ శ్రీరాముడే, ఆ అరుదైన కృత్యాన్ని చేసి ముగించిన వెంటనే దక్షిణద్వారం ద్వారా ప్రవేశించి, సువాసన నిండుగా కల తోటలను కల శ్రీరంగంలో శయనించి ఉన్నాడు – అని సూచిస్తున్నారు. (స్వామి) శయనించి ఉండే అందాన్ని చూస్తే ముందు తెల్పిన అపరూపమైన వరకృత్యాలను చేసినందువల్ల కల్గిన శ్రమ ఇంకా తీరలేదు. శ్రీరంగంలోని తోటల పరిమళం ఆ శ్రమను పోగొట్టడం కోసం శైత్యోపచారాన్ని చేస్తున్నట్లుగా ఉన్నది – అని భావం.

**(అరఙ్గత్తమ్మాన్)** – ఆ అవతారాలకు తరువాత జన్మించినవారికికూడా కొఱత లేని రీతిలో శ్రీరంగం దివ్యాలయంలోని వచ్చి శయనించి ఉన్నాడు – అని భావం.

**(అమ్మాన్)** – ఇక్కడకు వచ్చిన తరువాతనే ఇతని ఈశ్వరత్వం స్థైర్యాన్ని పొందింది– అని భావం.

**(అరై చ్చివన్ద వాడై)** – **"ఉడైయార్న్ద వాడై"** (తిరువాయ్–3–7–4) (నడుముకు తగిన పీతాంబరం) అని తిరువాయ్‌మొ*ళ్రి* ప్రబంధంలోను, **"శెక్కర్ మా ముకి లుడుత్తు"** (తిరువాశిరియమ్–1) (ఎఱ్ఱని గొప్ప వస్త్రాన్ని దాల్చి) అని తిరువాశిరియమ్ ప్రబంధంలోను నమ్మా*ళ్ర్వా*ర్లు పల్కిన రీతిలో, నల్లని తిరుమేనికి పరభాగశోభను కల్గించే పీతాంబరాన్నిగూర్చి ఈ ప్రయోగం తెల్పుతున్నది.

**(శివన్ద ఆడైయిన్ మేల్ శెన్డదామ్)** – ఆకలిని పొందినవాడు "అన్నం పైన నా మనసు పోతున్నది" అనే రీతిలోనే శ్రీరంగనాథుని కీర్తించడం తప్ప వేఱేమీ తెలియని ఈ ఆ*ళ్ర్వా*ర్లు శ్రీరంగనాథుని చూడగానే అతని **"అరై చ్చివన్ద ఆడై"** (నడుములోని ఎఱ్ఱని వస్త్రం) పై తమ మనసు లగ్నం కావడాన్ని చూచి (ఆ*ళ్ర్వా*ర్లు) ఆశ్చర్య పడుతున్నారు.

**(ఎన్ శిన్దనై)** – నా మనస్సు – అని అర్థం. అనాదికాలంగా స్త్రీలు ధరించిన వస్త్రాలపై అభినివేశాన్ని పొందిన నా మనస్సుకదా ప్రాప్తవిషయమైన భగవానుని **"అరై చ్చివన్ద ఆడై"** (నడుములోని ఎఱ్ఱని పీతాంబరంపై) పై లగ్నమైనది – అని ఆశ్చర్యపడుతున్నారు.

**(ఎన్ శిన్దనై)** – మొదటి పాశురంలో **"కమలపాదమ్"** అనే శ్రీచరణాల భోగ్యతను తెలిపిన తరువాత, వేఱొక చోటికి పోలేని రీతిలో నా మనస్సు ఇపుడు అతని పీతాంబరంపై అభినివేశాన్ని పొందింది – అని ఈ పాశురంలో ఆశ్చర్య పడుతున్నారనికూడా చెప్పవచ్చు. పుణ్యనదులలో స్నానం చేసేవారు తమతోకూడా పిలుచుకొని వచ్చిన పిల్లలు తీరందగ్గర కనుపించనందున, వారిని వెదకి జనసమూహంలో చూడగల్గినట్లుగా, శ్రీచరణాలలో అభినివేశాన్ని పొందిన తమ మనస్సును ఆ*ళ్ర్వా*ర్లు చూడలేక వెదకి దానిని శ్రీరంగనాథుని పీతాంబరంలో గమనించి సంతోషిస్తున్నారు.

ఈ రీతిలో, ఈ పాశురంలో, త్రివిక్రముడై లోకాలను కొలిచిన లీలను, శ్రీ రామావతారాన్ని శ్రీరంగనాథుని విషయంలో ఒక్కొక్క రీతిలో తాము దర్శించిన విషయాన్ని ఆ*ళ్ర్వా*ర్లు తెలియజేశారు.

**3. మన్ది పాయ్ వడవేఙ్గడ మామలై, వానవర్‌కళ్**
**శన్ది శెయ్య నిన్ఱాన్ అరఙ్గత్తరవినణైయాన్,**



**అన్దిపోల్ నిఱత్తాడైయుమ్ అదన్‌మేల్ అయనై ప్పడైత్తతోరె*ళ్ర*ిల్,**
**ఉన్దిమేల్ అదన్ఱో అడియేనుళ్లత్తిన్నుయిరే.**

మన్ది = (పనసపండ్లు వృక్షమునుండి పై భాగమువరకు నిండుగా పండి యుండుటచే) మగ కోతులు, పాయ్ = ఒక గెలనుండి వేఱొక గెలకు నిరంతరము సంచరించునట్టి, వడ = ద్రావిడదేశమునకు ఉత్తరపు సరిహద్దుగా నున్న, వేఙ్గడమ్= వేంకటాచలమను పేరును కల్గినదియు, మా మలై = ఔన్నత్యమును, విస్తృతిని కల తిరుమలలో, వానవర్ = పరమపదముననున్న నిత్యసూరులు, శన్ది శెయ్య నిన్ఱాన్ = పుష్పములను గొని ఆరాధించునట్లు నిలచియున్నవాడై, అరఙ్గత్తు = శ్రీరంగమున, అరవిన్ అణైయాన్ = ఆదిశేషునిపై పరుండియున్నవానియొక్క, అన్ది పోల్ నిఱత్తు ఆడైయుమ్ = ఎఱ్ఱని ఆకాశమువలె ఎఱ్ఱని రంగును కల పీతాంబరమును, అదన్ మేల్ = దానికిపైన, అయనై ప్పడైత్తదు = బ్రహ్మకు ఉత్పత్తిస్థానమైన, ఓర్ ఎ*ళ్ర*ిల్ = సాటిలేని అందమును కల, ఉన్ది మేల్ అదు అన్ఱో= నాభిపైనున్నదికదా, అడియేన్ ఉళ్లత్తు = దాసునియొక్క మనస్సులోనున్న, ఇన్ ఉయిర్ = మంచి (తీయని) ఆత్మ.

అవ : మూన్ఱామ్బాట్టు. తిరుప్పీతామ్బరత్తిన్ అ*ళ్ర*కు తిరునాభీకమలత్తిలే వీశి*న్ఱ*ు.

వ్యా : (మన్ది పాయ్) - తిరుమలైయిల్ పలాక్కళ్ వేరు పిడిత్తు త్తలైయళవుమ్ ప*ళ్ర*ుత్తు క్కిడక్కైయాలే అఙ్గుత్తై క్కురఙ్గుకళ్ జాత్యుచిత చాపలత్తాలే ఒరు ప*ళ్ర*త్తై భుజిక్కప్పుక, మ*న్ఱ*వై మేలిల్ ప*ళ్ర*త్తిలే కణ్ణై యోట్టి, ఇత్తై విట్టు అతిలే పాయ్‌న్దు తావానిఱ్కు మత్తనైయాయ్‌త్తు, పెరియపెరుమాళుడైయ దివ్యావయవఙ్గళిలే తామ్ ఆ*ళ్ర*ఙ్గాల్ పడుకిఱా ప్పోలేయాయ్‌త్తు, అవైకళుమ్. "కానముమ్ వానరముమ్ వేడుముడై వేఙ్గడ"మిఱే.

(మన్ది పాయ్) ఒన్ఱై యొన్ఱు ప*న్ఱ*ి మాలైయాక నాలానిఱ్కుమ్, తిరుచ్చిన్నక్కురల్ కేట్టవాఱే పాయ్‌న్దోడానిఱ్కు మెన్ఱుమామ్. పరమపదముమ్, తిరుమలైయుమ్, కోయిలుమ్, తిరువయోధ్యైయుమ్ అచ్చోలైయోపాతియాయిరుక్కిఱపడి. ఎఙ్గుమ్ మాఱి మాఱి త్తఙ్గుకై.

(మన్ది పాయ్)- పలాక్కళ్ వేరోడు మునియోడు వాశియఱ ప్పఴుత్తు క్కిడక్కైయాలే ఒన్టిలుమ్ వాయ్వైక్కప్పెఱాతే తాన్ వేణ్డినపడి తిరియుమ్.

(వడ వేఙ్గడమ్) - తమిఴ్ దేశత్తుక్కు ఎల్లై నిలమ్.

(మామలై) భోగ్యతై యళవఱ్ఱిరుక్కై. ఉభయవిభూతియుమ్ ఒరు మూలైయిలే అడఙ్గు మెన్టుమామ్.

(వానవర్కళ్ శన్ది శెయ్య నిన్టాన్) - ఎత్తనైయేనుమ్ తణ్ణియార్క్కుమ్ ముకమ్ కొడుత్తునిఱ్కిఱ అన్నీర్మైయై అనుసన్ధిత్తు, నిత్యసూరికళ్ వన్దు పడుకాడు కిడప్పతు ఇఙ్గేయాయ్త్తు. మేన్మైయై అనుభవిక్కుమత్తనైయిఱే అఙ్గు; శీలానుభవమ్బణ్ణలావతు ఇఙ్గేయిఱే. నిత్యసూరికళ్ తిరుమలైయిలే నిఱ్కిఱ శీలవత్తైయిలే యీడుపట్టు వన్దు ఆశ్రయిక్క, కురుడర్క్కు వైత్త తణ్ణీర్పాలైయిలే విఴిక్కణ్ణర్ పుకురలామో? ఎన్టు, తాన్ ఆనైక్కు ప్పాడువారైప్పోలే మన్దికళ్ పక్కలిలే తిరువుళ్ళత్తై వైత్తాన్ - ఎన్టుమామ్.

(అరఙ్గత్తరవినణైయాన్)- అఙ్గు నిన్టు మిఙ్గే శాయ్న్దపడి. పరమపదత్తి నిన్టుమ్ అడి యొఱ్ఱినాన్; తిరుమలైయళవుమ్ పయనముణ్డాయిరున్దతు; అఙ్గు నిన్టుమ్ వడక్కుత్తిరువాశలాలే కోయిలిలే శాయ్న్దాన్. రామావతారత్తే పిడిత్తు అడి యొఱ్ఱినాన్. రావణవధమ్ పణ్ణి త్తెఱ్కు త్తిరువాశలాలే వన్దు శాయ్న్ద ఇత్తనైయా యిరున్దదు -ఎన్టుమామ్.

(అరవినణైయాన్) తిరికిఱవన్ శాయ్న్దరుళినాల్ ఉళ్ళ అఴకు.

(అరవు) నాఱ్ఱమ్, కుళిర్త్తి, మెన్మైయుమ్.

(అరఙ్గత్తరవినణైయాన్) (శేష్యే పురస్తాచ్ఛాలాయామ్) శ్రీభరతాఴ్వానై ఇళైప్పు క్కిడక్క విట్టుప్పోన్దు కడఱ్కరైయిలే వళైప్పు క్కిడన్దాప్పోలే, సంసారికళై ప్పెఱ్ఱాలల్లతు పోకేన్- ఎన్టు వళైప్పు క్కిడక్కిఱాన్. చక్రవర్త్తిత్తిరుమకనై ప్పోలే ముతలిల్ శరణమ్ పుక్కు ముకమ్ కాట్టావిట్టవాఱే. "చాప మానయ" ఎన్టు శీఱుమవనల్లన్. ఆఱ్ఱామైయై క్కాట్టి చ్చరణమ్ పుక్కు క్కిడక్కుమవనిఱే, ఇవన్.



(అన్ది పోల్ నిఱత్తాడైయుమ్) సన్ధ్యారాగమ్పోలే యిరున్దుళ్ళ తిరు ప్పీతామ్బరముమ్. "అరై చ్చివన్ద వాడై" ఎన్టతు పిన్నాట్టుకిఱపడి.

(అతన్మేల్) ఇవ్వఴకి నిన్టుమ్ కాల్ వాఙ్గమాట్టుకిఱిలర్.

(అయనిత్యాది) చతుర్దశభువనస్రష్టావాన బ్రహ్మావుక్కు ఉత్పత్తిస్థానమాన తిరునాభీకమలత్తిన్ మేలతన్టో. చతుర్ముఖసృష్టి పూర్వకాలత్తిలేయా యిరుక్క, ఇప్పోతు బ్రహ్మావుక్కు ఉత్పత్తిస్థాన మెన్టు కోళ్కొల్లి త్తారానిన్టతు, తిరునాభీ కమలమ్.

(ఎఴిలున్ది) ఇళకి ప్పతిక్కై. "ప్రసనాన్తఙ్బ యౌవనమ్" ఎన్గిఱపడియన్టిక్కే యిరుక్కై.

(అడియేన్) - "పతిం విశ్వస్య" "యస్యాస్మి" ఎన్గిఱ ప్రమాణత్తాలే 'అడియేన్' ఎన్గిఱారల్లర్. అఴకుక్కు త్తోఱ్ఱు "అడియేన్" ఎన్గిఱార్.

(అడియేనుళ్ళత్తిన్నుయిరే) ఎన్నుడైయ నఱ్చీవనానతు తిరునాభీ కమలత్తతన్టో - ఎన్గిఱార్, విడామైక్కు ప్పఱ్ఱాశు; "మరుడియేలుమ్ విడేల్ కణ్డాయ్" ఎన్నుమాప్పోలే. ఇప్పాట్టిల్ పెరియపెరుమాళ్ పక్కలిలే తిరువేఙ్గడ ముడైయాన్ తన్మైయు ముణ్డు- ఎన్గిఱతు.

అరుమ్బుదమ్

మూన్టామ్ పాట్టు : *తాత్పర్యత్తై అరుళిచ్చెయ్కిఱార్. (*పరమ పదము *మిత్యాది) (శన్ది శెయ్య) కిట్టుమ్బడి నిన్టాన్ - ఎన్నుదల్; ఆశ్రయియానిఱ్క ప్పరాక్కాయ్ నిన్టాన్ - ఎన్టుదల్. ముదల్ పాట్టై క్కటాక్షిత్తు ప్పరమపదత్తిల్ నిన్టుమ్ అడి యొఱ్ఱుదల్; ఇరణ్డామ్ పాట్టై క్కటాక్షిత్తు రామావతారత్తిలే అడి యొఱ్ఱుదల్. ఉన్దియై ప్పఱ్ఱాశాక ప్పఱ్ఱిన విడముణ్డో? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్. (మరుడి యేలు మిత్యాది).*

**మూడవ పాశురం :-** **అవ :-** గడచిన పాశురంలో స్వామి పీతాంబరం యొక్క అందాన్ని దర్శించి ఆనందించారు. ఆ అనుభవం పీతాంబరంపైన ఉండే

తిరునాభీ కమలంయొక్క అందాన్ని అనుభవించేటట్లుగా గెంటగా, దానిని ఈ పాశురంలో అనుభవిస్తున్నాయి.

**వ్యాఖ్యానమ్ : (మన్ది పాయ్)** – మొదటి రెండు పాశురాలలో శ్రీరంగనాథుని అనుభవించిన ఆழ్వార్లు అతడు నిలచి ఉండే చోటు అయన తిరుమలను ఈ పాశురంలో అనుభవిస్తున్నారు.

**(మన్ది పాయ్)** – తిరుమలలో పనసచెట్లు వేరునుండి చివరి కొమ్మలవరకు పండ్లు పండి ఉన్నాయి. అందువల్ల అక్కడ తిరుమలలో ఉండే కోతులు తమ చాపల్యంవల్ల ఒక చెట్టునుండి ఇంకొక చెట్టుమీదకు గెంతుతున్నాయి. వాటి స్వభావానికి తగినట్లు ఒక చెట్టునుండి ఒక పండుగా తినాలని ప్రయత్నించినపుడు, పైన ఉండే ఇంకొక పండువైపు వాటి దృష్టి సోకుతున్నది. అపుడు తినే పండును విడిచి, పైన కన్పించిన పండు దగ్గరకు దూకి దానిని పట్టుకొంటున్నాయి. ఇటు వంటి ఈ వానరాల చాపల్యగుణాన్నిగూర్చి ఆழ్వార్లు పల్కుతున్నాడు. శ్రీరంగ నాథుని దివ్యాంగాలలో ఒకదాని తరువాత ఇంకొక అంగంలో తాము అభినివేశాన్ని పొందినట్లే, ఈ వానరాలుకూడా ఒక పండునుండి ఇంకొక పండులో ఆసక్తిని పొందుతున్నాయి– అని అంటున్నారు. **"కానముమ్ వానరముమ్ వేడుముడై వేఙ్గడమ్"** (నాన్ముకన్ తిరు–47) (అడవులను, కోతులను, కోయలను కల వేంకటాద్రి) అని తిరుమழிశైప్పిరాన్ అనుగ్రహించారుకదా!

**(మన్ది పాయ్)** – ప్రాకారం లోపల ఉండే కోతులు ఒకదానిని ఇంకొకటి పట్టుకొని మాలవలె వరుసగా వేలాడతాయి. కోవెలలోని తిరుచ్చిన్నం (కాహళం) ఊదిన శబ్దం వినగానే దుమికి పరుగెత్తుతాయి – అని అంటున్నారని కూడా చెప్పవచ్చు. ఇంతవరకు పాశురాలలో వీరు అనుభవించినదానిని గమనిస్తే, పరమపదం, తిరుమల, శ్రీరంగం, తిరు అయోధ్య, అక్కడ ఉండే తోటలు ఒకే సమయంలో వీరి అనుభవానికి విషయమవుతున్నాయి – అని తోస్తున్నది. వీరి మనస్సు వానరాలవలె ఈ ప్రదేశాలలో మాటి మాటి సంచరిస్తున్నది – అని భావం.

**(మన్ది పాయ్)** – తిరుమలలోని పసనచెట్లలో వేరునుండి చివరి కొమ్మలవరకు పండ్లు నిండుగా ఉన్నందున కోతులు తమ చపలబుద్ధివల్ల ఒక పండుతో నిలువ కుండా మాటి మాటి దూకుతూ పలుపండ్ల దగ్గరకు పోయి తిరుగుతున్నవి.



**(వడ వేఙ్గడమ్)** – ద్రావిడదేశానికి ఉత్తరదిక్కు సరిహద్దు తిరువేఙ్గడమ్ (తిరుమల).

**(వడవేఙ్గడ మామలై)** తాము కవిత్వాన్ని చెప్పే ద్రావిడభాష వ్యవహరింపబడే దేశానికి ఉత్తరదిక్కుకు ఎల్లగా ఉండే చోటు కనుక, దాని అంతు లేని భోగ్యతను చూచి, దానిని కీర్తిస్తున్నారు. **"మామలై"** – అని పర్వతంలోని భోగ్యత తెలుపబడింది. దీని గొప్పతనాన్ని చూస్తే నిత్యవిభూతి, లీలావిభూతి ఈ పర్వతంలోని ఒక మూలలో అణగి పోతాయి – అని పాశురభావం.

**(వానవర్కళ్ శన్ది శెయ్య నిన్ఱాన్)** – **"వానవర్కళ్"** అనే పదం నిత్యసూరులను తెల్పుతున్నది. మిక్కిలి తక్కువవారుకూడా తనను అనుభవించేటట్లుగా దర్శనం అనుగ్రహిస్తూ తిరుమలకొండపై వేంచేసి ఉండే సన్నివేశాన్ని భావించి, నిత్యసూరులు తిరుమలకు వచ్చి, అందులో అభినివేశాన్ని పొంది, వేరు తెగిన వృక్షాలవలె పడి మొక్కుతారు. పరమపదంలో (భగవానుని) పరత్వమనే గుణాన్నిమాత్రమే అనుభవించ వచ్చు. ఇక్కడ సౌలభ్యం, సౌశీల్యం – మొదలైన గుణాలనుకూడా అనుభవించవచ్చు.

నిత్యసూరులు భగవానుడు తిరుమలలో నిలచి ఉండే సౌలభ్యంలో అభినివేశాన్ని పొంది రాగా, "గుడ్డివారికోసం నిర్మింపబడ్డ ధర్మశాలలో చక్కని చూపును కలవారు ప్రవేశించవచ్చునా?" అని తలచి, తాను చదరంగాన్ని ఆడేవారివలె వానరాలపట్ల మనస్సును పెట్టాడు – అనికూడా చెప్పవచ్చు.

**(అరఙ్గత్తరవినణైయాన్)** – పరమపదంలో వేంచేసి ఉండేవాడు వేంకటాద్రిపై నిలచి ఉండి, అక్కడ నుండి ఇక్కడకు వచ్చి శయనించి ఉండే సన్నివేశాన్ని స్వీకరించి, శ్రీరంగంలో శయనించాడని భావం. పరమపదం నుండి ఈ లీలావిభూతిలో ఉండదగిన చోటు ఏది? అని స్వామి ఆలోచించాడు. అక్కడనుండి బయలుదేరి తిరుమలకు వచ్చి చేరాడు. అక్కడనుండి ఉత్తరద్వారం ద్వారా శ్రీరంగంలోకి ప్రవేశించి ఇక్కడ శయనించాడు. శ్రీరామావతారంలో ఇక్కడ నిరంతరంగా తాను వసించే చోటుకోసం అన్వేషించాడు. రావణుని వధించిన తరువాత దక్షిణద్వారం ద్వారా ఇక్కడకు వచ్చి ప్రవేశించి శయనించాడు – అని కూడా (భావం) చెప్పబడుతున్నది.

**(అరవిననైయాన్)** – ఊరిలో అంతట తిరిగినవాడు శ్రమ తీరడంకోసం ఇక్కడ పరుండినందువల్ల ఏర్పడిన అందం ఈ ప్రయోగంద్వారా తెలుపబడుతున్నది.

**(అరవు)** – సౌగంధ్యం, చల్లదనం, మెత్తనిదనం మొదలైన చక్కని పడుకకు ఉండదగిన గుణాలను నిండుగా కల ఆదిశేషుడు.

**(అరజ్గత్తరవినణైయాన్)** – **"అనాహారో నిరాలోకో ధనహీనో యథా ద్విజః, శేష్యే పురస్తాచ్ఛాలాయాం యావన్మే న ప్రసీదతి"** (రామా–అయో–111–14) (నాపట్ల శ్రీరాముడు అనుగ్రహించనంతవరకు ఆహారం లేనివాడు, కన్నులు లేనివాడు, ధనహీనుడైన బ్రాహ్మణునివలె, పర్ణశాలముందు శయనించి ఉంటాను) అనే రీతిలో. "శ్రీరాముని తిరిగి రాజ్యానికి పిలుచుకొని రావాలి" – అని భరతుడు "ఆ శ్రీరాముని పర్ణశాల ముందు సత్యాగ్రహాన్ని చేస్తూ, పరుండబోతున్నాను" అని పల్కి ఆ శ్రీరాముని నిర్బంధించాడు. దానిని అంగీకరించని శ్రీరాముడు (తరువాత) లంకకు పోవడంకోసం సముద్రాన్ని దాటగోరి, సముద్రంతీరంలో సముద్రుని ఉద్దేశించి శరణాగతి చేసి శయనించాడు. అదే రీతిలో, శ్రీరంగనాథుడు "సంసారులను పొందితే తప్ప ఇక్కడ నుండి లేవను" అని శయనించి ఉన్నాడు. అయితే, శ్రీరాముడు సముద్రుని శరణాగతిని చేసినా, అతడు రానందువల్ల **"చాప మానయ సౌమిత్రే! శరాం శ్చాశీవిషోపమాన్, సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవం గమాః"** (రామా–యుద్ధ–21–22) (లక్ష్మణా! వింటిని, సర్పవిషంతో సమానమైన బాణాలను తీసికొని రా. సముద్రాన్ని ఇంకింప జేస్తాను. వానరులు కాలితో నడచి లంకకు పోనీ) అనే రీతిలో అతనిపై కోపించి, బాణాలను సంధించడానికి సిద్ధపడ్డాడు. శ్రీరంగనాథుడు ఆ రీతిలో కాకుండా సంసారులను పొందడంలో తనకు గల ఆర్తిని చూపి, శరణు పొంది శయనించి ఉన్నాడు. కనుక ఆ విధంగా కోపించడు.

**(అన్దిపోల్ నిఱత్తాడైయుమ్)** సాయంసంధ్యవంటి ఎఱ్ఱని కాంతిని కల పీతాంబరం– అని భావం **"అరై చ్చివన్ద ఆడై"** (2) అని గడచిన పాశురంలో పల్కిన విషయం మనస్సులోనుండి తొలగి పోనందువల్ల తిరిగి దానినిగూర్చి పల్కుతున్నారు.

**(అదన్మేల్)** – ఆ అందానికి మించి – అని భావం. ఆ అందంనుండి వెనుదిరుగ లేనందువల్ల దానినిగూర్చి మళ్ళీ పల్కుతున్నారు.

**(అయనై పడైత్తదోర్ ఎழిలున్ది)** – భూలోకంనుండి సత్యలోకంవరకు పైన ఉండే ఏడు లోకాలను, అతలంనుండి పాతాళంవరకు కింద ఉండే ఏడు లోకాలను సృష్టించినవాడనే ప్రసిద్ధిని పొందినవాడైన బ్రహ్మ జన్మించిన చోటు – అనే ప్రసిద్ధి



పొందిన తిరునాభీకమలంలో అభినివేశాన్ని పొందిందికదా – అని భావం. సృష్టిలో ఆదికాలంలో మొదట అండాన్ని సృష్టించి, అందులో బ్రహ్మను సృష్టించినా, ఇప్పటికీ ఈ నాభిని చూచినపుడు "ఇది చతుర్ముఖుని సృష్టించిన నాభి" అని వ్యక్తం చేస్తున్నట్లున్నది.

**(ఎழిలున్ది)** – చతుర్ముఖుని సృష్టించిన తరువాత ఈ నాభి అందంలో అతిశయాన్ని పొందింది. **"మరణాంతాని వైరాణి ప్రసవాంతం చ యౌవనమ్, కుపితం ప్రణయాంతం చ యాచనాంతం చ గౌరవమ్"** (మరణంతో శత్రుత్వం తీరిపోతుంది. సంతానాన్ని పొందడంతో యౌవనం తీరిపోతుంది. కలయికతో కోపం తీరిపోతుంది. యాచనతో గౌరవం నశించిపోతుంది) అనే లోకన్యాయాన్నిబట్టి బ్రహ్మ అనే సంతానాన్ని పొందిన తరువాత స్వామి నాభియొక్క అందం తఱిగి పోవలసి ఉండగా, తద్విరుద్ధంగా దాని అందం అతిశయించింది – అని భావం.

**(అడియేన్)** – **"పతిం విశ్వస్య ఆత్మేశ్వరమ్"** (త్రైత్తి–నారా–11) (లోకానికి పతి, తనకు తానే ప్రభువైనవానిని) అని, **"యస్యాస్మి న తమంతరేమి".** (యజు. వై–3–7) (ఎవనికి నేను శేషమై ఉన్నానో ఆ భగవానుని విడచి ఉండను) అని గల ప్రమాణాలతో "నేను భగవానునకు శేషభూతుడను" అని పలుకడం లేదు. అతని అందాన్ని చూచి, దానికి జితులై, **"అడియేన్"** (దాసుడను) అని అంటున్నారు.

**(అడియన్ ఉళ్ళత్తు ఇన్ ఉయిరే)** – నా గొప్ప ఆత్మవస్తువు ఆ తిరునాభీకమలంలో అభినివేశాన్ని పొందింది – అని అంటున్నారు. ఆ రీతిలో కాకుండా, **"ఊనిల్ వాழ్ ఉయిరే"** (తిరువాయ్–2–3–1) (శరీరంలో నివసించే మనసా!) అనే సూక్తిలోవలె **"ఉయిర్"** అనే పదంతో మనస్సును నిర్దేశిస్తున్నారనికూడా చెప్పవచ్చు. శ్రీరంగనాథుని రూపసౌందర్యాన్ని తాము భోగ్యంగా అనుభవించేటట్లు చేసినందువల్ల ఆ మనస్సును **"ఇన్ ఉయిర్"** అని పొగడుతున్నారని కూడా చెప్పవచ్చు. **"తెరుడియాకిల్ నెఞ్జే! వణజ్గు తిణ్ణమ్మఱి అఱిన్దు మరుడియేలుమ్ విడేల్ కణ్డాయ్ నమ్బి పఱ్పనాబనైయే"** (తిరువాయ్–2–7–10) (ఓమనసా! అతనికి నమస్కరించు. దీనిని దృఢంగా తెలిసికో. తెలిసికొని ఒకవేళ కలత జెందినా ఆ పద్మనాభుని విడువకు) అని అంటూ మనస్సును ఉద్దేశించే "భగవానుని విడువ కూడదు" అని ఉపదేశించే నమ్మాழ్వార్లవలె. ఈ పాశురంలో, శ్రీరంగనాథునివద్ద శ్రీవేంకటేశ్వరుని స్వభావం ఉన్నది – అని చెప్పబడింది.

**4. శతుర మామదిళ్ శూழ் ఇలఙ్గైక్కిఱైవన్, తలై ప్పత్తు**
**ఉదిర వోట్టి ఓర్ వెఙ్గణై యుయ్త్తవన్ ఓదవణ్ణన్,**
**మదురమా వణ్డు పాడ మామయిలాడ అరఙ్గత్తమ్మాన్, తిరువయి**
**ఱ్ఱుదరబన్దమ్ ఎన్నుళ్లత్తుళ్ నిన్ఱులాకిన్ఱదే.**

శతురమ్ = చతురస్రమై, మా = ఎత్తైన, మదిళ్ = ప్రాకారములతో, శూழ்= చుట్టబడియున్న, ఇలఙ్గైక్కు = లంకామహానగరమునకు, ఇఱైవన్ = ప్రభువు అగు రావణుని, ఓట్టి = మొదటి దినమున జరిగిన యుద్ధములో వెనుకకు తఱిమికొట్టి, (మరునాటి యుద్ధములో), తలై పత్తు = (అతని) పది తలలను, ఉదిర = (పనసపండ్లవలె) రాలునట్లు, ఓర్ = అద్వితీయమైన (సాటిలేని), వెమ్= క్రూరమైన, కణై = బాణమును (బ్రహ్మాస్త్రమును), ఉయ్త్తవన్ = ప్రయోగించిన వాడు, (భక్తులకు విరోధినిరసనమును చేసితినను సంతోషముచే), ఓతమ్ వణ్ణన్ = సముద్రమువలె చల్లని రూపమును కలవాడై, వణ్డు = తుమ్మెదలు, మదురమా = మధురముగా, పాడ = పాడగా, (దానికి తగినట్లు), మా= గొప్ప ఱెక్కలను కల, మయిల్ = నెమళ్లు, ఆడు = నర్తించునట్టి, అరఙ్గత్తు = శ్రీరంగములో (శయనించియున్న), అమ్మాన్ = స్వామియగు శ్రీరంగనాథుని, తిరువయిఱు ఉదరబంధమ్ = నడుమునకు కట్టబడిన ఉదర బంధము (మొలనూలు), ఎన్ ఉళ్లత్తుళ్ = నా మనస్సులో, నిన్ఱు = నిలచి, ఉలాకిన్ఱదే = స్వైరవిహారము చేయు చున్నది కదా! (అని ఆనందము, ఆశ్చర్యమును)

అవ :- నాన్గామ్‌పాట్టు :- తిరునాభీకమలత్తోడే శేర్న్ద తిరువుదరబన్ధత్తై అనుభవిక్కిఱార్.

వ్యా : (శతుర మామతిళిత్యాది) కట్టళైప్పట్టిరుక్కై.

(మామతిళ్) "ఈశ్వరన్" ఎన్ఱటియ చ్చెయ్‌తే ఎతిర్‌క్క ప్పణ్ణిన మతిళ్.

(ఇలఙ్గైక్కిఱైవన్) - ముళఞ్జిలే సింహమ్ కిడన్దతు - ఎన్నుమాప్పోలే, "లఙ్కాం రావణపాలితామ్".

(ఇలఙ్గై క్కిఱైవన్) సర్వేశ్వరన్ శ్రీవైకుణ్ఠత్తై క్కలవిరుక్కైయాకక్కొణ్డు తిరిన్దాప్పోలేకాణుమ్, ఇవనుమ్ లఙ్కైక్కు ఈశ్వరన్ -ఎన్ఱిరున్దపడి. విరక్తనాన తిరువడియుమ్‌కూడ మదిత్త ఐశ్వర్యమిఱే; "యద్యధర్మో న బలవాన్ స్యాదయం



రాక్షసేశ్వరః, స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా" ఎన్ఱానిఱే. యావనొరు వనుక్కాక ఇవనై యழియచ్చెయ్య నినైక్కిఱార్, అవన్ తన్నైయే ఇవనుక్కు క్కావలాక వైప్పర్‌కిడీర్; అల్పమనుకూలిత్తానాకిల్.

(తలై పత్తుతిర)-పనఙ్గులై యుతిర్త్తాప్పోలే యుతిర. అఱుక్క అఱుక్క ముళైత్త శడక్కు.

(ఓట్టి) అనుకూలిక్కుమాకిల్ అழியచ్చెయ్యవేణ్డావిఱే- ఎన్ఱు పూశలిలే ఇళైప్పిత్తు విట్టపడి; 'గచ్ఛానుజానామి" ఎన్ఱపడియే.

(ఓర్ వెఙ్గణై యుయ్త్తవన్)- పిన్ఱై నాళై ప్పూశలిలే జయాపజయఙ్గళ్ వ్యవస్థితమన్ఱో- ఎన్ఱు బ్రహ్మాదికళ్ కరుతినవాఱే, అత్తలైక్కు వేఱ్ప్పన్ఱాన అద్వితీయమాన బ్రహ్మాస్త్రత్తై విట్టవన్. అవనై ప్రాతికూల్యత్తిల్ నిన్ఱాన్- ఎన్ఱు అఱిన్ద పిన్బు బ్రహ్మాస్త్రత్తై విట్టపడి.

(ఓతవణ్ణన్) రావణవధమ్ పణ్ణి, శ్రీవిభీషణాழ்వానుక్కు ముడికొడుత్తు కృతకృత్యనాయ్, బ్రహ్మాదికళ్ పుష్పవృష్టియుమ్, స్తోత్రముమ్ పణ్ణిన వీరశ్రీ తోన్ఱ శ్రమహరమాన వడివోడే నిన్ఱనిలై.

(మతురమా వణ్డు పాడ) వినై యన్ఱవాఱే ఆడల్ పాడలుక్కు ఇడమ్ కొడుత్తపడి. శిలర్ పాడినాల్ ఆడువారుమ్ వేణుమే; మయిల్‌కళ్ ఆడప్పుక్కన.

(మామయిల్) ఒరు మయిల్ తోకై విరిత్తాల్ తిరుచ్చోలైక్కు అణుక్క విట్టాప్పోలేయిరుక్కై. ఋషికళ్ కొణ్డక్కోల్ కొణ్డాడుకై తవిర్న్దు మయిల్‌కళ్ ఆడప్పుక్కతు. కురఙ్గుకళ్ కూత్తాట్టాతల్. ఎన్ఱుమ్ తిర్యగ్యోనికళుక్కు నిలమాకై.

(వణ్డు పాడ మామయిలాడ) శ్రీవైకుణ్ఠనాథన్ పెరుమాళానవాఱే నిత్యసూరికళుమ్, వణ్డుమ్ మామయిల్‌కళుమానపడి. "సర్వైః పరివృతో దేవైః వానరత్వ ముపాగతైః" ఎన్నక్కడవతిఱే. రాజా వెళ్ళి చ్చుట్టై యిట్టాల్ అడియార్ కళుప్పు చ్చుట్టై యిడుమిత్తనైయిఱే.

(అరఙ్గత్తమ్మాన్)-పెరియకోయిలిలే కణ్వళర్‌కిఱ పరమశేషియుడైయ.

(తిరువయిఱ్ఱుదరపన్దమ్) ఆభరణత్తుక్కాభరణమ్. పెన్ఱ వయిఱ్ఱుక్కు ప్పట్టమ్ కట్టినపడి.

(ఎన్నుళ్ళత్తుళ్ నిన్రులాకిన్రతే) ఎన్నెఞ్జినుళ్ళే అழகు శెణ్డేఱానిన్రతు. నెఞ్జమ్ నాడితే; అకల నిన్రాలుమ్ పశైయిల్లై.

ఇప్పాట్టిల్ - దశరథాత్మజన్ పడియుమ్ ఇజ్జే యుణ్డు - ఎన్గిఱార్.

## అరుమ్బదమ్

*నాలామ్ పాట్టు : (శతుర మిత్యాది), (కట్టళై ప్పాడు) దుర్గమ్ శువర్ అణైయోడే కూడియిరుక్కై. గిరిదుర్గమ్, వనదుర్గమ్, జలదుర్గమ్- ఆక, దుర్గత్రయమ్. అవన్ మనుష్యనానాల్ ఇవర్కళ్ తిర్యక్కాక వేణ్డువానెన్? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్. (రాజేత్యాది).*

*(పెఱ్ఱ వయిఱు) అయనై ప్పడైత్తదు. (అకల నిన్రాలుమ్) తామ్ అకలనిన్రాలుమ్ ప్రయోజనమిల్లై. అజ్గుమ్ వన్దు సంచరిక్కుమెన్రపడి.*

**నాల్గవ పాశురం :- అవతారిక :** గడచిన పాశురంలో ఆழ్వార్లు తిరునాభీకమలాన్ని దర్శించి ఆనందించారు. దానితో చేరి ఉండే ఉదరబంధం అనే ఆభరణాన్ని ఈ పాశురంలో దర్శించి ఆనందిస్తున్నారు.

**వ్యాఖ్యానమ్ : (శతుర మామదిళ్ శూழ் ఇలజ్గై)** చతురంగా ఉండే దుర్గాలతో చుట్టూ కట్టుబాటు చేయబడిన లంక.

**(మామదిళ్)** – (1) సముద్రం, (2) అరణ్యాలు, పర్వతాలు నిండిన ప్రదేశం, (3) ప్రాకారం – అనే మూడు దుర్గాలను – రక్షణ కవచాలను – తలచి **"మామదిళ్"** అని అంటున్నారు. శ్రీరాముని వీర్యాన్ని చూచినపుడు **"ఇతడు నారాయణుడే"** అని తెలిసిన తరువాత కూడా ఆ దుర్గాలను నమ్మి, అతనిని ఎదిరించాడే రావణుడు ఎంత మూర్ఖుడు! – అని భావం.

**(ఇలజ్గైక్కిఱైవన్)** – ఇటువంటి ప్రాకారాలను కల లంకలో రాజ్యాన్ని చేసే రావణుని ఈ ప్రయోగం తెల్పుతున్నది. గుహలో సింహం ఉండే రీతిలో **"యథా రాఘవ నిర్ముక్తః శరః శ్వసనవిక్రమః, గచ్ఛే త్తద్వద్గమిష్యామి లంకాం రావణ పాలితామ్"** (రామా–సుందర–1–34) (శ్రీరామునిచే విడువబడినది, శ్వాసవాయువు వలె మిక్కిలి వేగంగా పయనించేది అయిన బాణం ఏవిధంగా పోతుందో, రావణునిచే రక్షింపబడే లంకను ఆ రీతిలోనే నేను చేరగలను) అని హనుమానుడు పల్కినట్లే, లంకకు ప్రభువు – అని అంటున్నారు.



**(ఇలజ్గైక్కు ఇఱైవన్)** – సర్వేశ్వరుదు ఉభయవిభూతులను పాలించడానికి శ్రీ వైకుంఠాన్ని తనకు భోగ్యమైన కొలువుమండపంగా చేసికొని వేంచేసి ఉండేటట్లే, ఇతడు (రావణుడు) కూడా లంకకు ప్రభువుగా ఉన్నాడు. ఏవిధమైన లౌకిక విషయసంగం లేని హనుమంతుడు కూడా **"యద్యధర్మో న బలవాన్ స్యాదయం రాక్షసేశ్వరః, స్యాదయం సర్వలోకస్య సశక్రస్యాపి రక్షితా"** (రామా–సుందర–49–17) ఇతడు చేసిన అధర్మం బలమైనది కాకపోతే, రాక్షస ప్రభువుగా ఉండి ఉండవచ్చు, ఇంద్రునితో కూడిన దేవలోకానికి ప్రభువుగాకూడా ఉండి ఉండవచ్చు) అని భావించాడుకదా!

**(ఇఱైవన్)** – రావణుడు ఏ కొంచెం అయినా అనుకూలుడై ఉంటే, వధించ దలచిన అతనినే ఈ లంకకు కావలివానిగా (రక్షకునిగా) శ్రీరాముడు చేసి ఉండేవాడు.

**(తలై పత్తుదిర)** తాటిగెలను కోసి కిందకు పడవేసినట్లుగా రావణుని పది శిరస్సులను ఖండించి కింద పడేటట్లు తోసి – అని అర్థం. శిరస్సులను ఖండించగా ఖండించగా "మళ్ళీ మళ్ళీ మొలుస్తాయి"– అనే వరాన్ని రావణుడు పొందినందువల్ల, తాటి గెలలను కోసి కింద పడవేసినట్లుగా రావణుని శిరస్సులను ఖండించిన వేగం దీనిచే తెలుపబడింది.

**(ఓట్టి)** ఈ విధంగా మొలిచే తలలను ఖండించే క్రీడలో ఆసక్తిని కల్గి కాలక్షేపం (ఆలస్యం) చేయడంలోని భావం ఏమంటే – అపుడైనా రావణుడు అనుకూలుడైతే ఇతనిని వధించనక్కరలేదు కదా– అనే భావంతో ఈ విధంగా ఆలస్యం చేశాడు. **"గచ్ఛానుజానామి రణార్దిత స్త్వం ప్రవిశ్య రాత్రించరరాజ! లంకామ్, ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః"** (రామా–యుద్ధ–59–144) (రాక్షసరాజా! నీవు యుద్ధంలో బాగా అలసిపోయావు. ఇపుడు తిరిగి వెళ్ళిపో. నీకు అనుమతిని ఇస్తున్నాను. లంకలోకి పోయి, శ్రమను తీర్చుకొని, రథాన్ని, వింటిని కలవాడవై తిరిగి రా. రథంలో ఉన్నవాడవై అపుడు నా బలాన్ని చూస్తావు) అనే శ్లోకంలో ఇతని ఈ అభిప్రాయం వ్యక్తమవుతున్నది.

**(ఓర్ వెఴ్కాణై ఉయ్‌త్తవన్)** – “ఈ విధంగానే ఆలస్యం చేసి యుద్ధాన్ని ఇంకా ఇంకొక దినం కొనసాగిస్తే అపుడు జయాపజయాలు ఏవిధంగా ఉంటాయో చెప్పడానికి వీలు కాదు” అని బ్రహ్మ మొదలైనవారు అనగానే, ఆ శిరస్సులకు మూలాధారమైన హృదయంలో సాటి లేని బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి అతనిని వధించడాన్ని దీనితో తెల్పుతున్నారు. అతడు చివరివరకు ప్రత్యర్థిగానే ఉన్నాడు – అని తెలిసిన పిమ్మటనే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి అతనిని వధించాడు.

**(ఓదవణ్ణన్)** – రావణుని వధించి శ్రీవిభీషణా*ఴ్*వాన్‌కు లంకను ఇచ్చి, తాను చేయ దలచినదానిని అంతటిని చేసి ముగించినవాడై, బ్రహ్మ మొదలైనవారు పుష్పవృష్టిని కురిపించి స్తుతించే రీతిలో, తాను అపజయం లేని అద్వితీయవీరుడు– అనేది స్ఫురించేటట్లుగా, తనను దర్శించినవారి శ్రమ అంతా తీర్చే సముద్రంతో పోలిన తిరుమేనితో నిలచిన సన్నివేశాన్ని దీనిద్వారా తెల్పుతున్నారు.

**(మదురమా వణ్డు పాడ)** – చేయవలసిన కార్యాన్ని చేసి ముగించిన తరువాత, తాను చక్రవర్తి అయినందువల్ల ఆటపాటలకు అవకాశం ఇచ్చాడు. కొందఱు పాడితే, మఱికొందరు ఆడేవారుకూడా కావాలికదా! తుమ్మెదలు పాడగా, నెమళ్ళు ఆడడం ఆరంభించాయి.

**(మామయిల్)** – ఒక నెమలి పింఛాన్ని విప్పితే ఆ నందనవనానికి అంతటికీ గొడుగు విస్తరించినట్లుగా ఉండే అవధిలో పెద్ద పించాన్ని కల గొప్ప నెమళ్ళు. ఋషులు ఆడించే కర్రను తీసికొని ఆడించగా ఆడడం మాని, నెమళ్ళు (తామే) ఆడడం ఆరంభించాయి. జంతువులైన వానరాల నాట్యం, నెమళ్ళ నాట్యంతో కూడినది శ్రీరంగదివ్యక్షేత్రం.

**(వణ్డు పాడ మామయిలాడ అరఙ్గత్తమ్మాన్)** శ్రీవైకంఠనాథుడు పెరియ పెరుమాళ్ (శ్రీరంగనాథుడు)గా ఇక్కడకు రాగా నిత్యసూరులు తుమ్మెదలుగా, నెమళ్ళుగా రూపొందారు. **“మానుషం వపురాస్థాయ విష్ణు స్సత్యపరాక్రమః, సర్వైః పరివృతో దేవైః వానరత్వముపాగతైః”** (రామా–యుద్ధ–114–7) (సత్యమైన పరాక్రమాన్ని కల విష్ణువు మానవరూపాన్ని ధరించి, వానరరూపాలను పొందిన దేవతలందఱితో కూడినవాడై నిన్ను వధించాడు) అనే రీతిలో శ్రీరామావతారంలో దేవతలందఱు వానరులుగా రూపొందారుకదా. ప్రభువు తెల్లని కంచుకాన్ని ధరించి,



వేటకు పోతే, అతని అనుచరులు నల్లని చొక్కాలను ధరించి అతనిని అనుసరించరు కదా (వారుకూడా తెల్లని కంచుకాన్నే ధరించి అనుసరిస్తారు.)

**(అరఙ్గత్తమ్మాన్)** – శ్రీరంగదివ్యాలయంలో శయనించి ఉండే సర్వస్వామి అయిన శ్రీరంగనాథుని – అని భావం.

**(తిరువయి*ఱ్ఱు*దరబందమ్)** – ఉదరంలోని **“ఉదరబంధమ్”** అనే ఆభరణాన్ని ధరించి ఉండడం ఆభరణానికి ఆభరణం పెట్టినట్లుగా ఉంటుంది. లోకాన్ని అంతటిని ప్రసవించిన ఉదరానికి పట్టం కట్టినట్లుగా ఈ ఆభరణం ఉన్నది.

**(ఎన్ ఉళ్ళత్తుళ్ నిన్ఱులాకిన్ఱతే)** – నా మనస్సులో తన అందం స్ఫురించేటట్లు విహరిస్తున్నది. **“నెఞ్జమ్ నాదు కుడి కొణ్డాన్”** (తిరువాయ్–8–6–4) (నా మనస్సులో నివాసాన్ని పొందాడు) అని నమ్మా*ఴ్*వార్లు కూడా అనుగ్రహించారు కదా!

ఈ పాశురంలో, దశరథచక్రవర్తి కుమారుడైన శ్రీరాముని స్వభావం శ్రీరంగనాథునకు ఉన్నదని తెలిపారు.

**5. పారమాయ ప*ఴ*వినై ప్ప*ఱ్ఱ*అఱుత్తు, ఎన్నై త్తన్**
**వారమాక్కి వైత్తాన్ వైత్తతన్ఱి ఎన్నుళ్ పుకున్దాన్,**
**కోర మాతవమ్ శెయ్‌దనన్‌కొల్? అఱియేన్ అరఙ్గత్తమ్మాన్, తిరు**
**వారమార్బతన్ఱో అడియేనై యాట్కొణ్డదే.**

పారమాయ = మిక్కిలి భారమై, ప*ఴ* వినై = అనాదికాలముగా ఆర్జించిన పాపములను, ప*ఱ్ఱు* అఱుత్తు = సవాసనగా పోగొట్టి, ఎన్నై= పాపములకు ఆకరమైన నన్ను, తన్ = తన విషయములో, వారమాక్కి వైత్తాన్ = పక్షపాతమును (ప్రావణ్యమును) కల్గియుండునట్లుచేసెను, వైత్తతన్ఱి =అట్లు ప్రావణ్యమును కల్గియుండునట్లు చేయుటయే గాక, ఎన్నుళ్ = నా హృదయములో, పుకున్దాన్= ప్రవేశించెను, (ఇట్లు ప్రవేశించుటకు మూలముగా), కోరమ్ = ఇంద్రియములను శ్రమింపచేయతగిన, మా తవమ్ శెయ్‌తనన్ కొల్ = గొప్ప తపస్సును చేసితినా? ఏమి?, అఱియేన్ = తెలియను, అరఙ్గత్తు = శ్రీరంగమున శయనించియున్న, అమ్మాన్ = సర్వస్వామియైన, శ్రీరంగనాథునియొక్క, తిరు = లక్ష్మీదేవిని, ఆరమ్ = ముత్యాల హారమును కల్గిన, మార్బు అతన్ఱో = ఆ వక్షఃస్థలముకదా, అడియేనై =

స్వామి సౌందర్యమున ప్రావణ్యమును కల దాసుడనగు నన్ను, ఆళ్ కొణ్డతు= దాసునిగా గ్రహించినది! ఏ = ఆశ్చర్యము.

అవ : అళ్ఞామ్బొట్టు. ఎనక్కు ప్పన్ఱ్ఱాశాన పెరియ పిరాట్టియార్ ఇరుక్కిఱ తిరుమార్ పుకిడీర్, ఎన్నై స్వరూపానురూపమాన కైఙ్కర్యమ్ కొణ్డతు - ఎన్గిఱార్.

వ్యా : (పార మాయ) సర్వశక్తియాన సర్వేశ్వరనే తళ్ళుమిడత్తిలుమ్ ఒరు నిలైనిన్ఱు తళ్ళ వేణ్డుమ్బడియిరుక్కై. సంహరిప్పతుమ్ నరకత్తిలేయాయ్, సృష్టిప్పతుమ్ నరకత్తిలేయాయిరుక్కై.

(పఴ వినై) - కాల మనాది; ఆత్మావో నిత్యః; అచిత్సంసర్గము మన్ఱే యుణ్డిఱే. ఇక్కాలమెల్లామ్కూడ క్కూడుపూరిత్తతాయిరుక్కుమిఱే. "సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి" ఎన్ఱవన్ఱానే తళ్ళవేణ్డుమ్బడి యిరుక్కై.

(పఱ్ఱఱుత్తు) -విరకరాయిరుప్పార్ అడి యఱుత్తు నెడుఙ్జువర్ తళ్ళుమాప్పోలే, సవాసనమాక ప్పోక్కి, నిత్యసూరికళుక్కు పాపశఙ్కై యుణ్డాకిలుమ్, ఇవర్క్కు ఇల్లాతపడి పణ్ణి.

(ఎన్నై) - పాపత్తుక్కు ప్పోక్కడి అఱియాత ఎన్నై. పాపమ్ పడుమ్ ఆకరమాన ఎన్నై- ఎన్ఱుమామ్. "అఘమహోదధిః"

(తన్‌వారమాక్కి వైత్తాన్)- "తాన్" ఎన్ఱాల్ పక్షపతిక్కుమ్బడి పణ్ణినాన్. ఎన్ కార్యమ్ తనక్కు క్కూఱాక ఎన్ పేరిలే తనక్కు ఇరుప్పెన్ఱు తన్పేరిలే ఎనక్కిరు ప్పాక్కినపడి. అన్ఱియే, విషయాన్తరఙ్గళై విట్టు త్తన్నైయే కూఱాక ప్పఱ్ఱుమ్బడి పణ్ణినాన్.

(వైత్తాన్) ఇచ్చన్దానచ్చాపమ్ వైత్తాన్.

(వైత్తతన్ఱి) - సన్తానపరమ్బరైయిన్ నమ్మైకళుక్కుమేలే.

(ఎన్నుళ్ పుకున్దాన్) పిన్నైయుమ్ తన్నాఱ్ఱామైయాలే, విడాయ్త్తవన్ తటాకత్తై నీక్కి ఉళ్ళే ముఴుకుమాప్పోలే, ఎన్నుళ్ళుమ్బుకున్దాన్. వాలి పుక్కవిడత్తే మలైయిట్టడైత్తు, మహారాజరిరున్దు కుఱుమ్బు శెలుత్తు మాప్పోలే యాకవొణ్ణాదు- ఎన్ఱు తన్ స్వరూప జ్ఞానమ్ కులైయాతపడి ఎన్నెఞ్జిలే వన్దు పుకున్దాన్. "అనశ్నన్నన్యః"



ఎన్గిఱపడియే ఇత్తోడొట్టాయిరుక్కు మవనుక్కు ఇత్తాలల్లతు శెల్లుకిఱతిల్లై - ఎన్గిఱతు.

(కోరమాతవ మిత్యాది) - ఇప్పేఱ్ఱుక్కడి ఎన్? ఎన్ఱు పార్త్తాల్ ఇన్ద్రియఙ్గళై యొఱుత్తు మహాతపస్సై ప్పణ్ణినేనో? అఱికిఱిలేన్; నానఱియ ఒన్ఱు మిల్లై.

ఇప్పడి శఙ్కిప్పానెన్? ఎన్న; పెఱ్ఱ పేఱు అప్పడిప్పట్టార్క్కు కిడైక్కు మత్తాకైయాలే. అవన్దాన్ నదీతీరత్తిలే కిడన్దు తపస్సు పణ్ణినానో? అఱికిఱిలేన్. కోరమా తపస్సాకిఱతు - అత్తలైక్కాక త్తమ్మై యఴియమాఱిన పెరియ వుడైయారైప్పోలే యిరుక్కై. "ఎన్నన్ఱి శెయ్‌తేనా ఎన్నెఞ్జిల్ తికఴ్‌వతువే" ఎన్నుమాప్పోలే.

(అరఙ్గత్తమ్మాన్) ఇప్పేఱ్ఱుక్కు ఆఱ్ఱఙ్గరైయై ప్పఱ్ఱి క్కిడన్దు తపస్సు పణ్ణినానుమ్ అవనాయిరున్దతు. ఇచ్చీరియ పేఱ్ఱుక్కు వేఱు ఉపాయ ముణ్డాక మాట్టాతే.

(తిరువారమార్పదన్ఱో)- పెరియపిరాట్టియారైయుమ్, హారత్తైయు ముడైత్తాన తిరుమార్వన్ఱో. తమక్కు పఱ్ఱాశాక త్తాయ్ నిఴలిలే ఒతుఙ్గుకిఱార్. ఇవనై క్కుఱిత్తు, "తేన మైత్రీ భవతు" ఎన్ఱుమ్, అవనై క్కుఱిత్తు "న కశ్చిన్నాప రాధ్యతి" ఎన్ఱుమ్ శిఱైయిలే యిరున్దే శేరవిడప్పార్కిఱవళ్. మార్పిలే యిరున్దాల్ శేరవిడ చ్చొల్లవేణుమో? అఴకియ మార్విల్ ఆరమ్. హారత్తుక్కు అఴకు కొడుక్కవఱ్ఱాయిరుక్కై. అరమ్ అఴకై మఱైక్కక్కుడలా మిత్తనైయిఱే. "సర్వభూషణభూషార్హాః" ఎన్నుమాప్పోలే.

(అడియేనై) మున్బెల్లామ్ కూలి చ్చేవకరైప్పోలే అఴకుక్కు త్తోఱ్ఱ అడిమై; ఇతు పిఱన్దుడైయ అడిమై. మున్దుఱ "దూతో రామస్య" ఎన్ఱవన్, పిరాట్టి కటాక్షమ్ పెఱ్ఱవాఱే, "దాసోஉహం కోసలేన్ద్రస్య" ఎన్ఱానిఱే.

(ఆళ్‌కొణ్డతు) ఇఴన్ద శేషత్వత్తై త్తన్దతు.

(అడియేనై యాట్కొణ్డతే) - రాజ్యమిఴన్ద రాజపుత్రనై ముడిశూట్టు వారైప్పోలే, అఴకిలే యఴిన్దు ఎన్నై అవన్ గుణఙ్గిడీర్ పిఴైప్పిత్తతు - ఎన్గిఱార్.

అఴ్గకిలే అఴ్గున్దినారై గుణత్తై క్కాట్టి ప్పిఴైప్పిక్కలామ్. గుణత్తిలే యఴ్గున్దినార్క్కు గుణమే వేణుమ్. నీరిలే యఴ్గున్దినార్క్కు నీరైయిట్టు, ప్పిఴైప్పిత్తు విడుమిత్తనైయన్డో ఉళ్ళతు.

ఇప్పాట్టాల్- అన్తర్యామిబ్రాహ్మణత్తిలే శొల్లుకిఱపడియే సర్వవ్యాప కత్వ శక్తియుమ్ ఇఙ్గే యుణ్డు ఎన్గిఱార్.

## అరుమ్బుదమ్

*అఙ్గామ్ పాట్టు : (పారమాయ ఇత్యాది) (పారమాయ) వినైయినుడైయ బాహుళ్యమాదల్; క్రౌర్యమాదల్. ఇవఱ్ఱై వాక్యద్వయత్తాలే అరుళిచ్చెయ్‌కిఱార్. (సర్వశక్తీత్యాది) పఴమై ఏదు? ఎన్న, అరుళిచ్చెయ్ కిఱార్ (ఆత్మా ఇత్యాది) వారమ్ - స్నేహమాదల్, కడమైయాదల్. ఇవనిఱుక్కు మిఱైయై త్తాన్ ఇఱుక్కిఱేన్- ఎన్ఱు తన్ పేరిలే ఏఱిట్టుక్కొళ్ళుకై.*

*(శాపమ్) కుట్టి. శత్రుక్కళ్. విరోధికళై అఴ్గిక్కుమెన్ఱు సంతానత్తుక్కు ఒరు కుట్టి వైక్కుమాప్పోలే, ఎన్ విరోధియై ప్పోక్కి, స్వరూపమ్ నశియాదపడి వైత్తాన్- ఎన్ఱపడి. తిరు - అఴ్గకాకవుమామ్. 'సౌందర్య మంతరాయమ్" (ముముక్షుప్పడి-182) ఎన్గిఱపడియే కైంకర్యవిరుద్ధమాన అఴ్గకిలే ~~ఈ~~డుపట్ట ఎన్నై, శ్రియఃపతిత్వ గుణత్తై క్కాట్టి మీట్టాప్పోలే, శ్రియఃపతిత్వగుణత్తిలే అకప్పట్టారై సౌందర్యమాకిఱ అఴ్గకైక్కాట్టి మీట్కలాకాదో? ఎన్న, "మార్బదన్డో!" ఎన్ఱ ఉఱైప్పై ప్పఱ్ఱ అరుళిచ్చెయ్‌కిఱార్ (అఴ్గకిలే అఴ్గున్దినార్ ఇత్యాది).*

**అయిదవ పాశురం : అవతారిక :** నాకు ఆలంబనమైన (పట్టుకొమ్మ అయిన) లక్ష్మీదేవి అధివసించి ఉండే వక్షఃస్థలంకదా, నన్ను, నా స్వరూపానికి తగిన కైంకర్యాలను గ్రహించింది – అని ఇందులో అంటున్నారు.

**వ్యాఖ్యానమ్ – (పారమాయ) –** గొప్ప భారంగా ఉండే – అని అర్థం. సర్వ శక్తిని కల సర్వేశ్వరుడు పోగొట్టినా చాలా ప్రయత్నించి పోగొట్టవలసిన స్థితిలో



నా (పాపం) ఉన్నదని అంటున్నారు. నరకంలో ఒక జన్మ ముగియగానే, అక్కడే ఇంకొక జన్మను ఎత్తే రీతిలోని గొప్ప పాపం – అనికూడా భావం.

**(పఴవినై)** – ఇతడు (జీవుడు) కర్మలను చేయడం ఆరంభించిన కాలం మొదలును చూచి తెలిసికోవడానికి వీలు లేనిదై, అనాదియై ఉన్నది. ఆత్మకూడా నిత్యంగా ఉండేవాడు. అతనికి అచేతనమైన దేహంతో సంబంధం అనాదిగా ఉన్నది. ఈ విధంగా అనాదిగా అంతు లేని కాలం అంతా ఇతడు పాపాలను చేస్తున్నందున **"పఴవినై"** అని అంటున్నారు. **"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"** (గీత–18–66) (ఫలసాధనాలైన అన్ని ధర్మాలను సవాననగా విడిచిపెట్టి, నన్ను ఒక్కని మాత్రమే ఉపాయంగా ఆశ్రయించు. నేను నిన్ను అన్ని పాపాలనుండి విముక్తుని చేస్తాను. శోకించకు) అనే చరమశ్లోకంలో అన్ని పాపాలనుండి విడిపిస్తాను – అని పల్కిన ఆ భగవానుడే బలవంతంగా గెంటవలసిన రీతిలో ఉండే స్థితిని తెల్పుతున్నారు.

**(పఱ్ఱఱుత్తు)** – గోడను పడదోయడంలో నేర్పును కలవారు. ఆ గోడ మూలభాగంలో పల్లంగా తవ్వి పెద్ద పెద్ద గోడలను సైతం గెంటి పడదోసినట్లే, నా పాపాలను సవాననగా పోగొట్టి – అని భావం. **"అఱుత్తు"** అని అన్నందువల్ల నిత్యసూరులకు పాపం ఉంటుందా? అనే సందేహం కలిగేటట్లే, అనాదికాలంగా పాపంతో కూడిన వీరికి కూడా పాపం ఉన్నదా? అని సందేహపడనక్కరలేనట్లుగా చేశాడు– అని భావం.

**(ఎన్నై)** – పాపాన్ని పోగొట్టుకొనే దారిని తెలియని నన్ను – అని భావం. పాపాలకు అన్నిటికి ఆశ్రయమైన నన్ను – అని కూడా చెప్పవచ్చు. **"అఘమహోదధిః"** అనే రీతిలో పాపానికి అద్వితీయమైన మహాసముద్రం – అని చెప్పే రీతిలో ఉండే నన్ను.

**(తన్ వారమాక్కి వైత్తాన్)** తనపట్ల అభినివేశం కలిగి ఉండేటట్లుగా నన్ను చేశాడు. నా పాపాలను పోగొట్టడానికి తాను బాధ్యతను గ్రహించినట్లే, నా అన్ని బాధ్యతలను తనవిగా గ్రహించి, తనవద్ద అణగి ఉండేవానినిగా, తనకు అధీనుడనై ఉండేవానినిగా నన్ను చేశాడు – అని చెప్పవచ్చు. లేక, ఇంతకాలం అన్యవిషయాలను ఆశ్రయించి తిరిగిన నన్ను, వాటిని విడచి, వాటి స్థానంలో తననే ఆశ్రయించేటట్లు చేశాడు – అని కూడా చెప్పవచ్చు.

**(వైత్తాన్)** – కుమారుడు తన తండ్రికి, అతని సొత్తులో భాగాన్ని కల్గిన సంతతి అయినట్లే, నన్ను తనకు సంతతిగా చేశాడు.

**(వైత్తన్ని)** – ఇంత అవధిలో హితాలను నాకు చేయడమే కాకుండా, దానికి మించి.

**(ఎన్నుళ్ పుకున్దాన్)** – తాపంతో బాధపడేవాడు మడుగులో మునిగి స్నానం చేసేటట్లే, నా మనస్సులో ప్రవేశించాడు – అని భావం. దుందుభిని చంపడం కోసం వాలి ఒక గుహలోపలకు ప్రవేశించిన తరువాత, సుగ్రీవుడు ఆ గుహ ముఖద్వారంలో ఒక కొండ తెచ్చి అడ్డంగా పెట్టి, (కిష్కింధను) పాలించినట్లుగా కాకూడదు – అని నా స్వరూపజ్ఞానం నశించని రీతిలో నా మనస్సులోకి వచ్చి ప్రవేశించాడు. **"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి"** (ముండక-3-1-1) (జ్ఞానమనే రెక్కలను కల్గినవి, సమానమైన గుణాలను కల్గినవి, ఎల్లప్పుడు కలసి ఉండేవి అయిన రెండు పక్షులు (జీవాత్మ – పరమాత్మలు) ఒకే వృక్షాన్ని (దేహాన్ని) ఆశ్రయించి ఉన్నాయి. వాటిలో ఒకటి, (జీవుడు) పండిన పండును (పక్వమైన కర్మఫలాన్ని) భుజిస్తున్నది. ఇంకొక పక్షి, (పరమాత్మ) ఆ పండును భుజించకుండా ప్రకాశిస్తున్నది) అని ఉపనిషత్తులో పల్కిన రీతిలో, నా కర్మఫలాలలో సంబంధం లేని అతడుకూడా నన్ను విడువలేనట్లుగా అయినాడు.

**(కోర మాతవమ్ శెయ్‌దనన్‌కొల్! అడియేన్)** – ఇంత అవధిలో గొప్ప ప్రయోజనం నాకు సిద్ధించడానికి కారణం ఏమి? అని గమనిస్తే, ఇంద్రియాలను అణచి నేను గొప్ప తపస్సును చేసి ఉండాలి – అని చెప్పడానికి వీలు లేదు. నాకు తెలిసి అటువంటిది ఏదీ లేదు. ఆ విధంగా ఏమీ లేకపోతే ఈ విధంగా సందేహపడడానికి ఏమి కారణం? అని అంటే, నేను పొందిన గొప్ప ఫలం గొప్ప తపస్సును వేసినవారికే లభించదగినది కనుక, **"శెయ్‌దనన్‌కొల్!"** అనేది "నేను చేశానా!" అనే అర్థాన్ని ఇస్తుంది. లేక, "అతడు చేశాడా?" అనే అర్థాన్ని గ్రహించి, భగవానుడు స్వయంగా తానే కావేరీ నదీతీరానికి వచ్చి నిలచి, నన్ను పొందడంకోసం తాను తపస్సు చేశాడా! అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. ఘోరమైన తపస్సు అంటే – శ్రీరామునికోసం తన ప్రాణాలనే ఇచ్చిన జటాయువుయొక్క కృత్యంవలె ఉండడం. **"ఎన్నన్ని శెయ్‌దేనో ఎన్నెఞ్జిల్ తికழ్వదువే!"** (తిరువాయ్-10-6-8) (ఏమి మంచిని చేశానోకదా! నా మనస్సులో స్వామి ప్రకాశించడానికి) అని పల్కిన నమ్మాழ్వార్ల వలె పల్కుతున్నారు.



**(అరఙ్గత్తమ్మాన్)** – ఈ ప్రయోజనానికి నదీతీరంలో ఉండి తపస్సు చేసినవాడు కూడా అతడే – అని పల్కడమే తగినదిగా ఉన్నది. ఇంత గొప్ప ప్రయోజనంకోసం నేను ఇంకొక ఉపాయానుష్ఠానాన్ని చేశానని చెప్పడానికి వీలు లేదుకదా!

**(తిరువార మార్బు అదన్రో) "తిరు"** అని చెప్పబడే లక్ష్మీదేవిని, హారాలను కల్గిన వక్షఃస్థలం కదా – అని అర్థం. తమకు ఆశ్రయభూమిగా తల్లినీడలో ఒదిగి ఉండేటట్లు లక్ష్మీదేవియొక్క వాసస్థానంలో ఒదిగి ఉన్నారు. ఆ లక్ష్మీదేవి **"విదితస్స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః, తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి"** (రామా-సుందర-21- 20) (రావణా! శ్రీరాముడు ధర్మాన్ని తెలిసినవాడుగా, శరణు పొందినవారిపట్ల వాత్సల్యాన్ని కలవాడుగా ప్రసిద్ధుడు. నీవు జీవించాలని అనుకొంటే అతనితో స్నేహం చేయి) అని చేతనుని ఉద్దేశించి, **"న కశ్చిన్నాపరాధ్యతి"** (రామా-యుద్ధ-116-44) (అపరాధం చేయనివాడు ఎవడూ లేడు) అని సర్వేశ్వరునిగూర్చి ఉపదేశించి, ఇద్దఱిని కలుపుతున్నది కదా! అశోకవనంలో చెఱలో ఉన్నప్పుడే ఇద్దఱిని (జీవేశ్వరులను) చేర్చే పురుషకార కృత్యాన్ని చేసిన సీతాదేవి స్వామి వక్షఃస్థలంలో ఉండేటపుడు ఈ పురుషకార కృత్యాన్ని చేస్తున్నది – అనే విషయాన్ని చెప్పవలసి ఉన్నదా? అందమైన వక్షస్సులో హారం – అనే అర్థాన్నికూడా చెప్పవచ్చు. వక్షస్సులోని అందం హారానికికూడా అందాన్ని కలుగజేసేదై ఉన్నది. గమనిస్తే హారం వక్షఃస్థలాన్ని అందాన్ని కలుగజేయడం లేదు. వక్షస్సులోని అందానికి దృష్టి దోషం సోకకూడని రీతిలో మఱుగుపరచడంకోసమే తగినదిగా ఉంటుంది – అని భావం. **"ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః, సర్వభూషణ భూషార్హాః కిమర్థం న విభూషితాః"** (రామా-కిష్కింధ-3-15) (చాలా విశాలమైనవి, గుండ్రంగా సుడులు తిరిగి ఉన్నవి, పరిఘలవలె ప్రకాశిస్తున్నది, అన్ని ఆభరణాలను అలంకరించదగినవి – అంటే, శోభను కల్గించగల్గినవి – అయిన నీ బాహువులు ఎందువల్ల అలంకరింపబడకుండా మఱుగుపరచబడ్డాయి) అని చెప్పబడింది కదా!

**(అడియేనై)** – పూర్వం, ఎల్లప్పుడు కూలిని తీసికొని సేవను చేసేవారివలె, అతని అందానికి జితులై దాసులైన క్రమం తెలుపబడింది. ఇక్కడ, **"అడియేన్"** అని అంటూ జన్మసిద్ధమైన దాస్యాన్నిగూర్చి తెలుపబడుతున్నది. హనుమానుడు

సీతాదేవికటాక్షాన్ని పొంతదానికి ముందు **"వానరోఽహం మహాభాగే! దూతో రామస్య ధీమతః, రామనామాంకితం చేదం పశ్య దేవ్యంగులీయకమ్"** (రామా-సుందర- 36-2) (మంగళకరురాలవైన సీతాదేవీ! బుద్ధిమంతుడైన శ్రీరాముని దూతనైన వానరుడను నేను. శ్రీరాముని పేరు చెక్కబడిన అంకితమైన ఈ ఉంగరాన్ని చూడు) అని రామదూతను - అని అంటూ తనను పరిచయం చేసికొన్న హనుమానుడు, సీతాదేవి కటాక్షాన్ని పొందిన వెంటనే **"దాసోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః, హనూమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః"** (రామా-సుందర-42-34) (అవలీలగా కార్యాలను చేయగల్గినవాడు, కోసలదేశానికి ప్రభువు అయిన శ్రీరాముని దాసుడనై, శత్రుసైన్యాలను వధింప జేసేవాడనై, వాయుపుత్రుడనైన హనుమానుడను నేనే) అని తనను శ్రీరామునకు దాసుడనని నిర్దేశించుకొన్నాడుకదా!

**(ఆట్కొణ్డదు) - "తిరువార మార్బు"** అనాదికాలంగా నేను కోల్పోయిన దాస్యాన్ని ఇచ్చింది.

**(అడియేనై ఆట్కొణ్డదే)** - రాజ్యాన్ని కోల్పోయిన రాజపుత్రుని పిలచి, పట్టాభిషేకం చేసేటట్లుగా, అనాదికాలంగా స్వామి శ్రీచరణాలను శిరస్సుపై అలంకరించుకొనే రాజ్యాన్ని కోల్పోయిన నన్ను ఆ రాజ్యానికి పట్టాభిషిక్తునిగా చేసింది. భగవానుని అందంలో మునిగి, కైంకర్యాన్ని పోగొట్టకొన్న నన్ను శ్రియః పతిత్వమనే గుణాన్ని ప్రదర్శించి, కైంకర్యాన్ని అనుగ్రహించి, ఉజ్జీవించేటట్లు చేసినది ఈ వక్షఃస్థలమేకదా. ఈ రీతిలో అందంలో మునిగినవారిని గుణాలను చూపి ఉజ్జీవింపజేయవచ్చు. అదేరీతిలో ఆ గుణాలలో అభినివేశాన్ని పొందినవారిని అందాన్ని చూపి ఉజ్జీవింపజేయడంమాత్రం వీలుకాదు. వారిని ఉజ్జీవింపజేయాలంటే ఆ గుణాలే కావాలి. నీటిలో మునిగి మోహాన్ని చెందినవారికి ముఖంలో నీటిని జల్లడంద్వారానే ఆ మైకాన్ని పోగొట్టవలసిఉన్నది కదా. **"ఎన్నుళ్ పుకున్దాన్"** అని అన్నందువల్ల ఈ పాశురంలో, అన్నిటికి అంతర్యామి ఇతడే - అని పలికే అంతర్యామి బ్రాహ్మణంలో చెప్పబడే రీతిలో అన్నిటిలో వ్యాపించి ఉండే శక్తి కూడా ఇక్కడ ఇతనిలో ఉన్నదని అంటున్నారు.

**6. తుణ్డ వెణ్ పిఱైయన్ తుయర్ తీర్త్తవన్, అఞ్జిఱైయ**
**వణ్డువాழ் పొழిల్ శూழ் అరఙ్గనగర్మేయ అప్పన్,**



**అణ్డరణ్డ పకిరణ్డత్తు ఒరుమానిల మెழுమాల్వరై, ముற்றுమ్**
**ఉణ్డ కణ్డఙ్కణ్డీర్ అడియేనై యుయ్యక్కొణ్డదే**

తుణ్డమ్ = కలామాత్రమై, వెణ్ = తెల్లగానున్న, పిఱైయన్ = చంద్రుని జటా జూటమున కలవాడగు రుద్రునియొక్క, తుయర్ = భిక్షను అర్థించుచు తిరుగుటకు కారణమైన పాతకమును, తీర్త్తవన్ = పోగొట్టినవాడై, అమ్ = అందమైన, శిఱైయ= ఱెక్కలను కల్గిన, వణ్డు = తుమ్మెదలు, వాழ் = నివసించు చున్న, పొழிల్ శూழ் = తోటలచే చుట్టబడియున్న, అరఙ్గనకర్ = శ్రీరంగమును ఆశ్రయించి, మేయ = నిద్రించు చున్న, అప్పన్ = తండ్రియైనవాడు, అణ్డర్ = బ్రహ్మాండములలోనున్న చేతనులను, అణ్డమ్ = బ్రహ్మాండమును, పకిరణ్డమ్ = ఆ అండమునకు బయటనున్న అణ్డములను, ఒరు = అద్వితీయమైన, మా నిలమ్= మహాపృథివిని, ఆ భూమికి ఆధారభూతములైన, ఎழு = ఏడు, మాల్ వరైయుమ్= కులపర్వతములను, ముற்றுమ్ = మిగిలిన అన్నిటిని, ఉణ్డ= గ్రసించిన, కణ్డమ్ కణ్డీర్ = కంఠమే కదా! అడియేనై = దాసుడనగు నన్ను, ఉయ్యక్కొణ్డదు = సంసారమున చిక్కుకొనకుండకాపాడినది, ఏ = ఆశ్చర్యము.

అవ : ఆఱాయ్బాట్టు. సర్వలోకత్తైయు అముతు శెయ్తరుళిన కణ్ఠత్తినழகు ఎన్నై యుణ్డాక్కిற்று - ఎన్గిఱార్. తిరుమార్పిన్ అழகు తిరుక్కழுత్తిలే యేఱిట్టతు - ఎన్నవుమామ్.

వ్యా : (తుణ్డ విత్యాది) కలామాత్రమాయ్, వెళుత్తిరున్దుళ్ళ పిఱైయై జటైయిలేయుడైయనాన రుద్రనుక్కు పితావుమాయ్, లోకగురువుమా యిరున్దుళ్ళ బ్రహ్మావినుడైయ తలైయై అఱుక్కైయాల్ వన్ద ఆపత్తై పోక్కినవన్. శుమైయ రాయిరుప్పార్ శుమ్మాట్టుక్కుళ్ళే తాழ்மడలై చ్చొరుకుమాప్పోలే, సాధక నాయిరుక్కచ్చెయ్తే సుఖప్రధాననాక అభిమానిత్తిరుక్కుమాయ్త్తు. ఆనాలుమ్, ఆపత్తు వన్దాల్ అవనల్లతు పుకలిల్లైయే. చన్ద్రనుడైయ క్షయత్తై పోక్కినాప్పోలే తమ్ముడైయ దురితత్తైయుమ్ పోక్కుమెన్ఱు కరుత్తు.

(అఞ్జిఱైయ విత్యాది) లోకత్తిల్ ప్రధానరానవర్కళ్ బ్రహ్మహత్యై పణ్ణి అలైన్దు కొడు కిడక్కప్పుక్కవాఱే, "నామ్ కడక్క నిఱ్క వొణ్ణాతు" ఎన్ఱు, అవర్కళ్ రక్షణార్థమాక వన్దు కణ్వళర్న్దరుళుకిఱ ఉపకారకన్. అழకియ శిఱకై యుడైత్తాన్

వణ్డుకళ్ వాఴానిన్ఱ శోలై శూఴ్న్ద పెరియకోయిలిలే కణ్వళర్న్దరుళుకిఱ పితావానవన్.

**(వణ్డు వాఴ్ పొఴిల్)**- వణ్డుకళ్ అవన్ పక్కల్ శెల్లాతు. తిరుచ్చోలైయిన్ భోగ్యతైయిలే ఇళమణల్ పాయ్న్దు కాల్వాఙ్గమాట్టాతే నిఱ్కుమ్. అవ్వణ్డుకళైప్పోలే తమ్మై అనుభవిప్పిత్తు విడాయ్ కెడుత్తాన్ - ఎన్గిఱార్.

**(అణ్డరణ్డవిత్యాది)**- అణ్డాన్తర్వర్తికళుడైయ అణ్డమ్. పకిరణ్డమ్- పుఱవణ్డమ్; అద్వితీయమాన మహాపృథివి, భూమిక్కు ఆణి యడిత్తాప్పోలే యిరుక్కిఱ ఏఴు వకైప్పట్ట కులగిరికళ్, ఒన్ఱొఴియామే, ఆడిక్కాఱ్ఱిల్ పూళైపోలే, పఱన్దు తిరువయిఱ్ఱిలే పుకుమ్బడి యుణ్డ కఴుత్తు క్కిడీర్. ఇవఱ్ఱై త్తనిత్తనియే శొల్లువానెన్? ఎన్నిల్; తనిత్తనియే శొల్లుకై భోగ్యమాయిరుక్కైయాలే.

**(ముఱ్ఱు ముణ్డ కణ్డమ్ కణ్డీర్)** - ఒన్ఱొఴియామే ఆడిక్కాఱ్ఱిల్ పూళైపోలే. పెరియపెరుమాళ్ తిరుక్కఴుత్తై క్కణ్డాల్ ప్రళయాపత్తిలే జగత్తై ఎడుత్తు త్తిరువయిఱ్ఱిలే వైత్తమై తోఱ్ఱానిన్ఱతాయ్త్తు. విడుకాతు తోడిట్టు వళర్న్దతెన్ఱు తెరియుమాప్పోలే.

**(అడియేనై ఉయ్యక్కొణ్డతే)** -మున్బు పెఱ్ఱ కైఙ్కర్యత్తుక్కు విచ్ఛేదమ్ పిఱవాతపడి నోక్కిఱ్ఱు. ఎన్నై సంసారత్తిల్ ఒరు నాళుమ్ అకప్పడాతపడి పణ్ణిఱ్ఱు.

ఇప్పాట్టాల్ - ఆపత్సఖనాన సర్వేశ్వరన్పడియుమ్ ఇఙ్గే యుణ్డు- ఎన్గిఱార్.

## అరుమ్బుదమ్

*ఆఱామ్ పాట్టు : (తుణ్డ విత్యాది) సాధకవేషమ్ తోఱ్ఱ జటైయై ధరిక్కిఱవనుక్కు చంద్రన్ వేణుమో? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (శుమైయ రాయిరుప్పార్ ఇత్యాది).*

**ఆఱవ పాశురం :- అవతారిక :-** లోకాలను అన్నిటిని ప్రళయకాలంలో తన ఉదరంలో పెట్టుకొని ఆరగించినవాడైన శ్రీరంగనాథుని కంఠంలోని అందం



నన్ను సత్తను పొందేటట్లు చేసింది – అని ఈ పాశురంలో అంటున్నారు. ఆ విధంగా కాకుండా, గడచిన పాశురంలో అనుభవింపబడిన వక్షఃస్థలంయొక్క అందం కంఠంలోని అందంలోకి తీసికొనిపోయింది – అనికూడా చెప్పవచ్చు.

**వ్యాఖ్యానమ్ :- (తుణ్డ వెణ్పిఱైయన్ తుయర్ తీర్త్తవన్)** పూర్ణచంద్రుని కాకుండా, కళామాత్రమై తెల్లగా ఉండే చంద్రుని తలపై కల్గినవాడైన రుద్రునకు, తన తండ్రి, లోకాలను సృష్టించినవాడైన బ్రహ్మయొక్క తలను ఖండించినందువల్ల కల్గిన పాపాన్ని పోగొట్టినవాడు – అని భావం. బరువును మోసికొనిపోయేవారు బరువుకు అడుగున పెట్టబడే (బరువు మోసే) తలచుట్టలో తాటిమట్టను జొనిపినట్లుగా, పరమాత్మను ఉద్దేశించి తపస్సు చేసేవాడు (సాధకుడు) ఇతడు అనే విషయం స్ఫురించేటట్లుగా జటలను ధరించేవాడై ఉన్నా, తనను సుఖప్రదునిగా అభిమానిస్తాడు. (సుఖాన్ని కల్గించడంలో సమర్థునిగా తనను భావిస్తూ, ఆ విషయం స్ఫురించేటట్లుగా చంద్రకళను తలపై ధరిస్తాడు) ఆ విధంగా ఉన్నా, బ్రహ్మ ఇచ్చిన శాపంవల్ల భిక్షను యాచిస్తూ తిరిగే ఆపద తనకు కల్గినపుడు, అది తీరడంకోసం భగవానునే ఉపాయంగా వేడాడు. **“తుణ్డ వెణ్పిఱైయన్”** అనే ప్రయోగానికి రుద్రుడనే అర్థాన్ని గ్రహించకుండా, ఇది చంద్రుని తెలుపుతున్నట్లుగా అర్థాన్ని చెప్పవచ్చు. అపుడు భార్యలపట్ల పక్షపాతంలో ప్రవర్తించినందువల్ల శపింపబడి, కళావిహీనుడైన చంద్రుని కొఱతను పోగొట్టిన వాడు– అని భావం. చంద్రుని లోపాన్ని (కొఱతను) తీర్చినట్లే (స్వామి) తమ పాపాలనుకూడా తీర్చేవాడని భావం.

**(అణ్డఱైయ వణ్డు వాఴ్ పొఴిల్ శూఴ్ అరఙ్గనర్ మేయ అప్పన్)**– లోకంలో ప్రధానులైన దేవతలలో ఒకడైన రుద్రుడు బ్రహ్మ శిరస్సును ఖండించి బ్రహ్మహత్యా దోషాన్ని పొంది, అలమటిస్తూ తిరిగేటపుడు, తాను పరమపదమనే అతడు చేరలేని చోటులో ఉండకూడదు – అని వీరిని కాపాడడంకోసంగా ఇక్కడ ఉండే భూ లోకంలో శ్రీరంగానికి వచ్చి, శయనించి ఉండే ఉపకారకుడు – అని భావం. అందమైన ఱెక్కలను కల్గిన తుమ్మెదలు నివసించే తోటలచే పరివేష్ఠితమైన శ్రీరంగ దివ్యక్షేత్రంలో శయనించి ఉండే సర్వలోకపిత – అనేది ఈ ప్రయోగంలోని తాత్పర్యం.

**“వణ్డు వాఴ్ పొఴిల్శూఴ్”** – (తుమ్మెదలు నివసించే తోటలతో చుట్టబడి ఉండే) అనేది శ్రీరంగానికి విశేషణమైనందువల్ల తుమ్మెదలు భగవానునివరకు

పోలేక, శ్రీరంగంలోని తోటలలోని భోగ్యతలోనే మిక్కిలి అభినివేశాన్ని పొంది బయటపడలేకుండా ఉండే స్థితిని తెల్పుతుంది. ఈ రీతిలో పాశురంలోని మొదటి రెండు పాదాలద్వారా తమను, ఆ తుమ్మెదలనువలె, తనపట్ల అభినివేశం పొందేటట్లు చేసి, తన ఆర్తిని స్వామి తీర్చుకున్నాడని తెలుపబడింది. (**ఇళమణల్ పాయ్న్దు** – అనే వ్యాఖ్యానంలోని ప్రయోగానికి పైపైన కప్పిన ఇసుకలో పెట్టిన కాలు ఆ ఇసుకలో కూరుకొనిపోయి బయటకు పెట్టడానికి వీలులేకుండా అయినట్లే, శ్రీరంగం లోని భోగ్యతలో కూరుకొనిపోయి దానినుండి బయటపడలేక–అని భావం)

**(అణ్డరణ్డ పకిరణ్డత్తు ఒరు మానిలమ్ ఎ*ழு* మాల్ వరై మ*ற்று*మ్ ఉణ్డ కణ్డమ్ కణ్డీర్)**– **"అణ్డరణ్డమ్"** – ఈ అండం లోపల ఉండేవారు ఉజ్జీవించే చోటు అయిన బ్రహ్మాండం. **"పకిరణ్డమ్"** – అనేది బాహ్యాండం అండానికి బయట ఉండే సాటి లేని గొప్ప ప్రదేశం – అద్వితీయమైన మహాపృథివి.

**(ఎ*ழு* మాల్ వరై)** – భూమి స్థిరంగా నిలుకడగా కదలకుండా ఉండడానికి మేకులు దిగగొట్టినట్లుగా ఉండే ఏడు విధాలైన కులపర్వతాలు – అనే వీనిని అన్నిటిని దేనినీ విడువకండా సుడిగాలిలో ఎగిరిపోయే దూదిపింజవలె వేగంగా ఎగిరి స్వామి ఉదరంలోకి ప్రవేశించేటట్లుగా ఆరగించినది ఈ కంఠమే కదా! –అని భావం. వీటిని ప్రత్యేక ప్రత్యేకంగా చెప్పడానికి కారణం ఏమి? అంటే, ఒక్కొక్కటిగా పల్కడం ఆ*ழ*్వార్ల మనస్సుకు చాలా భోగ్యంగా ఉన్నందువల్ల

**(మ*ற்று*ముణ్డ కణ్డమ్ కణ్డీర్)** – శ్రీరంగనాథుని కంఠాన్ని దర్శిస్తే, ప్రళయకాలంలో లోకాలను అన్నిటిని గ్రహించి తన ఉదరంలో పెట్టుకొనిన అద్భుతకృత్యం తోస్తున్నది. పెద్దగా సాగిన రంధ్రం ఉండే చెవిని చూచినపుడు ఈ చెవి ఇంతకు ముందు ఆభరణం (కుండలాలు) అలంకరింపబడినందున ఇంత పెద్దగా సాగింది– అని తెలిస్తుంది కదా!

**(అడియేనై ఉయ్యక్కొణ్డదే)** – పూర్వం పొందిన కైంకర్యానికి అతరాయం కలుగని రీతిలో రక్షించింది. నన్ను ఈ లౌకికజీవనమనే సుడిగుండంలో ఏనాడు చిక్కుకోనని రీతిలో చేసింది – అని భావం.

ఈ పాశురంలో, ప్రళయకాలంలో లోకం అంతటిని ఆరగించి, తన ఉదరంలో పెట్టుకొని రక్షించిన సర్వేశ్వరుని స్వభావం శ్రీరంగనాథునిలో ఉన్నది– అని తెలిపారు.



**7. కైయినార్ శురిశఙ్గనలా*ழி*యర్, నీళ్వరైపోల్**
**మెయ్యనార్ తుళప విరైయార్, కమ*ழ்*నీణ్ముడి యెమ్**
**ఐయనార్ అణియరఙ్గనార్ అరవినణైమిశై మేయ మాయనార్,**
**శెయ్యవాయ్ ఐయో! ఎన్నై చ్చిన్దై కవర్న్దదువే**

కైయిన్ = శ్రీహస్తములో, ఆర్ = అందము అతిశయించిన, శురి = దక్షిణావర్తములను కల, శఙ్గ = పాంచజన్యమను శంఖమును, కనల్ = శత్రువులపై అగ్నిని ఉమియు, ఆ*ழி*యర్ = సుదర్శనమను చక్రమును కలవాడై, వరైపోల్ = పర్వతమువలె, నీళ్ = అందము అతిశయించియున్న, మెయ్యనార్= గొప్ప రూపమును కలవాడై, కమ*ழ்* విరై ఆర్ = సుగంధము నిండియున్న, తుళపమ్ = తులసీమాలచే అలంకృతమై, నీళ్ = ఉన్నతమైన, ముడి = కిరీటమును కల్గినవాడై, ఎమ్ ఐయనార్= మా తండ్రియైనవాడై, అణి = సంసారమునకు (ఈలోకమునకు) ఆభరణమైన, అరఙ్గనార్ = శ్రీరంగమునకు వచ్చి, అరవిన్ అణై మిశై = శేషుడను పడుకలో, మేయ = పవళించునట్టి, మాయనార్ = ఆశ్చర్యకరములైన లీలలను కల శ్రీరంగనాథుని, శెయ్య వాయ్ = ఎఱ్ఱని అధరము, ఐయో = అయ్యో!, ఎన్నై=(స్త్రీల ఎఱ్ఱని అధరములలో ఆసక్తిని కల) నాయొక్క, శిన్దై = చిత్తమును, కవర్న్దదు = తనపట్ల ఆకర్షించినది, ఏ= ఆశ్చర్యము.

అవ : ఏ*ழு*ావ్యాట్టు. తిరువయి*ற்ற*ిలే అకప్పట్టు చ్చొల్లుకిఱార్; నీఙ్ఞప్పుక్కు త్తెప్పత్తై యి*ழு*న్దేన్ - ఎన్నుమాప్పోలే.

వ్యా : (కైయినారిత్యాది) -వెఱుమ్బుఅత్తిలే పడవడిక్క వల్ల కైయిలే అ*ழ*కు నిఱైన్దు శురియై యుడైత్తాన శ్రీపాఞ్చజన్యమ్, ప్రతిపక్షత్తిన్ మేలే అనలై యుమి*ழு*ానిన్తుళ్ళ తిరువా*ழி* - ఇవ*ற்ற*ై యుడైయరాయిరుక్కై, శ్రీపాఞ్చ జన్యత్తుక్కు శురి స్వభావమానాప్పోలే, తిరువా*ழி*యా*ழ*్వానుక్కు ప్రతి పక్షత్తిన్మేలే కనల్ ఉమి*ழ்*కై స్వభావమ్.

తిరుక్కోట్టియూరిలే అనన్దా*ழ*్వాన్, భట్టరై "శ్రీవైకుణ్ఠనాథన్ ద్విభుజనో? చతుర్భుజనో?" ఎన్టు కేట్క; "ఇరణ్డు మ*ழு*కియతే. ద్విభుజనాకిల్ పెరియ పెరుమాళైప్పోలే యిరుక్కిఱతు. చతుర్భుజనాకిల్ పెరుమాళైప్పోలే యిరు క్కిఱతు" ఎన్టార్.

**(నీళ్ వరై)** - మలైయైయుమ్, కడలైయుమ్ ఒప్పుచొల్లుమిత్తనై యిఱే. నీట్చి- భోగ్యతాప్రకర్షమ్, "పచ్చై మామలైపోల్ మేని"; అతుక్కుమేలే ఒప్పనై యఴకు.

**(తుళప విరైయార్ కమఴ్ నీణ్ముడి)**- పరిమళమ్ మిక్కిరున్దుళ్ళ తిరుత్తుఴాయ్మాలైయాలే అలఙ్కృతమాయ్, అధిరాజ్య సూచకమాన తిరువభిషేకత్తై యుడైయరుమాయ్.

**(ఎమ్మైయనార్)** ఉఱవు తోన్ఱుకై. ఎనక్కు జనకరానవర్.

**(అణి యరఙ్గనార్)** - ప్రాప్తవిషయమాయిరుక్క క్కడక్కవిరాదే, సంసారత్తుక్కు ఆభరణమాన కోయిలిలే వన్దు అణ్ణియరుమా యిరుక్కిఱపడి.

**(అరవిణైమిశై)**- రత్నఙ్గళై ఎల్లామ్ తఙ్గత్తిలే పుతైత్తు క్కాట్టుమాప్పోలే, తన్నఴకు తెరిత్తిరువనన్దాఴ్వాన్ మేలే శాయ్న్దు కాట్టుకిఱపడి.

**(మేయ మాయనార్)** మిన్మిని పఱక్కిఱపడి. (స మయా బోధిత శ్రీమాన్) ఎల్లార్క్కుమ్ ఒన్ఱిలే శాయ్న్దవాఱే పొల్లాఙ్గు తెరియుమ్, ఇఙ్గు ప్పళ్ళైయ అఴకుమ్ నిఱమ్పెఱుమ్.

**(శెయ్య వాయ్)**- స్త్రీకళుడైయ పాయ్ చ్చిరిప్పిలే తువక్కుణ్డార్క్కు ఇచ్చిరిప్పు క్కణ్డాల్ పొఱుక్కప్పోమో?

**(ఐయో)**- తిరువధరముమ్, శివప్పుమ్ అనుభవిక్క అరితాయ్ "ఐయో!" ఎన్గిఱార్.

**(ఎన్నై)** పణ్డే నెఞ్జు పఱికొడుత్త ఎన్నై అన్యాయమ్ శెయ్వతే !- ఎన్ఱు కూప్పిడుకిఱార్. కళ్ళై నీరాక్కి, నీరైయుమ్ తానే కొణ్డతు.

ఇప్పాట్టిల్ - శ్రీవైకుణ్ఠనాథన్పడియుమ్ ఇఙ్గే కాణలామ్ - ఎన్గిఱార్.

## అరుమ్పదమ్

*ఏఴామ్ పాట్టు : (కైయినారిత్యాది) ఇఙ్గు, తెప్పమ్- అనుభవ పరికరమాన నెఞ్జు. (పడవడిక్కై) ఈడు పడుత్తుకై. "శురి" ఎన్ఱు సుషిరమాయ్, అత్తాల్ తుళై- ఎన్నపడి. "శఙ్గు" ఎన్నవిడత్తిల్ కడై క్కుఱైత్తలాయ్ "శఙ్గనల్" ఎన్నదాయ్, "కనలాఴి" ఎన్ఱు నెరుప్పై ఉమిఴ్కిఱ తిరువాఴి - ఎన్నపడి. పెరియపెరుమాళ్ చతుర్భుజరా యిరుక్క చ్చెయ్దేయుమ్ ఆపాతతః మేలెఴ ద్విభుజరాయ్ తోన్ఱుకిఱా ప్పోలే, పరమపదనాథనుమ్ చతుర్భుజనాయిరుక్కచ్చెయ్దేయుమ్, ప్రమాణాంత రఙ్గళాలే ద్విభుజనాయ్ తోన్ఱినానాకిల్, పెరియపెరుమాళ్ మఱైత్తు క్కాట్టుకిఱాప్పోలే, ప్రమాణఙ్గళుమ్ మఱైత్తు చ్చొల్లుకిఱదెన్ఱు భట్టరుక్కు క్కరుత్తు. కిడైయఴకు వాచామగోచరమాయ్, ఆశ్చర్యమాయిరుక్కైయాలే. "ఇదమ్, ఇదమ్" ఎన్న ప్పోకామల్ మిన్మిని పఱక్కిఱదు- ఎన్నపడి. నెఞ్జు పఱికొడుక్కై ఇరణ్డామ్ పాట్టిలే. అఙ్గే కళ్ళాన నెఞ్జై నీరాక్కి, ఇఙ్గే అన్ద నీరైయుమ్ అపహరిత్తదు -ఎన్నపడి.*



**ఏడవ పాశురం : అవతారిక :** శ్రీరంగనాథుని అధరసౌందర్యంలో అభినివేశాన్ని పొంది ఈ పాశురంలో పల్కుతున్నారు. ఒక చిన్న తెప్పను సహాయంగా చేసికొని ఏఱును దాటాలని ప్రయత్నించేవాడొకడు ఏటిమధ్యలో దానిని పోగొట్టుకొని తడబడేటట్లే, శ్రీరంగనాథుని అందంలో అభినివేశాన్ని పొందిన ఆఴ్వార్లు, దానికి ముఖ్యమైన సాధనం అయన మనస్సును కోల్పోయానని ఈ పాశురంలో – అని అంటున్నారు.

**వ్యాఖ్యానమ్ : ( కైయినార్ శురి శఙ్గనలాఴియర్)** – శ్రీరంగనాథునియొక్క శ్రీహస్తాలు, వాటిని దర్శించినవారు వ్యామోహాన్ని పొంది పడిపోయే రీతిలోని అందాన్ని కల్గినవి. ఏ ఆభరణం లేని శ్రీరంగనాథుని శ్రీహస్తాలే నీరాజనం ఇవ్వవలసి నంతటి అందాన్ని కల్గినవి. ఇక అటువంటి శ్రీహస్తాలలో గొప్ప అందాన్ని కల్గినది, సుడులను (పురులను) కల్గినదైన ఈ పాంచజన్యం అనే శంఖాన్ని, శత్రువుల పైబడి, నిప్పును ఉమిసే శ్రీసుదర్శనాన్ని ధరించి ఉంటే ఇక వాటి అందం చెప్పాలా? శంఖానికి సుడులు (పురులు) సహజమైనట్లే, సుదర్శనానికి శత్రువులపై నిప్పును ఉమియడం సహజం – అని భావం. భట్టర్ తిరుక్కోట్టియూర్లో వేంచేసి ఉన్న కాలంలో అనందాఴ్వాన్ భట్టర్ను చూచి – "శ్రీవైకుంఠనాథుడు పరమపదంలో రెండు శ్రీహస్తాలతో వేంచేసి ఉంటాడా? లేక, నాల్గు చేతులతో వేంచేసి ఉంటాడా?" అని అడిగారు. దానికి భట్టర్ రెండు విధాలుగాను ఉండడం తగినదే – అని బదులిచ్చారు. "ఈ రెండిటిలో ఏది అందమైనది?" అని భట్టర్ను మళ్ళీ

ఆనందాళ్వాన్ ప్రశ్నించారు. "రెండు చేతులతో కూడి ఉంటే పెరియపెరుమాళ్ (శ్రీరంగనాథుని మూలవిరాట్) వలె అందంగా ఉంటారు. నాల్గు చేతులతో కూడిఉంటే నమ్బెరు మాళ్ వలె (ఉత్సవమూర్తి) వలె అందంగా ఉంటారు" – అని భట్టర్ బదు లిచ్చారు. (ఈ ఐతిహ్యం శ్రీరంగనాథుడు చతుర్భుజుడనే దీనిని తెల్పుతున్నది.)

**(నీళ్వరైపోల్ మెయ్యినార్)** – శ్రీరంగనాథుని తిరుమేనికి ఉపమానాన్ని పలికేటపుడు పర్వతాన్ని గాని, సముద్రాన్ని గానికదా ఉపమానంగా చెప్పవలసి ఉన్నది. **"నీళ్"** అనే పదం భోగ్యతాతిశయాన్ని తెల్పుతున్నది. **"పచ్చై మామలైపోల్ మేని"** (తిరుమాలై–2) (మరకత మహాగిరివంటి మేని) అని తొణ్డరడిప్పొడి ఆళ్వార్లుకూడా పర్వతాన్నేకదా పెరియపెరుమాళ్ తిరుమేనికి ఉపమానంగా పలికారు. ఆ తిరుమేనికిపైన ఉండే ఆభరణాలు ఇంకా ఇంకా అందాన్ని అధికం చేస్తున్నది.

**(తుళప విరైయార్ కమళ్నీణ్ముడి)** సువాసన నిండుగా ఉండే తులసీమాలిక చేత అలంకరింపబడినదై, ఇతడే అన్యదైవాలన్నిటికీ గొప్పదైన సర్వలోకచక్రవర్తి – అనే విషయాన్ని తెలిపే కిరీటాన్ని కలవాడై ఉన్నాడు.

**(నమ్ ఐయనార్)** – దర్శించినపుడే **"మనకు తండ్రి"** అనే సంబంధం స్ఫురించే టట్లుగాఉండేవాడు.

**(అణి యరఙ్గనార్)** – కన్నతండ్రియై ఉన్నా, చేయి విడిచిపోకుండా సంసార మండలానికి అలంకారంవలె ఉండే శ్రీరంగదివ్యక్షేత్రంలోని కోవెలలోకి వచ్చి శయనించి, సమీపంలో ఉండేవాడు.

**(అరవిన్ణైమిశై)** – పలు రీతులలోని రత్నాలను బంగారంలో పొదిగినట్లుగా, పలు రత్నాల కాంతుల చేరికవలె ఉండే తన తిరుమేనియొక్క అందం ప్రకాశించే టట్లుగా ఆదిశేషునిపై శయనించి ఉండడం దీనిద్వారా తెలుపబడుతున్నది.

**(మేయ మాయనార్)** – గొప్ప కాంతిని కల్గి ఉండడంచేత చూడాలంటే కళ్ళు జంకి, భయం కల్గి "కళ్ళు మిఱుమిట్లు గొల్పుతున్నది" అని పలికేటట్లుగా, శ్రీరంగనాథుని ఆశ్చర్యకరమైన తిరుమేనికాంతి దర్శించేవారికి కళ్ళు మిఱుమిట్లు కల్గిస్తున్నదని పలికే రీతిలో ఉన్నది. **"అరవిన్ణైమిశై మేయ మాయనార్"** అని అన్నందువల్ల శయనించి ఉండేటపుడుకూడా అందం ప్రకాశించే రీతి తెలుపబడింది. **"వాయసేన తత స్తేన బలవత్ క్లిశ్యమానయా, స మయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః"** (రామా–యుద్ధ–38–25) (తరువాత, సుఖంగా నిద్రిస్తున్నవాడు, అందువల్ల అందంగా ఉండేవాడు, (ఆ దశలోకూడా) శత్రువులను తపింపజేయ గల్గినవాడైన శ్రీరాముడు ఆ కాకాసురునిచేత బలంగా బాధింపబడ్డ నాచే, మేల్కొలుప బడ్డాడు) అనే ప్రమాణంలో, **"శ్రీమాన్ సుఖ సుప్తః"** అని అనడం ద్వారా నిద్రించేటపుడు కన్పించే అందం తెలుపబడిందికదా! సాధారణంగా అందఱికి నిద్రించేటపుడు వారి శరీరాలలో కలిగే వికారాలు వ్యక్తమవుతాయి. కాని, భగవానుని విషయంలో స్వతఃసిద్ధంగానే ఉండే అందం అపుడు అతిశయించి ఉంటుంది.

**(శెయ్య వాయ్)** – **"తువర్త్త శెవ్వాయినార్క్కే తువక్కుఱ త్తురిశనానేన్"** (తిరుమాలై–3) (మిక్కిలి ఎఱ్ఱని అధరాలను కల స్త్రీల కోసమే ఏ అడ్డు లేని చౌర్యాన్ని చేసినవాడనయ్యాను) అని అనాదికాలంగా తగని విషయాలలో అభినివేశాన్ని పొందిన నన్నుకదా, ఈ అధరం ఈ రీతిలో ఆకర్షించింది. స్త్రీల మోసపు మందహాసాలలో మైకాన్ని పొందిన నన్ను ఈ చిఱునవ్వు దాసునిగా చేసికోవడంలో ఆశ్చర్యం లేదు.

**(ఐయో)** – ఈ అధరసౌందర్యాన్ని, దాని ఎఱ్ఱదనంలోని అందాన్ని పూర్తిగా అనుభవించడానికి సాధ్యం కానందువల్ల **"అయ్యో!" ("ఐయో")** అని అంటున్నారు.

**(ఎన్నై చ్చిన్దై కవర్న్దదువే)** – ఇంతకుముందే మనస్సును కోల్పోయిన నా స్వరూపాన్నిసైతం అపహరించి అన్యాయం చేశాడే! దానికి నేను ఏ పరిహారాన్ని అన్వేషించను? అని అంటున్నారు.

**(ఎన్నై)** – శ్రీరంగనాథుని ఎఱ్ఱని అధరం రాయివలె ఉండే నా మనస్సును నీరు చేసి, ఆ నీటినికదా అపహరించింది, – అని భావం. ఈ పాశురంలో, శ్రీవైకుంఠ నాథునకు చెందిన లక్షణాలైన శంఖచక్రాలను ధరించడం, గొప్ప తిరుమేనిని కలవాడై ఉండడం, తులసీమాలను ధరించిన కిరీటాన్ని కల్గి ఉండడం – అనే వీటిని తెలుపడం ద్వారా, శ్రీవైకుంఠనాథుని గొప్పతనాలు అన్నీ శ్రీరంగనాథునకు ఉన్నాయి– అని అంటున్నారు, ఆళ్వార్లు.

**8. పరియనాకి వన్ద అవుణనుడల్ కీణ్డ, అమరర్ -**
**క్కరియ అదిప్పిరాన్ అరఙ్గత్తమలన్ ముకత్తు,**
**కరియవాకి ప్పుడై పరన్దు మిళిర్న్దు శెవ్వరియోడు, నీణ్డ అ -**
**ప్పెరియవాయ కణ్గళ్ ఎన్నై ప్పేదైమై శెయ్దనవే**

పరియన్ ఆకి = (బ్రహ్మఇచ్చిన) వరబలముచే వృద్ధి చెందిన శరీరమును కలవాడై, వన్ద = "వేఱు పరతత్త్వమున్నది" అనిన ప్రహ్లాదుని బాధించుటకై వచ్చిన, అవుణన్ = అసురుడైన హిరణ్యకశిపుని, ఉడల్ = శరీరమును, కీణ్డ = గుచ్చి వధించినవాడై, అమరర్క్కు = బ్రహ్మాదిదేవతలకు, అరియ = దఱిచేర వీలులేనివాడై, ఆది = కారణభూతుడై, పిరాన్ = తాను ముందుగా తలచివచ్చి ఉపకారముచేయువాడై, అరఙ్గత్తమలన్ = (అందఱికిని సహాయపడుటకై) శ్రీరంగమునకు వచ్చి శయనించి యుండుటచే కల్గిన శుద్ధిని కల శ్రీరంగనాథుని, ముకత్తు = ముఖమండలములో, కరియ ఆకి = నల్లనివై, పుడై పరన్దు = విశాలములై, మిళిర్న్దు = మెఱయునట్టివై, శెవ్వరియోడు = (చివరలో) ఎఱ్ఱని జీరలను కల్గి, నీణ్డ = ఆకర్ణాంతము విస్తరించిన, అప్పెరియవాయ = అట్టి పెద్దవైన, కణ్గళ్ = నేత్రములు, ఎన్నై = (ఱాయివంటి కఠినమైన మనస్సును కల) నన్ను, పేదైమై శెయ్దన = తనపట్ల పక్షపాతమును కలవానినిగా చేసినది.

అవ : ఎట్టామ్బాట్టు : తిరుక్కణ్కళ్ ఎన్నై అఱివు కెడుత్తదు- ఎన్గిఱార్.

వ్యా : (పరియనాకి వన్ద) - భగవద్గుణఙ్గళై అనుసన్ధిత్తు నైన్దిరామే, శేషత్వత్తై అఱిన్దు మెలిన్దిరామే, సర్వేశ్వరనై ఆశైప్పట్టు త్తళర్న్ద ఉడమ్బా ఒశిన్దిరామే.

(పరియన్) నరసింహత్తుక్కుమ్ పిఱ్కాలిక్క వేణ్డుమ్బడి యిరుక్కై. ఊట్టియిట్టు వళర్త్త పన్ఱిపోలే ఉడమ్బై వళర్త్తానిత్తనై.

(వన్ద) ఇప్పోతు తామ్ వయిఱు పిడిక్కిఱార్.

(అవుణనుడల్ కీణ్డ) - నరసింహత్తినుడైయ మొఱాన్ద ముకముమ్, నా మడిక్కొణ్డ ఉతడుమ్, శెఱుత్తు నోక్కిన నోక్కుమ్, కుత్తముఱుక్కిన కైయుమ్, కణ్డపోతే పాశుక్కిన పన్ఱిపోలే మఙ్గునారై క్కిఴిక్కుమాప్పోలే కిఴిత్తపడి.



(అమరర్క్కరియ ఆదిప్పిరాన్)- దేవర్కళుక్కు ఉత్పాదకనామాత్ర మన్నై. ఆళాయ్ నిఱ్పతు ఆశ్రితర్క్కు. శిఱుక్కనుక్కు ఉతవి నిఱ్కిఱనిలై తన్నిలే బ్రహ్మాదికళుక్కు పరిచ్ఛేదిక్కవొణ్ణాత పడి నిఱ్కిఱ ప్రధానన్. "క్వాహం రజః పకృతి రీశతమోఽ ధికేస్మిన్ జాత స్సురేతరకులే క్వ తవానుకమ్పా, న బ్రహ్మణో న చ భవస్య న వై రమాయా యో మేఽ ర్పిత శ్శిరసి పద్మకరప్రసాదః".

(ఆదిప్పిరాన్) - తాన్ ముఱ్కోలి ఉపకరిక్కుమవన్.

(పిరాన్) ప్రహ్లాదనుక్కు ఎళియనాన నిలైయుమ్, బ్రహ్మాదికళుక్కు అరియనాన నిలైయుమ్- ఇరణ్డుమ్ తమక్కు ఉపకారమాయిరుక్కిఱతు.

(అరఙ్గత్తమలన్) - ఎల్లార్క్కు ముతవుమ్బడి కోయిలిలే వన్దు కణ్వాళన్దరుళుకైయాలే వన్ద శుద్ధి. ఒరుక్కాల్ తోఱ్ఱి ప్పోతల్, అవతారమ్బోలే తీర్థమ్ ప్రసాదిత్తుప్పోతల్ శెయ్యామైయాలే వన్ద శుద్ధియాకవుమామ్.

(ముకత్తు) - అవనుడైయ తిరుముకత్తు.

(కరియవాకి)- విడాయ్త్తార్ ముకత్తిలే నీర్వెళ్ళత్తై వెట్టివిట్టాప్పోలే యిరుక్కై.

(పుడై పరన్దు)- కడలై తటాకమాక్కినాప్పోలే ఇడముడైత్తాయిరుక్కై.

(మిళిర్న్దు)- తిరై వీశి క్కరైయాలుమ్ వఴిపోకవొణ్ణాతిరుక్కై.

(శెవ్వరియోడి) శ్రియఃపతిత్వత్తాలుమ్ శివన్దిరుక్కై

(నీణ్డ) శెవి యళవుమ్ అలై ఎఱికై.

(అప్పెరియవాయ కణ్గళ్)- పిన్నైయుమ్ భోక్తావినళవన్ఱిక్కే యిరుక్కైయాలే. "అప్పెరియవాయ కణ్గళ్" ఎన్గిఱార్. "ఇతు" ఎన్నవొణ్ణాతే పరోక్షనిర్దేశమ్ పణ్ణవేణ్డుమ్బడియిరుక్కై.

(ఎన్నై) పెరియమనిచ్చన్ కిడీర్ నాన్. ఎన్ వైదగ్ధ్యత్తై ప్పఱిత్తు ప్పోకట్టు మౌగ్ధ్యత్తై త్తన్దన. ఒరువన్ ఎయ్తత్తై ముఱ్ఱవనుమ్ ఎయ్యుమాప్పోలే.

(పేత్తైమై శెయ్తనవే) రామశరమ్‌పోలే ముడిన్దు పిఖ్లైక్క వొట్టుకిఅనవిల్లై. ఇత్తాల్ -నరసింహావతారత్తిన్ పడియుమ్ ఇజ్జే యుణ్డు- ఎన్గిఆర్.

## అరుమ్బుదమ్

*ఎట్టామ్ పాట్టు : (పరియనాకి- ఇత్యాది) (ఆది)- కారణభూతనాదల్, ప్రధాననాదల్, మున్టుఅ వాదల్ - ఆక, మూన్టర్థమ్. (పెరియ మనిచ్చన్) ఒన్టుక్కుమ్ కరైయాద కల్ నెజ్జన్. కణ్‌గళ్- ఎన్గిఅ ద్వివచనత్తై ప్పగ్ర అరుళిచ్చెయ్‌కిఆర్ (ఒరువనెయ్య- ఇత్యాది).*

**ఎనిమిదవ పాశురం : అవతారిక :** శ్రీరంగనాథుని తిరునేత్రాలు తమపట్ల నాకు వ్యామోహం కలిగేటట్లుచేసి, జ్ఞానాన్ని కల్గించాయి – అని అంటున్నారు.

**వ్యాఖ్యానమ్ : (పరియనాకి వన్ద)** – భగవానుని కల్యాణగుణాలను తలచి, ఆర్తి చెంది, లోపల ద్రవించకుండా, ఈ ఆత్మ అతనికి శేషమై ఉన్న విషయాన్ని గ్రహించి క్లేశపడకుండా, సర్వేశ్వరుని పొందాలి – అని ఆశపడి తల్లడిల్లిన శరీరాన్ని కలవాడై, పరుగెత్తి వచ్చే రీతిలో కాకుండా, (ఇటువంటి స్వభావాలను వేటినీ కల్గి ఉండకుండా) బాగా బలిసిన శరీరాన్ని కలవాడుకదా ఇతడు (హిరణ్య కశిపుడు)– అని హార్దభావం.

**(పరియ)** ఇతనిని సంహరించిన నృసింహుడుకూడా ఇతనిని చూస్తే ఒక అడుగు వెనుకంజ వేసేటట్లుగా ఉండే బలిసిన శరీరాన్ని కలవాడు. బాగా మాటి మాటికి తిండిని పెట్టి పెంచిన పందివలె, శరీరాన్ని పెంచాడే తప్ప మనస్సును పెంచలేదు – అని (హార్ద) భావం.

**(వన్ద)** – పరమభాగవతుడైన ప్రహ్లాదుని బాధించాలని అతడు వచ్చిన రీతిని చూచి ఈ ఆఖ్వార్లు "ఏమి కాబోతున్నదో" అని (ఇపుడు అస్థానే భయశంకతో) భయపడి కడుపు పట్టుకొనే స్థితిని ఈ ప్రయోగం తెల్పుతున్నది.



**(అవుణన్ ఉడల్ కీణ్డ)** నరసింహమూర్తియొక్క మొఖటు, (క్రూరమైన) ముఖాన్ని, నాలుకను మడచి ఉంచిన నోటిని, కోపంతో చూచే చూపును, గోళ్ళతో గుచ్చడంకోసం మడచి ఉంచిన చేతులను చూచినపుడే అతడు విగతజీవుడయ్యాడు. అగ్నిలో వాడిన పందినివలె, హిరణ్యుని శరీరాన్ని ముక్కిన నారను చీల్చినట్లుగా నృసింహుడు చీల్చిన రీతి ఈ ప్రయోగంద్వారా తెలుపబడుతున్నది.

**(అమరర్‌క్కు అరియ ఆది ప్పిరానై)** దేవతలను సృష్టించాడు, అయినా, వారికి అందనివాడుగానే ఉన్నాడు. భక్తులకు విధేయుడై, వారు నియోగించిన కార్యాన్ని చేసేవాడుగా ఉన్నాడు. చిన్నబాలుడైన ప్రహ్లాదునకు కరుణను చూపి అనుగ్రహించిన స్థితిలోకూడా బ్రహ్మ మొదలైన దేవతలకుసైతం తన మహిమను పరిచ్ఛేదించడానికి సాధ్యం కానివాడై ఉండై ప్రధానుడు. **"క్వాహం రజఃప్రకృతి రీశ! తమోతిగేఽస్మిన్ జాతస్సురేతరకులే క్వ తవానుకంపా, న బ్రహ్మణో న చ భవస్య న వై రమాయాః యా మేఽర్పితః శిరసి పద్మకరఃప్రసాదః"** (భాగవతమ్–7–8–26)

ప్రభూ! తమోగుణం నిండిన ఈ అసుర కులంలో పుట్టిన, రజోగుణం నిండిన నేనెక్కడ? నీకరుణ ఎక్కడ? నాతలపై పెట్టబడిన తామరవంటి ఆ హస్తం బ్రహ్మాది కాదు, శివునిది కాదు, లక్ష్మీదేవిదికూడా కాదు. వాటికంటే గొప్పవాడవైన నీదే కదా) అనే ప్రమాణం ఇక్కడ అనుసంధేయం.

**(ఆదిప్పిరాన్)** – భక్తులకు ఆపద కల్గడానికి ముందుగా తానే పోయి సహాయపడేవాడు. **"ఆది"** అనే పదానికి అరుంబదవివరణంలో కారణభూతుడు, ముఖ్యమై ఉండేవాడు, అగ్రగామి – అనే మూడు అర్థాలు తెలుపబడ్డాయి.

**(పిరాన్)** – సహాయకుడు – అని అర్థం ప్రహ్లాదునకు సులభుడై ఉండే స్థితి, బ్రహ్మ మొదలైనవారికి అందనివాడై ఉండే స్థితి – అనే రెండు తమకు సహాయపడినవి– అని తలుస్తున్నారు.

**(అరఙ్గత్తమ్మాన్)** – నరసింహునివలె ప్రహ్లాదునకు ఒక్కనికే అనుగ్రహించడం కాకుండా, అందఱికి సహాయపడేటట్లుగా శ్రీరంగదివ్యక్షేత్రంలోకి వచ్చి శయనించినందువల్ల కల్గిన పరిశుద్ధి దీనిద్వారా తెలుపబడుతున్నది. **"అమలన్"** అనే పదం నృసింహునివలె ఒకసారి ప్రత్యక్షమై అదృశ్యం కావడం కాని, కొంచెం కాలం మాత్రమే ఉండి, అదృశ్యం కావడం కాని కాకుండా, నిత్యంగా కోవెలలో

వేంచేసి ఉండి, భక్తులకు అనుగ్రహిస్తున్నందువల్ల కల్గిన పరిశుద్ధిని తెల్పు తున్నట్లుగా కూడా చెప్పవచ్చు.

**(ముకత్తు)** అతని ముఖంలోని,

**(కరియవాకి ప్పుడై పరన్దు మిళిర్న్దు శెవ్వరియోడు నీణ్డ అప్పెరియవాయ కణ్గళ్)** – దాహంతో తపించేవారి ముఖంలో నీటిప్రవాహాన్ని వెదజల్లినట్లుగా ఉండే విషయాన్ని ఈ ప్రయోగం తెల్పుతున్నది.

**(పుడై పరన్దు)** – సముద్రాన్ని చిన్న మడుగుగా చేసినట్లుగా ఉండే (విశాలమైన) స్వామి నేత్రాలు విస్తరించిన రీతిని ఈ ప్రయోగం తెల్పుతున్నది.

**(మిళిర్న్దు)** – (సముద్రంలోని) అలలు ఎగసిపడి వీస్తున్నందువల్ల (బాగా విస్తరించినందువల్ల) తీరంపై పోయేవారికికూడా దారిలో పోలేని రీతిలో ఉండే స్వామినేత్రాల తీరు తెలుపబడింది.

**(శెవ్వరియోడు)** – శ్రియఃపతిగా ఉండే ఐశ్వర్యాతిశయంవల్ల, భక్తులపట్ల కల్గి ఉండే ప్రేమాధిక్యంవల్ల స్వామినేత్రాలు ఎఱ్ఱగా ఉండడాన్ని ఈ ప్రయోగం తెల్పుతున్నది.

**(నీణ్డ)** – చెవులవరకు అలలు వీచినట్లుగా విస్తరించిన.

**(అప్పెరియవాయ కణ్గళ్)** – ఇన్ని విశేషణాలు ప్రయోగించిన తరువాత కూడా ఆళ్వార్లు శ్రీరంగనాథుని నేత్రాలను పూర్తిగా అనుభవించిలేనందువల్ల **"అప్పెరియవాయ కణ్గళ్"** (ఆ పెద్దవైన నేత్రాలు) అని అంటున్నారు. పూర్తిగా అనుభవించగల్గినట్లయితే **"ఇతు"** అని చెప్పవచ్చు. ఆ రీతిలో అవధిని చూడలేనందున కంటితో పూర్తిగా దర్శించలేని విషయాన్ని తెల్పినట్లుగా **"అప్పెరియవాయ కణ్గళ్"** అని (పరోక్ష నిర్దేశంతో) అంటున్నారు.

**(ఎన్నై ప్పేదమై శెయ్దనవే)** – దేనికీ ద్రవించని రాతిమనస్సును కల గొప్ప వ్యక్తిని అయి నన్నుకూడా కొల్లగొట్టాడు. నా అనుభవించే శక్తిని అంతటిని ఏమీ లేకుండా చేసి, అనుభవించలేని స్థితిని కల్గించాడు. ఒకడు బాణాన్ని ప్రయోగించి గాయపరచిన వానిపై ఇంకొకడుకూడా బాణాన్ని ప్రయోగించినట్లే, అధరంచేత



పడగొట్టబడిన (జితుడనైన) నన్ను ఆ స్వామినేత్రాలు మరింత వ్యామోహాన్ని కల్గిస్తున్నాయి.

**(పేతమై శెయదనవే)** – శ్రీరాముని బాణంచే కొట్టబడినవాడు మరణిస్తాడు కనుక అతని దుఃఖం తీరిపోతుంది. ఈ నేత్రాలు ఆ రీతిలో కాకుండా నన్ను ప్రాణాలతో నిలిపి చిత్రవధను చేస్తున్నాయి – అని హార్దభావం. ఈ పాశురంలో, నరసింహావతారంయొక్క స్వభావం శ్రీరంగనాథునిలో ఉన్నది – అని ఆళ్వార్లు అంటున్నారు.

**9. ఆలమామరత్తినిలైమేల్ ఒరుపాలకనాయ్,**
**ఞాలమేళుము ముణ్డాన్ అరఙ్గత్తరవినణైయాన్,**
**కోలమా మణియారముమ్ ముత్తుత్తామముమ్ ముడివిల్లదు ఓరెళిల్,**
**నీలమేని ఐయో! నిఱై క్కొణ్డదు ఎన్నెఞ్జినైయే**

మా = గొప్పదైన, ఆల మా మరత్తిన్ = మఱ్ఱిచెట్టుయొక్క, ఇలై మేల్ = (చిన్నదైన లేత) ఆకులో, ఒరు = ఒక, పాలకన్ ఆయ్ = బాలకుడై, ఞాలమ్ ఏళుమ్ ఉణ్డాన్= ఏడు లోకములను తన ఉదరములోనుంచుకొని రక్షించినవాడును, అరఙ్గత్తు = శ్రీరంగములో, అరవు ఇన్ అణైయాన్ = ఆదిశేషుడను అందమైన పడుకలో నిద్రించువాడును అగు శ్రీరంగనాథునియొక్క, కోలమ్ = అందమైన, మా = గొప్పదైన, మణి ఆరముమ్ = రత్నములచే కూర్పబడిన హారములును, ముత్తు త్తామముమ్ = ముత్యాల హారములు, ఓర్ ఎళిల్ = సాటి లేని అందమును కల్గినదియు, నీలమ్ = నల్లకలువవలె నున్నదగు, మేని = దివ్యదేహమును, ఎన్ నెఞ్జినై = నా మనస్సుయొక్క, నిఱై = అణకువను, కొణ్డదు = కొల్లగొట్టి పోయినది, ఐయో = దీనికేమి చేయుదును, ఏ = ఆశ్చర్యము.

అవ : ఒన్బతామ్బాట్టు : ఊళిపూశల్పోలే తిరుమేనియిన్ నిఱమానతు ఎల్లావఱ్ఱైయుమ్ కూడక్కొణ్డువన్దు ఎన్నెఞ్జై క్కొళ్ళైకొణ్డతు- ఎన్గిఱార్.

వ్యా: (అలమామరత్తి నిత్యాది) పెరియ ఆలమరత్తినుడైయ శిఱ్ఱిలైయిలే యశోదాస్తనన్ధయముమ్ పెరితు - ఎన్నుమ్బడి అద్వితీయనాన బాలనాయ్.

**(ఒరు పాలకనాయ్)** యశోదాస్తనన్ధయానాన కృష్ణనుమ్ మురణి త్తిరుక్కుమ్బడి ఇవనుడైయ బాల్యమ్. శెమ్పాల్ పాయానిఱ్కుమ్ బాల్యమ్.

**(ఞాలమిత్యాది)** శిఱు ప్రజైకళ్ పురోవర్తిపదార్థజ్గళై ఎడుత్తు వాయిలిడుమాప్పోలే, భూమి ప్పరప్పడైయ వయి*ఱ్ఱి*లే వైత్తానాయ్త్తు. పిళ్ళైత్తనమ్, ప్రళయత్తిల్ తన్నఘటితఘటనత్తోడొక్కుమ్ ఎన్నై అకప్పడుత్తిన అడియుమ్.

**(అరజ్గత్తరవిణైయాన్)**- సంసారప్రళయత్తినిన్షుమ్ ఎడుక్కుఱపడి. అన్ద ఆలిల్నిన్షుమ్ ఇజ్గే వరచ్చరుక్కిన ఇత్తనైకాణుమ్. అన్ద ఉఱవొన్షుమే ఇవరచ్చుమ్ కెడుక్కుఱతు ఇత్తనైకాణుమ్. "ఇప్ప్రమాదత్తోడే కూడిన శెయలై చ్చెయ్తాన్" ఎన్షు భయప్పడుమవర్కళచ్చుమ్ కెడుమ్బడి కిడక్కుఱ విడమ్.

**(అరవినణైయాన్)** - ప్రళయత్తిల్ తన్ వయి*ఱ్ఱి*లే పుకావిడిల్ జగత్తు జీవియాతాప్పోలే, సంసారికళ్ తన్ ముకత్తే వి*ழி*యావిడిల్ తనక్కు చ్చెల్లాతానపడి.

**(కోల మామణియారముమ్)** - అ*ழ*కియతాయ్, ప్పెరువిలైయనాయిరున్దుళ్ళ రత్నజ్గళాలే శెయ్యప్పట్ట ఆరముమ్.

**(ముత్తు త్తామముమ్)** ముత్తు మాలైయుమ్

**(కోలమ్)** ఇతు పెరుమాళై చ్చొల్లుకిఱతు.

**(ముడివిల్లతోరెழిల్ నీలమేని)** అవధి కాణవొణ్ణాత అ*ழ*కైయుడైయ నెయ్త్త తిరుమేని.

**(ఐయో !)** పచ్చైచ్చట్టై యుడుత్తు, త్తనక్కుళ్ళత్తై యడైయ క్కాట్టి ఎనక్కుళ్ళత్తై యడైయ క్కొణ్డాన్.

**(నిఱై కొణ్డతెన్నెఞ్జినైయే)**- ఎన్నకవాయిల్ గామ్భీర్యత్తై ప్పోక వడిత్తతు.

ఇప్పాట్టాల్ - వటదళశయనముమ్ పెరియపెరుమాళ్ పక్కలిలే యుణ్డు ఎన్గిఱార్.

---



## అరుమ్బుదమ్

*ఒన్బదామ్ పాట్టు : (ఆలమామర మిత్యాది)- (శెమ్బాల్ పాయ్కై) కేవలరక్తప్పశైయాయిరుక్కై. పదచ్చేర్త్తిక్కు తాత్పర్యద్వయ మరుళిచ్చెయ్కిఱార్. (సంవత్సరప్రళయేత్యాది వాక్యద్వయత్తాలే) (అచ్చమ్ కెడుకై)- కీழ్ సముద్రమాయ్, మేలే ఆలిలైయాయిరుక్కైయన్షిక్కే, కోయిలిలే తిరువనన్దాழ్వాన్ మేలే కణ్వళర్న్దరుళుకై. (ఆరమ్)- పదక్కమ్. 'కోలమ్" ఎన్నదు. ఆభరణచ్చేర్త్తి అழకియ మణవాళ ప్పెరుమాళుక్కు. నిఱై- నిఱై ఎల్లామెన్షుదల్; అడక్కమెన్షుదల్.*

---

**తొమ్మిదవ పాశురం : అవతారిక :** ప్రళయకాలంలో ఒక చిన్నమఱ్ఱి ఆకులో శయనించి, భగవానుడు లోకాలను ఆరగించినట్లుగా, అతని తిరుమేనివర్ణం, భగవానుని అవయవశోభ, ఆభరణశోభ – మొదలైనవి అన్నిటిని కలుపుకొని మనస్సును కొల్లగొడుతున్నది – అని ఈ పాశురంలో ఆழ్వార్లు తెలుపుతున్నారు.

**వ్యాఖ్యానమ్ : (ఆలమామరత్తినిలైమేల్ ఒరు పాలకనాయ్)** – గొప్ప మఱ్ఱిచెట్టు యొక్క చిన్న ఆకులో, "యశోద చంటిబిడ్డకూడా ఇతనికంటే పెద్దవాడు" అనే రీతిలో సాటిలేని చిన్న శిశువై,

**(ఒరు పాలకనాయ్)** – యశోద చంటిబాలుడైన శ్రీకృష్ణుడుకూడా చాలా పెద్దవాడు– అని పలికే రీతిలో ఇతని బాల్యం చనుబాలను తాగే శిశువుస్థితిలో ఉన్నది.

**(ఞాలమేழుమ్ ఉణ్డాన్)** – చిన్నపిల్లలు తమకు ముందున్న వస్తున్న వస్తువులను తీసికొని నోటిలో పెట్టుకొన్నట్లే, వటపత్రశాయిబాలుడు లోకం అంతటిని గ్రహించి నోటిలో పెట్టుకొన్నాడు. ఏవిధమైన యోగ్యత లేని నన్ను తనకు దాసునిగా చేసికోవడం. ప్రళయకాలంలో తన అఘటితఘటనాసామర్థ్యంతో చిన్న రూపంలో లోకాన్ని అంతటిని ఆరగించడంవంటిది.

**(అరజ్గత్తరవినణైయాన్)** – అక్కడ మఱ్ఱి చిగురుటాకుపై శయనించి, లోకాలను అన్నిటిని ఆరగించినట్లే, ఇక్కడ సంసారమనే ప్రళయంలోనుండి

లోకాలను అన్నిటిని ఉద్ధరించి, పరమపదానికి తీసికొనిపోవడంకోసం శ్రీరంగంలో ఆదిశేషునిపై శయనించి ఉన్నాడు. ఆ మఱ్ఱి ఆకులోనుండి ఇక్కడకు తిరువనన్దాழ్వాన్ పైకి (ఆదిశేషునిపైకి) రాగా కృశించినవానివలె శయనించి ఉన్నాడు. మఱ్ఱి ఆకులోని స్వామి ఎడమ వైపుకు కుడివైపుకు పొర్లుతూ పరుండినపుడు అతనికి ఏమీ ఆపద కల్గుతుందో! ఏమో! అని భయపడేవారు, ఆ రీతిలో భయపడనక్కరలేకుండా, అందఱు సమీపించి అనుభవించేటట్లుగా ఉన్నది శ్రీరంగం.

**(అరవిన్దణైమేల్)** – ప్రళయకాలంలో తన ఉదరంలో ప్రవేశించకపోతే లోకాలు జీవించలేని రీతిలో ఉన్నట్లే, సంసారులు తన కంటికి కనబడకపోతే తాను ధరించ లేని రీతిలో ఉన్నాడు.

**(కోలమా మణియారముమ్)** – అందమైన, వెల లేని రత్నాలతో నిర్మింపబడిన హారం – అని భావం. **"కోలమ్"** అనే పదం అందాన్ని, **"మా"** అనే పదం అమూల్యమై ఉండడాన్ని తెల్పుతున్నది. **"మణియారమ్"** అనే పదం రత్నాల మాలను తెల్పుతుంది. తరువాత **"ముత్తుత్తామమ్"** అని ముత్యాల మాలను నిర్దేశించడంవల్ల ఇక్కడ **"ఆరమ్"** అనే పదం పతకాన్ని తెల్పుతుంది" – అని అరుంబదవివరణం.

**(ముత్తుత్తామముమ్)–** ముత్యాలమాల – అని అర్థం. **"కోలమామణియార ముమ్", "ముత్తుత్తామముమ్"** అనే పద సందర్భాలు భగవానునకు ఆభరణాల చేరికవల్ల కల్గిన అందాన్ని తెల్పుతున్నవి.

**(ముడివిల్లదోర్ ఎழిల్ నీలమేని)** – ఎల్లను చూడడానికి సాధ్యం కాని అందాన్ని కల, ప్రకాశించే తిరుమేని.

**(ఐయో) – "పచ్చై మామలైపోల్ మేని"** (తిరుమలై–2) (మరకతమహాగిరి వంటి మేని) అనే తన తిరుమేని అందాన్ని అంతటిని చూపి, నాకున్నదానిని అంతటినీ కొల్లగొట్టాడుకదా! అయ్యో!

**(నిఱై కొణ్డదు ఎన్ నెఞ్జినైయే)** – నా మనస్సులో ఉండే గాంభీర్యాన్ని అంతటినీ కొల్లగొట్టింది.

ఈ పాశురంలో వటపత్రశాయిస్వామిస్వభావం శ్రీరంగనాథునిలో ఉన్నదని అన్నారు.



**10. కొణ్డల్వణ్ణనై, కోవలనాయ్ వెణ్ణెయ్**
**ఉణ్డ వాయన్ ఎన్నుళ్లమ్ కవర్న్దానై,**
**అణ్డర్కోన్ అణియరఙ్గన్, ఎన్నముదినై**
**క్కణ్డ కణ్కళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే**

కొణ్డల్ వణ్ణనై = నీటిని పానము చేసిన మేఘమువంటి రూపమును కల్గినవాడును, కోవలన్ ఆయ్ వెణ్ణెయ్ ఉణ్డ వాయన్ = గోపాలకుడై జన్మించి వెన్నను ఆరగించిన నోటిని కలవాడును, ఎన్ ఉళ్లమ్ = నా మనస్సును, కవర్న్దానై= కొల్లగొట్టినవాడును, అణ్డర్ కోన్ = నిత్యసూరులకు నాయకుడును, అణి అరఙ్గన్= (భూమండలమునకు) అలంకారమైన శ్రీరంగమున శయనించి యున్నవాడును, ఎన్ అముదినై = (నాకు పరమభోగ్యమగు) అమృతమై యున్నవాడును అగు శ్రీరంగనాథుని, కణ్డ కణ్గళ్ = సేవింపగల్గిన (నా) కన్నులు, మఱ్ఱు ఒన్ఱినై = వేఱు దేనిని (చివరకు పరమపద నాథునికూడ), కాణా = దర్శింపవు, ఏ = ఆశ్చర్యము.

అవ : నిగమత్తిల్, ఇవ్వళవుమ్ జ్ఞానసాక్షాత్కారమ్; మేల్, లోకసారఙ్గ మహామునికళ్ తోళిల్ వన్దు పుకున్దు విణ్ణప్పమ్ శెయ్కిఱార్, పెరియ పెరుమాళ్ఴకై క్కణ్డకణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణా-ఎన్గిఱార్.

వ్యా : **(కొణ్డల్ వణ్ణనై)-** తాపత్రయత్తాలే విడాయ్త్త తమ్ విడాయ్ తీరుమ్పడియాయ్, "అద్రౌ శయాళురివ శీతళకాళమేఘః" ఎన్గిఱపడియే యుడైవన్. పన్నీర్కుప్పిపోలే ఉళ్ళుళ్ళవై యెల్లామ్ పుఱమ్బే నిழలిట్టపడి.

**(కోవలనాయ్ వెణ్ణె యుణ్డ వాయన్)-** ఇడైయనాయ్ వెణ్ణె యుణ్డ తిరుప్పవళత్తై యుడైయవన్. చక్రవర్తితిరుమకనాకిల్ వెణ్ణె యుణ్ణవొట్టార్కళెన్ఱు కరుత్తు.

**(కోవలనాయ్)** అభిజాత్యమ్ పెరుమాళుక్కు, కట్టుణ్బాతు అడియుణ్బా తాక కిడైక్కుమో ?

**(వెణ్ణెయుణ్డ వాయన్)** - కళవు కణ్డు ఒళిత్తు వన్దు కిడక్కిఱవన్. పెరియ పెరుమాళ్ కొఱుట్టై మోన్దు పార్త్తాల్ ఇప్పోతుమ్ వెణ్ణెయ్ నాఱానిఱ్కుమ్.

**(ఎన్నుళ్ళమ్ కవర్న్దానై)**- ఎన్నెఞ్జై అపహరిత్తవనై. కోవలనాయ్ వెణ్ణెయుణ్డాప్పోలే, కొణ్డల్ వణ్ణనాయ్ ఎన్నుళ్ళమ్ కవర్న్దవనై. యశోదై ప్పిరాట్టియుడైయ వెణ్ణెయిలే పణ్ణిన శ్రద్ధైయై ఎన్నెఞ్జిలే పణ్ణి భుజిత్తవనై. కుఴి యఴియాతిరుక్క వెణ్ణెయ్ కుడిపోనాప్పోలేయాయ్త్తు, ఇవరుడమ్బిరుక్క అకవాయ్ కుడిపోనపడి.

**(అణ్డర్కోన్)**- తిరువాయ్ప్పాడి యిడైక్కులత్తుక్కు నిర్వాహకన్- ఎన్నుతల్; అణ్డాన్తర్వర్తికళాన ఆత్మవర్గత్తుక్కు నిర్వాహకన్ -ఎన్నుతల్.

**(అణి యరఙ్గనెన్నముతినై)** దేవర్కళుడైయ ఉప్పుచ్చాఱుపోలన్ఱు, ఇవరుడైయ అమృతమ్.

**(ఎన్నముతినై)**- బ్రహ్మాదికళుక్కు చ్చాకామల్ కాక్కు మమృతమాయిరుక్కుమ్.

**(కణ్డ కణ్గళ్)** శువై అఱిన్ద కణ్గళ్. శ్రవణేన్ద్రియమాత్రమన్ఱియే విడాయ్ తీర క్కణ్డ కణ్గళ్.

**(మఱ్ఱొన్ఱినై క్కాణావే)**- "భావో నాన్యత్ర గచ్ఛతి"పోలే కణ్గళుక్కు ప్పచ్చైయిట్టాలుమ్ వేఱొరు అర్చావతారమ్, అవతారవిశేషమ్- ఇవఱ్ఱై ఇప్పడి విరుమ్బి భోగ్యమెన్ఱు కరుతాతు. కాట్చి యొఴియ వేఱొరు ఫలమ్ శొల్లావిట్టతుమ్ ఫలముమ్ కాట్చియేయాకైయాలే. ముక్తప్రాప్య మెన్ఱు ఒరు దేశవిశేషత్తిలే పోనాలుమ్ "సదా పశ్యన్తి"యిఱే.

తమ్మై చ్చొల్లుతల్, పాట్టుక్కు సఙ్ఖ్యై శొల్లుతల్ శెయ్యిల్, అక్కరైమేల్ యిరుక్కిఱ అల్లాత ఆఴ్వార్కళోడొప్పర్. అన్తమితాన్యభావమామ్బడి అఴకిలే యీడుపట్టు, తమ్మై మఱన్దార్. "నోపజనం స్మరన్నిదం శరీరమ్" ఎన్గిఱపడియే



ముకప్రాప్యమాన పురుషార్థత్తై అనుభవిత్తార్- ఎన్నైయాలే ఎల్లామ్ అవన్ శొల్లేయాయ్ విట్టతు.

ఇప్పాట్టిల్ - కృష్ణనుడైయ పడియుమ్ ఇఙ్గే యుణ్డు- ఎన్గిఱార్.
పెరియవాచ్చాన్పిళ్ళై అరుళిచ్చెయద వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు
పెరియవాచ్చాన్ పిళ్ళై తిరువడిగళే శరణమ్

## అరుమ్బుదమ్

పత్తామ్ పాట్టు : *నిగమత్తిల్, (కొణ్డల్- ఇత్యాది) వణ్ణమ్- నిఱమాదల్, స్వభావమాదల్, ఔదార్యగుణమాదల్. ఇత్తై అరుళిచ్చెయ్కిఱార్. (పని నీరిత్యాది) పదాన్వవయత్తోడే యాదల్, ఇరున్దపడియే యాదల్. ఇవఱ్ఱై వాక్యద్వయత్తాలే అరుళిచ్చెయ్కిఱార్. (కోవలనాయిత్యాది) (పచ్చై యిడుకై). ఇవరై యొఴిన్దవర్కళ్ స్వస్వగుణఙ్గళై క్కాట్టి వశీకరిక్కప్పార్త్తాలుమ్ - ఎన్ఱపడి. సంఖ్యై శొల్లామైక్కు హేతు అరుళిచ్చెయ్కిఱార్ (నోపజనం స్మరన్- ఇత్యాది)*

అమలనాదిపిరాన్ వ్యాఖ్యానారుమ్బుదమ్ ముఱ్ఱిఱ్ఱు
జీయర్ తిరువడిగళే శరణమ్.

**పదవ పాశురం : అవతారిక :** ఇంతవరకు గడచిన తొమ్మిది పాశురాలు– లోకసారంగమహాముని భుజాలపై వేంచేసి ఉండి, కోవెలకు వచ్చే దారిలో తిరుప్పాణ్ ఆఴ్వార్లు భగవానుని జ్ఞాననేత్రంతో దర్శించి పల్కిన పాశురాలు. భుజాలను అధిరోహించి వచ్చి శ్రీరంగాలయాన్ని ప్రవేశించి శ్రీరంగనాథుని సాక్షాత్తు దర్శించిన తరువాత ఈ పదవ పాశురాన్ని, అనుగ్రహిస్తున్నారు. ఆ స్వామిని నేరుగా దర్శించిన నేత్రాలు వేఱు దేనినీ చూడవు– అని పల్కి ప్రబంధాన్ని పూర్తిచేస్తున్నారు.

**వ్యాఖ్యానమ్ : (కొణ్డల్ వణ్ణనై)** ఈలోకంలో సంసారిజీవులకు కలిగే మూడు విధాలైన తాపాలవల్ల పొందిన తమ క్లేశం తీరేటట్లుగా – అని భావం. **"సించేదిమం**

**చ జన మిందిరయా తటిత్వాన్ భూషామణిద్యుతిభి రింద్రధనుర్ధానః, శ్రీరంగధామని దయారసనిర్భరత్వాత్ అద్రౌ శయాళురివ శీతలకాలమేఘః"** (శ్రీరంగరాజస్తవం–పూర్వ– 82) (లక్ష్మీదేవి అనే మెఱపును కల్గినది, ఆభరణాలలోని మణుల కాంతి అనే ఇంద్ర ధనుస్సును ధరించి ఉండేది, కృప అనే జలంతో నిండుగా ఉండడంవల్ల శ్రీరంగ దివ్యక్షేత్రమనే కొండపై శయనించి ఉండేది అయిన చల్లని నీలమేఘంవలె భాసించే శ్రీరంగనాథుడు నన్నుకూడా అభిషేకించుగాక! – చల్లబఱచుగాక) అనే రీతిలో వర్షం కురవడం ఆరంభించిన కాలమేఘంవలె ఉండే వర్ణాన్ని కల్గినవానిని. పన్నీరు చెంబువలె లోపల ఉన్నవి అన్నీ బయటకు ప్రకాశించేటట్లుగా ఉన్నాడని భావం.

**(కోవలనాయ్ వెణ్ణెయ్ ఉణ్డ వాయన్)** – గోపాలుడై, వెన్నను ఆరగించిన, పగడంవంటి ఎఱ్ఱని అధరాన్ని కలవాడు. చక్రవర్తికుమారుడైతే (శ్రీరాముడైతే) వెన్నను ఆరగించడు. కనుక,**"కోవలనాయ్"** (గోపాలుడై) అని అంటూ శ్రీరంగ నాథుని నిర్దేశిస్తున్నారు.

**(కోవలన్)** – శ్రీరంగనాథుని శ్రీకృష్ణుని రూపంలో అనుభవించిన రీతిని ఈ పదం తెల్పుతున్నది. శ్రీరాముడై ఉంటే తల్లి చేతులతో కట్టుబడడం, దెబ్బలు తినడం మొదలైనప్రయోజనాలు సిద్ధించవు కదా!

**(వెణ్ణెయ్ ఉణ్డ వాయన్)** – వెన్నను దొంగతనం చేయగానే శ్రీరంగదివ్య క్షేత్రానికి వచ్చి దాగి ఉండేవాడు – అని భావం. శ్రీరంగనాథుని కపోలాలను ఆఘ్రాణిస్తే ఇపుడుకూడా వెన్నవాసన పరిమళిస్తుంది సుమా – అని పూర్వా చార్యులు (హార్దంగా) అంటారు.

**(ఎన్నుళ్ళమ్ కవర్న్దానై)** – నా మనస్సును కొల్లగొట్టినవానిని – అని భావం. **"వెణ్ణెయ్ ఉణ్డ వాయన్ ఎన్నుళ్ళమ్ కవర్న్దానై"** – అని అన్వయిస్తే గోపాలుడై వెన్నను ఆరగించినట్లే, కాలమేఘువర్ణుడై నా మనస్సును కొల్లగొట్టినవానిని – అనే హార్దభావం వ్యక్తమవుతుంది. యశోదాదేవియొక్క వెన్నెలో కల అభినివేశాన్ని నా మనస్సుపట్ల పొంది, దానిని అనుభవించినవానిని. యశోదపెట్టిన గుర్తు చెడకుండా



వెన్నను దొంగిలించేటట్లే, వీరి (ఆళ్వార్లు) శరీరంతో ఉండగానే వీరి మనస్సును అపహరించాడు – అని భావం.

**(అణ్డర్‌కోన్)** – **"అణ్డర్"** అనే పదానికి "గొల్లలు" అనే అర్థాన్ని గ్రహిస్తే, రేపల్లెలోని గొల్లకులానికి ప్రభువు – అని దీని అర్థం. **"అణ్డర్"** అనే పదానికి ఈ బ్రహ్మాండం లోపల ఉండేవారు – అనే అర్థాన్ని గ్రహిస్తే, అండంలోపల ఉండే ఆత్మలన్నిటికి ఈశ్వరుడనే అర్థాన్ని ఈ పదం ఇస్తుంది.

**(అణియరఙ్గన్ అముదినై)** దేవతలకు, సముద్రం చిలికినందువల్ల పుట్టిన ఉప్పుచారు అమృతమైనది. శ్రీరంగనాథుడనే వీరి అమృతం దానికంటే చాలా మధురమైనది.

**(ఎన్ అముదినై)** ఆ అమృతం బ్రహ్మమొదలైన దేవతల దేహాన్ని చావకుండా కాపాడుతున్నది. నా అమృతమైన ఇది నా ఆత్మనుకూడా నశించకుండా కాపాడుతున్నది.

**(కణ్ణ కణ్‌గళ్)** – స్వామిని దర్శించి, అతని భోగ్యతను తెలిసికొన్న నేత్రాలు – అని భావం. ఇంతవరకు చెవులలో వినడంవరకే జరిగింది. ఇపుడు నా తాపం తీరేటట్లుగా దర్శించిన నేత్రాలు

**(మఱ్ఱొన్ఱినై క్కాణావే)** హనుమానుడు **"భావో నాన్యత్ర గచ్ఛతి"** (రామాయణం ఉత్తర–40–15) (నా భావన శ్రీవైకుంఠనాథునిపట్ల ప్రవర్తించడం లేదు) అని శ్రీరామునివద్ద పల్కినట్లే ఆళ్వార్లు పల్కుతున్నారు. నా కన్నులకు కూలి ఇచ్చినా, వేఱొక అర్చావతారాన్నిగాని, లేక, విభావతారాన్ని గాని ఆదరించి దీనివలె భోగ్యంగా గ్రహించదు. వేఱొక ప్రయోజనాన్నిగూడా పలుకకుండా **"కాణావే"** అని దర్శనాన్నిగూర్చి పల్కడం అతనిని ఆశ్రయించి పొందే ఫలం దర్శనమే కనుక, **"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షురాతతం తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే విష్ణోర్యత్ పరమం పదమ్"** (ఋగ్వేదమ్–విష్ణుసూక్తమ్–సామవేదమ్–3–18–2–4) (విష్ణువుయొక్క ఆ పరమపదాన్ని నిత్యసూరులు ఎల్లప్పుడు దర్శిస్తున్నారు. (ఆ పరమపదం) అన్నిటిని ప్రకాశింప జేసేవాడు, ఆకాశంలో ఉండేవాడు, లోకాలకు అన్నిటికి నేత్రభూతుడు అయిన

సూర్యునివంటి ప్రకాశాన్ని కల్గినది. విష్ణువుయొక్క ఏ పరమపదం ఉన్నదో, అందులోని మేధావులు, స్తుతించడమే స్వభావంగా కలవారు, జాగరూకులై ఉండేవారు అయిన నిత్యసూరులు ప్రకాశిస్తున్నారు) అని ఎల్లప్పుడు అతనిని దర్శిస్తూ ఉండడమే ఫలమై ఉంటుంది. మిగిలిన ఆ*ழ*్వార్లవలె, తమ తిరునామాన్ని పల్కడం, పాశురాల సంఖ్యనుగూర్చి పల్కడం – మొదలైనవానిని చేయనందువల్ల, వారివలె వీరు తీరంపై మాత్రమే నిలచి శ్రీరంగనాథుడనే అమృతనదిలో అవగాహించినవారు కారు. అందులో పూర్తిగా మునిగి ఆనందించినవారు – అని తెలుస్తున్నది. వేఱొక విషయంలోని స్మరణ ఏమీ లేకుండా, శ్రీరంగనాథుని అందంలోనే అభినివేశాన్ని పొంది, తమను మఱచిపోయారు. **"నోపజనం స్మరన్నిదం శరీరమ్"** (ఛాందో–8–12–3) (బంధుజనాలకు దగ్గరలో ఉండే తన పూర్వశరీరాన్ని ముక్తుడు స్మరించడం లేదు) అనే రీతిలో ముక్తులచే పొందబడే ఫలమైన భగవానుని అనుభవించారు– అని అన్నందువల్ల, అతనినిగూర్చిన ప్రస్తావంతోనే ఈ ప్రబంధం ముగిసింది. ఈ పాశురంలో, శ్రీకృష్ణుని స్వభావం శ్రీరంగనాథునిలో ఉన్నది – అని ఆ*ழ*్వార్లు అన్నారు.

**అమలనాదపిరాన్ ప్రబంధానికి పెరియవాచ్చాన్‌పిళ్ళై**
**వ్యాఖ్యానాంధ్రీకరణం సంపూర్ణమ్**

